# పీఠిక.

సత్యవేదము నందుఁగల నూతననిబంధన నంతను తెనుఁగునఁ బద్య కావ్యముగ రచింపఁ బూనుకొని సువార్త చతుష్టయమునుఁ నాంధ్రీకరించి యుంటిని. అపొస్తలుల కార్యముల నాంధ్రీకరించు చుంటిని. ఈ యాంధ్రీకరణ కార్యమునకై సత్యవేదము నంతను సవ్యాఖ్యానముగ బరిశీలించి చదివి యుంటిని. క్రైస్తవ గ్రంథకర్తలలోఁ బ్రముఖులగు హెక్కుండ్రె గ్రంథములం జదివితిని. పఠనకాలమున హైందవ క్రైస్తవ మత ద్వయమునకును సమాన ధర్మము లనేకస్థలముల బొడకట్టసాగెను. ఈదృష్టితో నవలోకింప నీరెండు మతములేక స్థానమునుండి వెలువడి యుండ నోపునను భ్రమ హెచ్చఁ జొచ్చెను. వైపరీత్యములఁ గల్పింప నెంచక సామరస్యము నారయుతలంపున దొరకొనిన విశేషములు వెలువడఁగలవని స్ఫురించెను. మతమను నది యొక దేశమునకుఁ గాని యొక కాలమునకుఁగాని యొక తెగకుగాని ప్రత్యేకముగా నియమింపఁబడి యుండ నేరదు. ఇయ్యది ముక్తిమార్గాను రక్తులకందఱకు సమమైన హక్కుగల యాస్తివంటిది. బైబిలునం దాత్మతత్త్వ విషయము లనేకస్థలముల ననేక రీతుల వర్ణింపఁ బడియుండుటంజేసి తజ్జ్ఞానాన్వేషులకిది భూతాదికొట్టు వంటిది. కావుననే యీ బైబిలు దైవదత్తమని యెంచఁబడు చున్నది. దైవజ్ఞానమునందే |యేతరగతియందుండు వారల కాయా తరగతుల కనుగుణములగు సంగతుల నెఱుకపరచును. తత్త్వమసీత్యాదివాక్య నిజ తత్త్వజ్ఞులగు వారలకింపగు నర్థములా వాక్యములనుండియే వెలువడును. వారలకంటె గొంచెము తక్కువ దశయందుండు వారల యభివృద్ధికనుగుణములగు బోధలు వారికి స్ఫురించును. తత్త్వజ్ఞానాన్వేషణమున

ప్రారంభ దశయందుండు వారల కక్షరాభ్యాసము జేయదగు సంగతులు నందు బొడకట్టి వారల నాకర్షింపఁ గలవు. ఇట్టిప్రభావము కలది సత్యవేదము. బైబిలునంతను నేను బూర్తిగఁజదివి తత్సారము నంతను పూర్తిగ గ్రహించితినని నమ్మికగాఁ జెప్పగల వారెవ్వరు నుండరు. ఈ విషయమునఁ దెల్లవారనిగాని నల్లవారనిగాని భేదమేమియు నుండఁ జాలదు. దేవుఁడు తనపరిశుద్ధాత్మ నందఱి మీఁదికిని సమముగాఁ బంప సమర్థుఁడు. ఇందునుగూర్చి రివరెండు డేలను పాశ్చాత్య ప్రాసంగికుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు:—

"దేవుని వాక్యము నవీనదేశముల యందు వేరునునాటి నూతనాకాశములయందు వర్ధిల్లినప్పుడు వర్ధింప శక్యముకాని క్రొత్తరీతుల నభివృద్ధి జెందును. పాశ్చాత్యులకు శక్యముకాని క్రైస్తవ పరిపూర్ణావస్థ తూర్పువారికి కరతలామలక మగును. పశ్చిమఖండ వాసులెన్నఁటికి స్వయం కృషివలన సాధింప శక్యముకాని దివ్యజ్ఞానమును దూర్పుఖండ వాసు లవలీలగ గ్రహింపఁగలరు. క్రీస్తువెనుక పదునెనిమిది వందల వత్సరముల నుండియు పలుకుచుండిన పలుకులను మనము గ్రహింపఁ జాలకుంటిమి గాని తూర్పుదేశస్థుల శ్రవణేంద్రియములు పరలోక వాక్యముల వినుటయం దెక్కువ నేర్పుకలవి గావున వారు గ్రహింపఁగలరు. మన బోధనా సంఘము లాదేశములలో విజయ పతాకముల నాటినప్పుడు చైనా, ఇండియా దేశములలోని ఋషులు భగవంతుఁడు క్రీస్తుద్వారా తెలియచేసిన ప్రకటనలను మనకు తెలియఁజెప్పఁగలరు."

పైవాక్యముల నిందు బొందుపరచుటలో వర్ణాశ్రమ భేదములు గాని దేశకాల భేదములుగాని దైవతత్త్వ విమర్శనమున న్యూనాధిక్యతల నందనేరవని సూచించుటయే గాక యీచిన్నిపొత్తము విద్యావిశేషములయందత్యున్నత దశనందని వానిచేత వ్రాయఁబడినదని చులకనఁ జేయక శ్రద్ధతో నిందుఁగల సంగతులఁ జదివి పరిశీలించి సారమున్న గ్రహింప వలయునని చదువరులఁ బ్రార్థించుటయుఁ గూడనై యున్నది.

ఎవ్వారైనను దాము పుట్టి పెరిగిన వంశస్థుల మతమునకు వ్యతిరిక్తముగా నుండు తలంపులను, నూహలను, వానియందుఁగల సత్యమును గ్రహింపగల యోర్పును కలిగియుండుట దుర్లభము. మతమనునది మనుజుని మోక్షమునకుఁ జేర్పఁదగిన దగుట నొకరి సొత్తు కాదు. మనుజుఁడై పుట్టిన ప్రతివాఁడు లోకమున బయలు వెడలిన ప్రతిమతమును పరిశీలించి గుణగ్రహణమును చేయుటకును తద్వ్యతిరిక్తమును విసర్జించుటకు నర్హుఁడై యున్నాఁడు. వాని బుద్ధివైశద్యమును వినియోగించి వివిధమత ప్రయుక్తసూత్రార్థములఁ బ్రకటింప నర్హతగలదు. నిజమైనమతమును గ్రహించి యవలంబింపఁ దలంపుగల ప్రతివాఁడును నిట్టియభిప్రాయ భేదముల నన్నింటిని బరిశీలించి సత్యాన్వేషణమును జేయుట కర్తవ్యము. పూర్వోక్తభిన్నాభిప్రాయాంతరముల నెవ్వియైని లోపములుండిన లోకసంరక్షణార్థము వానిని వెల్లడించుటయు సజ్జనునికి విధియై యున్నది. అందువలన తత్తద్గ్రంధ విలేఖకులును పాఠకులును గూడ లోపములుండిన సవరించుకొనుటకును లేనిచో తమతలంపుల నిర్ధారణ చేసికొనుటకును వీలగును. కత్తికి సానబట్టిన పదునువచ్చును గాని మొక్కపోనేరదు.

ప్రపంచమున ననేక రకములుగ వెలువడు ననేక మతముల ననేక రీతులఁ బ్రజలు దలంచెదరు. ఏమతమైనను సరే మన తలిదండ్రులవలంబించిన దానినే యథావిధిగ ననుసరించిన చాలునని కొందఱి తలంపు. ప్రతి మతమును తన్మతస్థులకు ముక్తిదాయక మగునను వారీ తరగతిలోనివారే. నాస్తికులు కాకుండిన చాలునని కొందఱు తలంచెదరు. దేవుని పితృభావమునను లోకములోని ప్రజల సంతతిని భ్రాతృభావమునను దలంచి సంచరించిన వారికి ముక్తితనంతట తానే వశ్యమగునని వీరినిశ్చయము. మఱికొందఱన్ని మతములును నిజములు కానేరవనియు వీనియం దొక్కటియే నిజమైనదికానోపుననియు తద్భిన్నములన్నియు కృత్రిమములనియు భావించెదరు. ఇవి యేవియు సరియైనవి కావని నాయభిప్రాయము.

భగవంతుని సృష్టియొక్క వైశాల్యముతోఁ బోల్చిచూచినచో మనకాకరమైన యీభూలోకము సముద్రమున నొకయిసుక రేణువు వంటిది, ఆద్యంత రహితమైన యనకాశమున నొకయణు ప్రమాణమైనది. జ్యోతిష శాస్త్రజ్ఞుల యనుభవమును పరికించినచో నాకాశ మండలమునఁగల నక్షత్రాది గ్రహకూటముల వ్యాపకము నవలోకించినచో నీసకల ప్రపంచమునకు నాధార భూతుఁడగు సృష్టికర్త దీనినంతను సహేతుకముగ నొక కార్యమునకై నిర్మించి పరిపాలించు చున్నాఁడని గోచరింపక మానదు. మనబుద్ధిని ప్రకాశింపఁజేసి విమర్శింపఁ దగినంత దూరము విమర్శించిచూచిన సృష్టికంతకు మనుష్యుని ప్రధానునిగ ధాత నిర్మించెనని తోఁపగలదు. మనుజుని సృష్టిలోని సకల విశేషముల ననుభవింపఁదగిన యున్నత జీవునిగా నిర్మించిన విధాత, తనసృష్టి కగ్రాసనాధిపతియగు మనుజుఁడు పాపభారమున పతితుఁడగుచుండ మిన్నకుండునని భావించుట యసంభవము. కావున సృష్ట్యాదిని మనుజుని పరమ పవిత్రునిగ నిర్మించెననియే యూహింపనగును. అట్టి పవిత్రోత్పత్తిగల నరుఁడెట్టుల పాపమునకు లోఁబడెనని విచారింప వలయును. స్వభావ సిద్ధముగా మనమందఱమును మనపిల్లలు మనలను బలాత్కారమునగాక స్వబుద్ధిని సహజ ప్రేమచే గౌరవించ వలయునని కోరెదము. సర్వశక్తిమంతుఁడగు భగవంతుఁడును అట్లే తలంచెను. ప్రేమ స్వరూపుఁడైన జగత్కర్త సదసద్విమర్శ నాజ్ఞానమును అందయోగ్యము నేని యోగ్యము నేనిఁ జేయఁగల స్వాతంత్ర్య శక్తిని దయచేసెను. పశ్వాది సకలజంతుజాలమునకును మానవునకును గల తారతమ్యము వీనికి చిత్తవృత్తి నాచరింపఁగల సామర్థ్యము కలుగుటయే. ఈశక్తియొక్క నరునకే కలదు. తదితర జంతు సముదాయమునకీ శక్తిలేదు.

ఏతత్సామర్థ్య ప్రధానము మనుజునికి తదితర సృష్టిలోఁబడి వాని సౌఖ్యార్థము వినియోగించుట కేర్పడినదని ప్రబోధించుచున్నది. ఇట్టి మనుజుఁడు తనకు దయామయుఁడగు స్రష్టదయచేసిన స్వతంత్రశక్తిని సద్వి

నియోగపరచి భగవంతుని సేవయందు వినియోగ పరచిన యెడల నేటిదనుక
సృష్టికంతకు నధిపతియైయుండును. కాని తనస్వాతంత్ర్యమును దుర్విని
యోగపరచి మనుజుఁడు పాపియై సకలకష్టములకును లోనాయెను. నరుని
పతితముదినది నాభివృద్ధియై వానికిని వాని జననమున కాధారభూతుఁడైన
భగవంతునికిని మధ్యనొక పెద్ద యఘాతమేర్పడినది. ఇట్టితరుణమున నరుని
యొక్క పాటును తిలకించి వాని సృష్టికి కర్తయైన భగవంతుఁడు నరున
కొసఁగినశక్తిని దుర్వినియోగ పరచి నాశనమగు చుండుటకుఁ గినిసివానిని
లేవనెత్తుటకు కృషిచేయుట సహజము. మనమెద్దియేని నొక సత్కార్యా
చరణమునకు దొరకొనిన నాకార్యమతి యోగ్యమైనదైనను తుదకది జయ
ప్రదముగ నెరవేరునదైనను తదుపక్రమోప సంహార కాలాంతరమున ననేక
చిక్కులు తటస్థించక మానవు. [కించిజ్ఞులమగు మనముచేయు కార్యముల కే
మధ్యమధ్య నిట్టియంతరాయములు కలుగుచుండ ననంతమగు] నీప్రాపంచిక
సృష్టికార్యమున జిక్కులు తటస్థించెననుట యొక వింతయా? సర్వజ్ఞుండగు
టచే భగవంతునకీ యంతరాయము లన్నియు దృగ్గోచరములే యైయుండినను
వానినిబూర్తిగ నివారించి సృష్టికి దొరకొనుట యసంభవము. ఇవితప్పనివి.
మనము జేయుకార్యములలో ముందురాఁబోవు నడ్డంకుల గ్రహింపలేక పో
దుము. కొన్ని సమయములయందు దూరదృష్టికలవారట్టి వానిలోకొన్నిఁటిని
గ్రహింపఁగలిగిన నవి యని వార్యములని భరింపనెంతురు. భగవంతుఁడో !
యట్లుకాదు. సర్వజ్ఞుండగుటచే పాపము సృష్టినావరింపఁగలదని యెఱుఁ
గును. పాపముయొక్క జీతము మరణమేయనియు వానికి గోచరమే. సర్వ
శక్తిమంతుఁడగుటచే నీపాపభారమునుండి మనుజుల విముక్తులఁజేయఁగల
సాధనోపాయమును గూడ నేర్పరచెను. ఇయ్యదివాని కసాధ్యముకానేరదు.
తానొక్క మాటతో పాపమును తుడిచిపెట్టరాదాయని కొందఱును, అటులఁ
జేసిన 'పాపముయొక్క జీతము మరణమని' తాను విధించిన విధిని తానే
నిరసించినవాఁడగును. తాను మానవావతారమెత్తిన 'నేకక్రియాద్వ్యర్థకరీ
బభూవ' యను నట్లగును. పాపులకు విధింపఁబడిన మరణదండనను తానే

యనుభవించి మానవజాతిని యాత్మ మరణమునుండి విముక్తులఁజేయుట మొదటిది. ఇందు వలన వాని న్యాయస్వరూపమునకు భంగము కలుగనేరదు. రెండవది ప్రజలుచూచి యనువర్తింపఁదగిన పావన చారిత్రమును తానే నడిపిచూపుట యైయున్నది. ఈకార్య ద్వయమును తానే మనుష్యావతార మెత్తుటవలన నెరవేరినవి. పూర్వోత్తరసందర్భములనుబట్టి విచారించిచూచినచో సృష్టికి పూర్వమే భగవంతుఁడు తాను నరావతార మెత్తుటకు నిశ్చయించుకొనిన యెడలను నట్టియవతారము కర్తవ్యమేయైన పక్షమునను తానొక్కసారి యవతరించెననుట సమంజసము. విశ్వమంతటితోఁబోల్చి చూచినచో భూలోక మత్యల్పమైనదని యిదివఱకే చెప్పియుంటిమి. ఇట్టి విపులమగు విశ్వమును పుట్టించిన సర్వజ్ఞుఁడును సర్వశక్తి మంతుఁడునునగు భగవంతుఁడు నర రూపధారియగుటయే కర్తవ్యమైనప్పుడీయణు ప్రమాణమగు భూమియందు జనించిన మానవుల సంరక్షణార్థ మొకసారి యొకచోట తానవతరించె ననుట యుక్తముగాని యీభూమియందలి పెక్కుతావులంగలవారికొఱకు పెక్కవతారముల నెత్తెననుట భావ్యముకాదు. జార్జి చక్రవర్తిగారిండియాకు వచ్చి యెద్దేని నొక ముఖ్యపట్టణమున పట్టాభిషిక్తులై రనుట న్యాయముగాని కొరిటిపాడునకును, కాకానికిని, చేటపట్టునకును, జాలిపూడికిని వచ్చిరని చెప్పుట విశ్వాస పాత్రమా? మానవుఁడైన చక్రవర్తి విషయమే యిట్లుండ నెవ్వరితోనైన పోల్చుటకవకాశములేని భగవంతుఁడూరూర నవతరించెనని చెప్పవచ్చునా? ఒక్క యవతారమే ప్రపంచకమునందంతటను తనకాంతిని, నీతిని, ఖ్యాతిని వ్యాప్తముచేసి ఘనీభూతముచే యసమర్థతగలిగి యుండఁగా ననేకావతారముల ధరించుట వ్యర్థముకాదా? ఈలోకముయొక్క దురవస్థ ననుసరించి యొకసారి భగవంతుఁడవతరింపవలసి వచ్చెనన వచ్చునుగాని యాయవతారముల రెట్టించి హెచ్చించుట తగదు. అట్లుచేయుట దేవుని మార్గములు మనకు తెలియవని యొప్పుకొనుటయే. ప్రపంచమునందే కొంచనుండినను మానవస్వభావమొక్కటియే. నాగరకతాభివృద్ధి పెరిగినకొలఁది భగవద్దివ్యగుణానుభవము దేశ

మంతటను వ్యాప్తమైన కొలఁది దేవదత్తములగు నీతిమతసాంఘికాచార ములు దిగంత విశ్రాంతములై యేకరీతి నాచరింపఁబడఁగలవు. ఇది సమంజసమని తోఁచి ననేకావతార మర్మమని తోపక మానదు. కావున మంచిచెడ్డలను కలగలిపి భాగవతోక్తంబగు శ్రీ కృష్ణుని చర్యలొక దేశమునకును నవీన నిబంధన స్థములగు యేసు ప్రభవుని చర్యలింకొక దేశమునకును తగియుండెడి నీతి మతోపదేశములని తలంచుట యుక్తముకానేరదు. అటుల చెప్పనెంచిన నొకే స్వభావముకల మానవజాతికి పశ్చిమ ఖండవాసులగుట నట్టివారికొక విధమైన నీతియు మతియొక ఖండవాసులగుట నట్టివారికింకొక విధమైన నీతియు సమంజసమగునని ద్వ్యర్థిని కల్పించుటయేయగును. ఇది సరికాదని నానమ్మకము. ఇదికాక యింకొక చిక్కు కలుగును. ఒక్క యవతారముతో తృప్తినందని యెడల దేశదేశమున కొక్కొక్క యవతారమును, యూరూరున కొక్కొక్క యవతారమును, కల్పింప వలసివచ్చితుదకు ప్రతిమానవునకును భిన్నావతారము కావలసివచ్చి మనుజులెందఱో యవతారములన్నిగా నేర్పడవలసిన దురవస్త తటస్థించును. దీనినంత దూరము తరుముట వెఱ్ఱితనముకాదా?

దేశచారిత్రమును మనము చదివిన మానవజాతి దినదినాభి వృద్ధినందుచున్నదని సుబోధమగును. ప్రతి శతవత్సరాంతమున లోకములోని జనసంఖ్య యించుమించుగనిను మడించుచుండును. ప్రస్తుతపు కాలపు జనసంఖ్యనుబట్టి పైరీతిని కొన్ని వేల సంవత్సరములవఱకు వెనుకకు దిగభాగించినచో నప్పటి జనసంఖ్య ప్రకృతపు సంఖ్యకంటె నెక్కువ రెట్లు తక్కువగ నుండును. ప్రాపంచిక ప్రకృతావస్థనుబట్టి యేయొక్క యవతారము జనులందఱిని సంరక్షించుటకు చాలియుండునని తోఁచుచుండ నాకాలమున నొక యవతారము చాలదని తలంచుట భావ్యముకాదు. ఈ యూహయుక్తి యుక్తముగనున్నదని తలంచినచో మిగిలినది సులభసాధ్యము. హిందువులు, యూదులు, మున్నగు పెక్కు మతస్థులు భగవంతుఁడు లోకసంరక్షణార్థమై భూమియందవతరింపఁగలఁడని నిరీక్షించిరి. [శ్లో॥ పరిత్రా

ణాయ సాధూనాం। వినాశాయ చదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ। సంభవామి యుగేయుగే॥] అట్టి యవతారము వచ్చి వెళ్లిన వెనుక తదవతార చర్యలను వర్ణించియుండిరి. కావున దేవమానవావతారమిట్టి వివిధ మతస్థులకు సమాన ధర్మమైయున్నది. ఈ సందర్భమున నవతారముల నంగీకరించిన మతములలోనే మతము ప్రబోధించు నవతారము నిజమైనదని విమర్శింప నెంచుటకంటె నీ మతముల యవతారవర్ణనము లనేక ముఖములనఁ జేర్చి పోల్చిచూచుచు, విమర్శమునను తర్కముపలనను సహేతుకములుగ దోఁచని యాభాసలనందుండి తొలఁగించి యేకావతారమును సాధింపనెంచుట లోకమునకు క్షేమకరమును, జనులకు సోదర భావమును కలిగించుటయు నగును.

కొన్ని వేల సంవత్సరముల క్రిందట భగవంతుఁడు ప్రజల పాపభారమునుండి తొలఁగించనెంచి యేదోయొక యూర నొకసారి నరావతారమెత్తెనని నిశ్చయింప నగును. ఇందే మతము వారికిని విరోధములేదు.

ఒక యూరనొక వాగ్మి యొక యంశమునుగూర్చి ప్రసంగించినచో శ్రోతలందఱు నావార్తను వారివారి దేశములకుఁగొనిపోయెదరు. ఈ ప్రసంగాంశమునుగురించి వారు తమతమ గ్రామవాసులకుఁ జెప్పునప్పుడు ప్రధానాంశములు భేదింపకుండినను మిగత వాటిలో ననేక మార్పులుండక మానవు. అట్టి మార్పులు కలుగుటకు పలు కారణములుకలవు. సహజముగ మన ముపన్యాసమును వినునప్పుడు ప్రతి వాక్యమును, ప్రతి పదమును పూర్తిగ గ్రహించి జ్ఞాపకముంచుకొనుటయే యసంభవము. మనము దానిని తిరిగి మన స్నేహితులకు చెప్పఁదగిన సమయము తటస్థించు సరికి వినినదానిలో కొంతభాగము మరచిపోవచ్చును, మరిచిన వాటి స్థానములో కొన్ని క్రొత్త సంగతులు మన మనస్సులో చేరవచ్చును. ఈ రీతిని నుద్దేశ పూర్వకముగా కాక తమంతట తామే కొన్ని మార్పులుకలుగ గలవు. ఇంతేకాక, మనుజులు తాము వినిన సంగతులను గ్రహిం

చుటలో భేదములు కలవు. చెప్పువారి యభిప్రాయమును గ్రహింపక పోవచ్చును. వినువారి యభిప్రయాను సరణముగ ఆమాటలే వారికివేలు వేలు అర్థముల స్ఫురింపఁజేయఁగలవు. అటుల స్వాభి ప్రాయాను సరణముగ గ్రహించిన వారాకథనే తిరిగి యితరులకు చెప్పునప్పుడు ప్రసంగికుని తాత్పర్య మీకథనుండి వెలువడక కథకుని యభిప్రాయములతో నిమిడి యుండును. ఇందువలన భేదములు కలుగఁగలవు.

కొన్ని వేల సంవత్సరములకు పూర్వమీభూమిపై నెచ్చటనో యొక గ్రామమున భగవంతుఁడొక్కసారి నరావతారము నెత్తెను. ఆ యవతారము చేసిన చర్యలను, బోధలును నప్పటినుండియు తరతరములవఱకును దిగంతములవఱకును వాగ్రూపమున నొకరికొకరు చెప్పుకొనుట రూపముగా వెల్లడియయ్యెను. ఈ చిరకాల కథాకథనమున ననేక మార్పులు కలిగిన వింతపడవలసిన పనిలేదు. ఒకదేశ మీకథనే వినీతికలదానినిగా చెందవచ్చును. ఇంకొక దేశమున కీ కథయే నిర్మలమై చేరియుండవచ్చును. మఱియొక దేశము దుర్నీతితో కూడినదిగాఁగాని నిర్మలమైనదిగాఁగాని కాక మధ్యరకముగా పొందవచ్చును. ఇట్లు పలువిధములుగామారి యాగ దేశములకుచేరిన యీ కథయొక్క పాఠాంతరములనన్నిఁటి నేకముఖమునఁ జేర్చి చూడఁదలంచిన మొదట నేమియు సంబంధము లేనివానివలె కనుపించఁగలవు. కాని యోపికతో విమర్శించి పోల్చిచూచిన సామరస్యములనేకములు కాన్పించఁగలవు.

దేశకాల తంత్రానుసరణములుగ నందుజేర్పఁబడిన నవీనాంశముల నన్నిఁటిని విసర్జించి మూలవాక్యములను విభజించి చూచిన నివియన్నియు నొక చరిత్రయొక్క వివిధ కథనములని గోచరింపఁగలదు. ఈ కార్యమును నిర్వహించుటకుఁగాని కార్యసాఫల్యత నందినను మనదేహ మనోగతములగు పూర్వాచారముల నించుక లెక్కింపక సత్యమని తోఁచిన దాని నంగీకరించుటకుఁగాని, కడు వైశాల్యమగు హృదయము కావలయును. ఇతర మత

ములయందుఁగల సారమును గ్రహింపగడంకయే సందేహ దృష్టితోఁ జూచు నంతకాలము, విమర్శించి నిజమని నిశ్చయింపక యే మనము పుట్టి పెరిగిన మతము మాత్రమే నిజమైనదని తలంచునంతకాలము, మనము సత్యమును గ్రహింపఁజాలము.

న్యాయదృష్టితో విమర్శించి చూచినయెడల లోకమునఁ గల వాటిలో పెక్కు మతము లేకవృక్షమునుండి వెలువడిన వివిధ శాఖలని గ్రహించఁగలము. ఇందులో గొప్ప మతములు కొన్ని చిరకాలము నుండి సత్త్వము కలవై లోకమున గౌరవనీయములై ప్రకాశించుచుండుటం బట్టి నిగురు గప్పిన యగ్నికణములవలె దేశకాలానుసరణములగు నాచారములు, కర్మలు, తంత్రములు, మున్నగువానిలో మునిఁగియుండినను నట్టి మతముల సారము నారయ లోన సత్యబీజము నిమిడియుండి యేకవృక్షము నుండి వెలువడిన శాఖలని స్పష్టముగాఁ దెలియఁగలదు. ఈ యూహనే మనస్సునం దిడుకొని క్రైస్తవమతమునందుఁ గల ముఖ్యాంశముల నన్నిఁటిని హిందూ మతముతోఁడను, హిందూదేశమున చిరకాలమునుండి వ్యాప్తమగు చుండిన షట్శాస్త్రములతోఁడను పోల్చి వివరింపఁ బ్రయత్నించితిని. ఈ మతద్వయము ననేకతావులఁ బోల్చిచూపుటయేగాక దురవగాహములగు సంగతుల సుబోధముగ వ్రాసితిని.

పాశ్చాత్య క్రైస్తవ మత బోధకాగ్రేసరుఁడగు R. W. Dale. అను దొరగారి 'క్రీస్తుని సహచర్యము' అను గ్రంథమునుండి కొన్ని పఙ్క్తులీక్రింద నాంధ్రీకరించి వ్రాయుచున్నాను :—

"స్వభావమువలన క్రీస్తులోకమునకు మనవలననే వెల్లడి చేయఁబడవలెననియు, తదితర మార్గము లేదనియు నేను చెప్పఁజాలను. క్రైస్తవసంఘమువలన గాక మఱి యే యితర మార్గమునను క్రీస్తు ప్రజలను ఆశీర్వదించి రక్షింప నేరడని నేను నిర్ధారణ చేయను. కాని లోకరక్షణకార్యమున మాకును (క్రైస్తవులకును) కొంతబాధ్యత కలదని చెప్పఁగలను."

"పూర్వకాలమున బహు దురవస్థలయం దుండిన మానవులలో సైతము దేవుని నిర్మలమైన వెలుగును పొందినవా రుండవచ్చును. అట్టి వారిని ప్రేమతోను, సంతోషముతోను ప్రజ లంగీకరించియుందురు. కాదనుటకు నేను సమర్థుఁడను కాను. వారి బాహ్యాచర్యలను బట్టి, యనగా వారి దేశాచారముల ననుసరించియు వారు జీవించిన కాలమునఁగల సంఘపు స్థితిగతులను బట్టియు, వారవలంబించు సాంఘిక మతాచారములను బట్టి వారు దేవుని సమీపించినవారు కారని గాని దేవుని దివ్యతరమైన వెలుగు వారియందు ప్రకాశించుట లేదనిగాని తలంపఁజనదు. వారిలో కొద్దిమందికి గాని యెక్కువమందికిగాని వారాచరించు మూఢారాధనల వలననే దైవతత్త్వము వెల్లడి కావచ్చును. హిందూదేశస్థుల స్థితిగతుల కనుగుణమగు నంతలోనే వారు దయగలవారై సంచరింపవచ్చును."

క్రైస్తవ హిందూమతము లేక మూలకారణాంతర్గతములని పైని నేనుదహరించినదంతయు బుద్ధివలన సాధింపదగినదై యున్నది. ఇది యొక యూహయేకాని నిశ్చితార్థముగా భావింప పనిలేదు. సకల మతములకును మూలాధార మొకటియైయుండునా యని విమర్శించినంత మాత్రమున నేమియు హాని కలుగ నేరదు. ఇయ్యది విచారించి నిశ్చయింపఁ దగిన యంశము కావున ననాలోచితముగ గ్రహింపపనిలేదు. ఈపొత్తమున క్రైస్తవమతమునందుగల గూఢార్థముల వెల్లడించుటకు ప్రయత్నించుటయేగాక వానిని హిందూమతముతో పోల్చితిని. సమాన ధర్మములు కల యంశము లనేకములు కలవు. ఏదియో యొక మతమునందు విశేషాభిమానము నుంచుకొని తదితరము లసత్యములని యెంచక న్యాయదృష్టితో విమర్శించిన వారికిందు కొన్నియేని తృప్తికరములుగా దోచినయెడల నిప్పుడు గాకున్న నొకప్పటికైనను నీ మత ద్వయములవారును సోదరభావముతో నొకరినొకరు చూచుకొనఁగలరని నానమ్మకము. ఇయ్యది గ్రంథపాఠకు లందఱును నెవరి యంతఃకరణములతో వారు సంపర్కించఁ దగిన యంశమై యున్నది గావున నింతటితో విరమించెదను.

ఈ మతములను పోల్చుటలో నొక మతమును హెచ్చించుటగాని మఱియొక మతమును నిరసించుటగాని గ్రంథకర్తయొక్క తలంపు కాదు. సత్యమెటు గాంచిన దాని నవలంబించుటయే ప్రధానము. కావున నీమతద్వయములోని వారెవ్వరైనను దయచేసి యందలి గుణదోషముల దెలిపిన వందనపూర్వకముగ గ్రహింపఁబడును. అటుల జేయదలఁచిన వారందఱు గ్రంథకర్త పేర వ్రాయఁ బ్రార్థితులు. ఈ గ్రంథముయొక్క రెండవ కూర్పున నట్టివానిలో ముఖ్యవిషయములు చేర్పఁబడును. కావున నీరెండు మతములనుపోల్చి సత్యాన్వేషణముచేయ తలంపుకలవారందఱును నీ గ్రంథమును శ్రద్ధతో జదివి వారు చదువుటవలన కలుగు పర్యవసాన ఫలితమును గ్రంథకర్తకును దెలుపఁ బ్రార్థితులు.

ఈ గ్రంథపఠనమువలన పాఠకులకు స్వమతాభిమానము తొలఁగునను దురభిప్రాయమును కలుగజేసి కొనవలదు. పాఠకులు క్రైస్తవులైనను హిందువులైనను వారి మతమునందుఁ గల విశేషాంశములను తమమతము వలెనే పలువురకు మోక్షదాయకమని యెంచబడు మఱియొక మతముగూడ దృఢీకరించుట తటస్థించునప్పుడు స్వమతస్థాంశములయందు గౌరవమును విశ్వాసమును కలుగును గాని తద్వ్యతిరిక్తాభిప్రాయములగుట కవకాశము లేదు. ఇందువలన పరస్పర వైరములు తొలఁగి గౌరవ ప్రపత్తు లంకురించును. క్రీస్తు కృష్ణులచే వారిబోధల నవలంబించువారు లోకమును సోదరభావమునఁ జూడదగు నని చెప్పిన వాక్యము లిప్పుడు సార్థకములు కాఁగలవు. ఈ మతద్వయమునఁ గల భేదములు నామరూపములయందు మాత్రమే కలవు. నామరూపములను దాటి లోనికి ప్రవేశించిన సత్యము వెల్లడి కాఁగలదు. అదియే దేవుని వాయువు.

ఈ గ్రంథము నందఱును చిత్రమునకైనను చదువవచ్చును. మనోవైషద్యమునకైనను చదువ వచ్చును. ఇటుల నేతలంపుతో చదివినను తదంతర్గత విషయములయం దపేక్ష జనింపకమానదు. అట్టి యపేక్ష జన్మసాఫల్యత కంకురము కావచ్చును. ఇం దెవ్వరిని క్రైస్తవులుగాఁగాని హిందువులుగాఁ గాని మారుమని కోరుటలేదు. నిష్కల్మష మగు హృదయముతో నిందలి సంగతుల మననము చేసి సత్యమని తోఁచినవాని నే

గ్రహింపనగును. సత్యవేదమునుండిగాని, వేదమునుండిగాని తగువాక్యముల నుదాహరణముగాఁ జూపని నూతనవిషయముల నిందు బొందుపరచలేదు. ఈ గ్రంథపఠనమువలన నొక యాత్మకైనను మనశ్శాంతి కలిగినయెడల గ్రంథ కర్తయొక్క శ్రమ సార్థకమైన దని యెంచఁబడును.

ఈ గ్రంథమునందు వ్రాసిన యంశములకును గ్రంథకర్త చేయుచున్న నవీన నిబంధనాంధ్రీకరణమునకును సంబంధ మేమియులేదు. తదాంధ్రీకరణము సహేతుకముగ మాతృక ననుసరించి యథావిధిగఁజేయఁబడు చున్నదిగాని యీ యభిప్రాయ భేదములందుఁ జొన్పఁబడుటలేదు. కావున క్రైస్తవు లీ విషయమునను మాత్రమును సంశయింపఁబనిలేదని నిశ్చయముగ గ్రహించెదరుగాక. ఈ విషయము సత్యమని మాతృకతో పోల్చిచూచిన వారికెల్ల విశదముకాఁగలదు. ప్రప్రథమమున నీ గ్రంథమును లూకా సువార్తయందు పీఠికగఁ జేర్చఁదలంచియు నాంధ్రీకరణమున స్ఖాలిత్యము కలిగినదను దురభిప్రాయము క్రైస్తవుల కంకురించునను భీతిచే నాతలంపును మరలించుకొని వేఱు గ్రంథముగా ప్రచురించుటకు కారణమైనది.

క్రైస్తవులనుగాని హిందువులనుగాని నిరసించుట గ్రంథకర్తతలంపు కాదుకావున నెవ్వరును నట్లు తలంపవలదు. గ్రంథకర్తయే సత్యాన్వేషకులలో నొకఁడు కావుననో సోదరులారా! ఇందు విశ్వాస పాత్రము లగు సంగతులుండిన గ్రహింపవలయుననియు, సవరణకు పాత్రములగు సంగతులుండిన గ్రంథకర్తకు దెలుపఁవలయుననియు ప్రార్థింపఁబడుచున్నారు. గ్రంథకర్తను గ్రంథకర్తవలెనే మాయయందు పాపసాగర నిమగ్నులై యున్న మానవులను సన్మార్గానువర్తులనుగాఁజేయుటకు దేవుని ప్రార్థించుట రూపమున నీ పీఠిక ముగింపఁబడుచున్నది. ఈ గ్రంథము క్రైస్తవ హిందూమతముల సామరస్యమున కాదిమ ప్రయత్నమగునటుల దీని నాశీర్వదించుటకు గ్రంథకర్త భగవంతుని ప్రార్థించుచున్నాఁడు.

ఇట్లు సజ్జన విధేయుఁడు,

*23rd Feb. 1915.*] రాజా మంత్రి ప్రగడ భుజంగరావు.

ఏలూరు.

# క్రైస్తవ గూఢార్థ ప్రదీపిక



## 1. అధ్యాయము

### ఉపక్రమము

శ్రీ మత్తయి వ్రాసిన సువార్తయొక్క పద్యకావ్యమునకు వ్రాసిన పీఠికలో బైబిలు గ్రంథమునందలి పుస్తకములను గురించియు, నా గ్రంథ కర్తలనుగూర్చియు, నాయా గ్రంథముల కాలనిర్ణయములంగూర్చియు విపులముగా ముచ్చటించి యుంటిమి. ఏతద్గ్రంథములయందలి దీర్ఘదర్శుల భావి కాలసూచనల యాథార్థ్యంబును నద్భుతచర్యలు లోనుగాఁగల విషయముల సత్యాసత్యంబులఁ గొంతదనుక విమర్శించి, ప్రాఁత నిబంధనములోని గ్రంథము లాయా కాలములయందే సమకాలికులైన మోషే మొదలగు గ్రంథ కర్తలచేతను క్రొత్తనిబంధనములోని గ్రంథములు క్రీస్తుని స్వర్గారోహణమునకుఁ బరమంద చిరకాలమున నే మత్తయి యాదిగాఁగల గ్రంథకర్తల చేత నే విరచింపఁబడినవనియుఁ, దత్తద్గ్రంథస్థాంశంబులన్నియు సత్యేతరంబులుగాక యథార్థంబులే యనియు స్థిరపరచి యుంటిమి.

దివ్యజ్ఞాన సమాజమువారును దత్సమాజాధ్యక్షురాలగు "ఆని బిసెంటు" దొరసానిగారును నూతన నిబంధనస్థాంశములందమ పరిశ్రమము వలనం దేలిన భూలోక, భువర్లోక, సువర్లోక, మహార్లోక, జనలోక, తపోలోక, సత్యలోకాదుల యొక్కయు, స్థూల సూక్ష్మ కారణ శరీరాదుల యొక్కయు గమనికలజ్ఞానమువలన సలవడిన తపోమాహాత్మ్యములనుగా వివరింపఁ బ్రయత్నించి క్రీస్తువు తపస్సిద్ధినందిన విజ్ఞానియనియు, నాయా

శక్తులనిండియా, యైగుప్తుమున్నగు దేశముల యరణ్యప్రాంతముల సంచరించి సాధువుల చిరకాల శుశ్రూషవలన వీనిఁబొందెననియు నుడివియుండిరి. క్రీస్తువిదేశాటనముఁగావించి సద్గురుసాక్షాత్కారమునందె ననుటకుఁ బ్రబల నిదర్శనము లేవియుఁగానరావు. ఈ యంశముల సాంగంబుగఁదెలిసికొనఁ గోరు వారాంగ్లేయ భాషయందు వ్రాయఁబడిన "యానీ బిసెంటు, లెడ్బీటరు" గార్ల గ్రంథములంజదువనగును.

అమెరికా దేశమందలి చికాగోయందు వెలసిన యోగవిద్యాభ్యసన సంఘమువారొక క్రీస్తుమతగ్రంథమును రామచరక యోగీంద్ర ప్రణీతమును బ్రచురించియుండిరి. క్రీస్తుఁడొక యోగ విద్యానిపుణుఁడనియు వానియద్భుత చర్యలు యోగాభ్యాస ఫలితములనియుఁ జెప్పనుంకించిరి.

ఆయాగ్రంథముల సత్యాసత్యముల విమర్శనము ప్రకృతాంశాను గుణ్యాశూన్యమగును. సత్యవేదమునందేయే సత్యము లిమిడియుండెనని విమర్శించుటయే కర్తవ్యము.

---

## 2. అధ్యాయము.

క్రొత్త నిబంధనములోని గ్రంథము లన్నియు శ్రద్ధతోఁ జదివి చూచినయెడలఁ బామరులకు గోచరించు బాహ్యార్థమేకాక గూఢార్థము లనేకములు గలవనియు, గ్రంథస్థము లగు వాక్యముల నేకాగ్రచిత్తతతో మననముఁజేసి గ్రహింపఁదగిన యంశము లనేకములు గలవనియు గ్రహింప నగును. అంతియే గాక నిశ్చలచిత్తముతో దత్త్వమును గోరువారలకుఁ జేయఁదగిన బోధ వేఱనియుఁ బామరులకుఁ జేయఁదగిన బోధ వేఱనియు గోచరింపఁదగిన వాక్యము లచ్చటచ్చటఁ బెక్కులు గలవు. కావునఁ గ్రైస్తవ మత గ్రంథములయందు దసమానపాండిత్యమును సంపాదించి త్రికరణశుద్ధిగఁ గ్రైస్తవ మతాగ్రేసరు లగు ఘనుల వ్యాసముల నుండియు

నూతన నిబంధనమునుండియుఁ బైయంశమును దృఢీకరించఁ దగు వాక్యముల నెత్తి యిందేకముఖమునఁ గనఁబరచెద.

1. ఆగస్టైనను ఋషి యిట్లు వ్రాయుచున్నాఁడు:—

"సృష్ట్యాదినుండియుఁ గ్రైస్తవమత మెప్పుడును లేకపోలేదు. ప్రప్రథమమునుండియు నాచరింపఁబడుచున్న సత్యమగు మతమే. క్రీస్తుమానవావతార మెత్తిన పిదపఁ గ్రైస్తవ మతమని పిలువఁబడుచున్నది........................................అటులనే కానిచో దేవుని రాజ్యముయొక్క రహస్యములను గురించి క్రీస్తు ననేకపర్యాయములు ముచ్చటించుట కర్థమేమి? సామాన్యపు ప్రజలకుఁ గథలుగా మార్చి చెప్పవలయు ననియు, సత్యము నాసక్తితో నన్వేషించు శిష్యులగు మాకుమాత్రమే వాని గూఢార్థములను బోధింప నగుననియుఁ గ్రీస్తు చెప్పిన మాటల కర్థమేమి? చిరకాలమునుండి యోగులచే సుప్రసిద్ధముగా వాడఁబడుచుండు సాంకేతిక పదములనే క్రీస్తు వేల ప్రయోగించియుండును? పౌలుఁడు 'జ్ఞానమును పరిపక్వము నందినవారికి బోధించెద' నని పలుకనేల? 'దాఁచిపెట్టఁబడినట్టియు సృష్టికిఁ బూర్వమే యుండినట్టియు భగవజ్ఞానమును బ్రభువైన నెఱుఁగఁ డని' పౌలుఁడు వచించుటలోఁ యర్థమేమి? ప్రజలందఱికిని బోధింపఁబడు బాహ్యార్థము గల క్రైస్తవ మతమును గుఱించియే యైనచోఁ బౌలుఁ డట్లు వ్రాయుట సమంజస మని యూహింప నగునా? పౌలుని శిష్యులగు ఫాదిరీ లందఱును గూఢార్థముల నెఱిఁగినవారే. క్లిమెంటను వాఁడిట్లు నుడివె. సృష్టియొక్క రహస్యముల నజ్ఞానుల కందఱికిని బోధించుట ధర్మము కాదు."

"అలగ్జాండ్రియా దేశస్థుఁ డగు క్లిమెంటు వ్రాసిన యంశములం జూడుఁడు. 'పరిశుద్ధత నందుట యనఁగా సత్యమును దెలిసికొనుట కర్హమగు స్థితిని బొందుట. బాప్తిస్మ మను స్నానమువలనఁ బరిశుద్ధత నంది గురూపదేశమువలనఁ గొలఁదికొలఁది యంశములం దెలిసికొనిన [పిదపఁగాని

యాంతరార్థంబుల సమగ్రంబుగా గ్రహింపవలనుపడదు.' మఱియొకస్థలమం దాతఁ డిట్లు వ్రాసె.] 'భక్తికన్న జ్ఞానము విశేషమైనది. కొందర పదు వారికి సత్యముయొక్క యథార్థమును గోచరింపఁజేయుట కనువగునట్టిది భక్తి. జ్ఞానము స్వభావ శాస్త్రజ్ఞానమువంటిది.' వాని శిష్యుఁడగు ఆరిజ నిట్లు వ్రాసియున్నాఁడు. 'భక్తివలనఁ బ్రజా సామాన్యమునకుఁ దెలియఁ దగినది బైబిలులోని చరిత్రాంశముతోఁ గూడిన బాహ్యార్థము జ్ఞానులకుఁ దెలియఁదగినది. యంతరార్థముతోఁగూడిన నిజమైన క్రైస్తవ మతము.' "

"ఆ కాలమునందీ మతమునకు మూఁడు మెట్లు గలవు. 1. పరిశుద్ధత నందుట. 2. జ్ఞానము నార్జించుట. 3. పరిపూర్ణతనందుట. ఇప్పుడు బాహ్యరూపంబగు పరిశుద్ధత నందుట మాత్రమే మిగిలినది. జ్ఞానపరిపాకము లంతరించెను."

2. క్లిమెంటను తపస్వి యిట్లు చెప్పుచున్నాఁడు:—

"వెనుకఁ జెప్పఁబడినటుల 'ముత్యములను బందుల ముందరఁ బోసినఁ జిదుకఁద్రొక్కి మనలను గోరలఁజీల్చునని' భయపడుచున్నాను. పరిశుద్ధమై ప్రతి ఫలించుచుండు సత్య సంబంధమగు వాక్యముల నపరిశుద్ధు లగు వారికి వినిపించుట బహుదుర్లభము."

3. పౌలుఁడను ఋషి యిట్లు చెప్పుచున్నాఁడు:—

"సహోదరులారా! ఆత్మసంబంధులైన మనుష్యులతో మాటలాడి నట్లు నేను మీతో మాటలాడ లేకపోతిని. శరీర సంబంధులైన మనుష్యులే యనియుఁ గ్రీస్తునందుఁ బసిబిడ్డలేయనియు మీతో మాటలాడవలసివచ్చెను. అప్పటిలో మీకు బలము చాలకపోయినందునఁ బాలతోనె మిమ్మును పెంచితినిగాని అన్నముతో మిమ్మును బెంచలేదు." (1 కొరింథీయులు III. 1-2.)

4. ప్రభువైన యేసుక్రీస్తు యిట్లు చెప్పెను:—

చ॥ శునకము నోటఁబెట్టకుఁడు శుద్ధపదార్థము మీదు ముత్తెముల్
పోనుపడఁ బందిచెంత నిడఁబోవకుఁ డట్టుల మీరొనర్పన
వ్వన చరణట్టి ముత్తెములఁ పాదములం బడఁ గ్రుమ్మ్రియంతటం
దని యకమీపయింబడి ఘనంబగు కోరను జీల్చివేయునో.

(మత్తయి. VII. 6.)

5. "మార్కు" యిట్లు వ్రాయుచున్నాఁడు:—

"ఆయన యొంటిగా నున్నప్పుడు పండ్రెండు మంది శిష్యులతోఁ గూడ నాయన చుట్టునుండిన వారా యుపమానమునుగూర్చి ఆయన నడిగిరి. అందులకాయన దేవుని రాజ్య మర్మము (దెలిసికొనుట) మీకనుగ్రహింపఁబడియున్నదిగాని వెలపటనుండు వారొకవేళ దేవుని వైపునకుఁ దిరిగి పాప క్షమాపణ పొందుదురని, వారు చూచుటకైతే చూచియుఁ, గనుగొనకను వినుటకైతే వినియు గ్రహింపకయుండుటకై సమస్తము వారికుపమాన రీతిగా బోధింపఁబడుచున్నదని వారితోఁ జెప్పెను." (మార్కు. IV. 10-12.)

"వారికి వినుటకు శక్తిగలిగినకొలఁది నిట్టియనేకములైన యుపమానములనుజెప్పి యాయన వారికి బోధింపతేను. గాని యొంటరిగా నున్నప్పుడు తనశిష్యులకన్నిటిని విశదపరచెను."(మార్కు. IV. 33-34.)

6. క్రీస్తు తనశిష్యులతో నిట్లు పలికెను:—

"నేను మీతోఁ జెప్పవలసిన వింక ననేక సంగతులు గలవు గాని యిప్పుడు మీరు వానిని సహింపలేరు." (యోహాను. XVI. 12.)

7. స్మిర్నాదేశమునకు బిషప్పగు పాలికార్పువాఁడు మఱికొందఱికి వ్రాయుటలో నీరీతిఁబద ప్రయోగముఁజేసెను:—

"సత్యవేదమును సాంగంబుగఁ జదివినవారు గావున మీనుండి యేమియు మఱుఁగుపరచఁ బడలేదు; నాకా స్వాతంత్ర్య మింక నొసఁగఁ బడలేదు."

8. అంతియోకియా బిషప్పగు 'ఇగ్నాటియస' ను నతఁడిట్లు వ్రాసియున్నాఁడు:—

"యేసుక్రీస్తు విషయమై నేనింకనుఁ బూర్ణముగాఁ దెలిసిన వాఁడనుగాను." "పౌలుఁడు మొదలగు మహాత్ములవలె నాకింకను బైబిలు సంబంధమగు రహస్యములు వెల్లడిచేయఁబడలేదు." "గూఢార్థములతోఁ జేరిన యంశములను నేను మీకు వ్రాయ వలనుపడదుగదా. అట్లు వ్రాసినయెడలఁ బసిపిల్లలైన మీకు హానిఁజేసిన వాఁడనగుదునని భయపడుచున్నాను. ఈ యంశమునకు మీరు నన్ను క్షమింప వలయును. ఆగూఢార్థముల యొక్కయు, రహస్యముల యొక్కయు, భారములగు భావంబులం గ్రహింప నేరమిని వానిచేత మీరునలిపి వేయఁబడుదురు. పరలోక సంబంధమగు సంగతులను గ్రహించినట్టియు, దేవదూతలను, దేవదూతలయందుఁగల తరగతులను, భేదములను, రాజ్యములకును, అధికారములకునుగల భేదంబులను, యుగముల పరిమాణములను, ఆత్మల యొక్క గురుత్వమును, ప్రభునిరాజ్యమును, సర్వశక్తిగల భగవంతుని యౌన్నత్యమును, ఇవన్నియు నాకుఁ బూర్తిగాఁ దెలిసియుండినను నేను సమస్తముఁ దెలిసినవాఁడ ననుకొనుటకుఁగాని పౌలుఁడు, పేతురులతోఁ దులఁదూగఁ దగినవాఁడనని కాని యనుకొనుటకుఁ జాలను."

9. క్లిమెంటిట్లు వ్రాసె:—

"ప్రభువు, భగవత్సంబంధమగు రహస్యములను గ్రహింపఁదగిన సమర్థత గలవారికి మాత్రమే తెలుపుట కాజ్ఞనిడె. జనసామాన్యముకై యుద్దేశింపఁ బడనివానినిఁ బ్రజలకుఁ జెప్ప నిచ్చగించఁడు. రహస్యాంశములు వాగ్రూపముగాఁ జెప్పఁబడునేకాని లిఖింపఁబడవు. చెప్పినసంగతుల గ్రహింప సమర్థతగలవారికి మఱుగు పరచఁబడిన రహస్యములువెల్లడి చేయఁబడును. నేనుజెప్పుటకే సంశయించెడి యంశములనెట్లు వ్రాయుదును. కొన్ని సంగతులఁ జెప్పక విడుచుచుందును. పరులెఱింగెదరను భీతి

చేఁగాదుగాని గ్రహింప నేరక యపార్థములఁజేసికొనిన మూఢులనేలపుష్పాఘటంబు టుంజేసి పసిపిల్లలకుఁ గత్తిచేతనిడిన చందంబగు.

10. ప్లేటోయను వేదాంతినిట్లునుడివె:—

“ అపరిశుద్ధులు పరిశుద్ధపదార్థమును స్పృశించుట కర్హతలేదు. మనము భావగర్భితముగా వాకొనవలయును. ప్రమాదవశంబుననట్టి వ్రాత లజ్ఞులచేతంబడినను వారు గ్రహింప నసమర్థంబగుతీరున వ్రాయనగును.”

11. ఆరిజనను వాఁడిట్లువ్రాసెను:—

“ పునరుత్థాన విషయక మర్మమించుకయును వెల్లడిఁజేయఁబడ కుండుటచే నవిశ్వాసస్థుల హేళనమునకు భాజనమగుచున్నది. ఈసంద ర్భమునఁగ్రైస్తవ మతసిద్ధాంతములు రహస్యముగనుంచఁబడెననుట హాస్యా స్పదము. లోకములోని యితరములగు ననేకమతములయందువలెనే దీని యందును జనసామాన్యమున కుపయోగింపఁదగిన బాహ్యార్థంబును, బండి తులకు గోచరింపఁగలుగు గూఢార్థంబును గలిగియున్నదనుట విపరీత ముగాదు.”

“ అట్టివారలు క్రీస్తు తన నిజశిష్యులకు రహస్యమునం దుపదేశించిన యంతరర్థంబుల విననగును.”

“ తనజ్ఞానమును దెలిసికొన దృఢనిశ్చయులగు వారలకుఁ గ్రీస్తువు మఱుఁగున గుప్త తత్వార్థంబుల వెల్లడించె.”

“ దైవ గ్రంథములంజదివినతోడనే స్ఫురించుపామరజన సమ్మతం బగు బాహ్యార్థంబేకాక పలువుర దృష్టి కగోచరంబగు నాంతరార్థంబు గూడఁగలదు. అట్టియాంతరార్థంబులు ద్వ్యర్థ పదప్రయోగజనితంబులు, తత్త్వజ్ఞానాదుల మానసులకు జ్ఞేయంబు. సత్యవేదమాంతరార్థ పుంజంబును, తదర్థ సౌలభ్యంబు, భగవద్దత్తంబగు పరిశుద్ధాత్మనందిన వారలకు వినాత దన్యులక యోగ్యయంబనియు నుడువుటలోనే తత్త్వజ్ఞులందరేక భావగ తులైరి.”

పై నుదాహృతులగు మతాగ్రేసరుల నుడులంబురస్కరించియు, సత్య వేదమను బైబిలునందలి వాక్యరాజంబులంబట్టియు, నేతద్గ్రంథరాజంబునకుం బామర జనజ్ఞేయంబగు బాహ్యార్థంబె కాక, పండిత జనమనోరంజకంబును, గిల్బిషారణ్య జ్వాలనజ్వాలోప మానంబును, భగవత్పాదారవింద సేవాసంధాయకంబును, స్వభావ స్వభావాతీ తాది సమస్త చరాచరసృష్టిస్థితిలయ కారణభూతభూత భవిష్యద్వర్తమాన సమస్తలోకస్థశక్త్యాదిజ్ఞాన పరిపూర్ణంబును, నగు గూఢార్థంబుంగలదని దృఢీకరింపఁగలిగితిమి.

---

## 3. అధ్యాయము.

### మరణానంతరపుస్థితి. పితృలోకము.

గూఢార్థంబుగలదని నుడివినంత నప్రయోజనం బించుకంతయును లేదు. దానిం గొంతదనుక సుబోధంబుగా వివరింపగలిగినఁ గదా సకల జనసమ్మతంబుగానోపు. తదర్థంబుగాఁ గొంతదనుకఁ బ్రయత్నించెద.

“జాతస్యమరణంధ్రువమ్” అను వాక్యానుసరణంబుగా భూలోకంబున జన్మించిన ప్రతిజీవునకుం గాలానుగుణంబుగా దేశకాలపాత్రంబులంబట్టి యెన్నఁటికేనియుఁ జావుతప్పదు. చావన నేమి. యాయవస్థతో సర్వము నంతమగునా లేక కొంత మిగులునా? ఆత్మలు నిలచియుండునని నచో నా యాత్మలు మరణానంతరమున నేమి కాఁగలవు. క్రైస్తవమతానుగుణ్యంబుగ ముందెన్నఁడో విమర్శనమున కొకదినము నియమింపఁబడి యున్నదనియు నా దినమునఁ గ్రీస్తునంగీకరించిన వారలకు స్వర్గంబును, తదితరులకు నరకంబు నొసంగఁబడుననియు ననియెదరు గదా? అంతదనుక మరణముసందినవారలయాత్మ లెచ్చటనుండఁగలవు? ఏమి చేయుచుండఁగలవు? పూర్వజ్ఞానం బలవడఁగలదా? యను నీ యంశంబుల విషయమై

బైబిలు గ్రంథమునుండి మనమేమి గ్రహింపఁగలుగుదుమో యించుక యోజింతము.

బైబిలు గ్రంథమును జాగరూకతతోఁ బూర్వాపరసందర్భముల నారయుచు శ్రద్ధాభక్తులతోఁ జదివినచోఁ వ్యగస్థిగతంబగు నీ భూలోకజీవనమునకును, విమర్శన దినాంతంబునం బొందనగు స్వర్లోకజీవనంబునకును మధ్యమున నొకలోకము గలదనియుఁ దెలియనగును. దానినే మధ్యలోకమని వాడనగును. దీనినే యచ్చటచ్చట మారుపేరులేక స్వర్గమనివాడుటచే నభిప్రాయభేదంబులును నర్థభేదంబులును గలుగుట తటస్థించుచున్నది. ఈ మధ్యకాలమునే కొందఱు సమాధులందు విశ్రాంతి నొందుకాలమని దురభిప్రాయపడుచున్నారు. సమాధులయందు విశ్రాంతి నందుదురను కొనుటయే పొరపాటు. మరణముతోనే యాత్మకును స్థూలశరీరమునకును సంబంధము విడినది. సూక్ష్మశరీరము స్థూలశరీరమును విడుచుటయే మరణము. సూక్ష్మశరీర నిర్గమానంతరము సమాధిచేయఁబడిన స్థూలశరీరముండు సమాధియందు విడచిపోయిన సూక్ష్మశరీరము తిరిగి విశ్రాంతినందు టెట్లు గలుగును? మరణానంతరమున మానవులందఱు సూక్ష్మశరీరములతోఁ బైనుదాహరించిన మధ్యలోకమునందుండెదరనియు, నా లోకము నిచ్చటనే కలదనియు, నది సూక్ష్మలోకమగుటచే మన స్థూలేంద్రియముల కగోచరమనియు, తెంపులేక యీ భూలోకజీవనముయొక్క యుత్తరభాగమే యచ్చట నీ భూలోకజీవనస్థాంశములయొక్క సంపూర్ణజ్ఞానముతో ననుభవించఁబడుననియు, ప్రభువగు యేసుక్రీస్తునిచే బోధింపఁబడెడి పరలోకరాజ్యమచ్చటను బోధింపఁబడుననియు, నింక ననేకాంశములను బైబిలు బోధించుచున్నది.

పై వాక్యముల దృఢీకరించు బైబిలులోని వాక్యముల నీక్రిందఁ బొందుపరచెదను. మరణించినతోడనే దుష్టులు నరకంబునకును యోగ్యులు స్వర్గంబునకును జేరెదరని కొందఱభిప్రాయపడుచున్నారు. ఇది సత్యమే

యగునెడల ముందెన్నఁడో యేర్పడిన విమర్శన దినమునకు ఫలితమేమి? కావున నయ్యది విశ్వాసపాత్రము కానేరదు. విమర్శనదినంబు దనుక విశ్రాంతినందెదరను వాదమును దత్తుల్యమైనదే. ఆ విమర్శన దినమింక ననేక సహస్ర వత్సరంబులదనుక రాకపోవచ్చును. నేర మొనర్చిన వాని ననేక సహస్రవత్సరంబుల దనుక దాఁ జేసిన నేరముల జ్ఞప్తియే లేకుండునటుల విశ్రాంతినందనిచ్చి పదంపడి చిరకాలమునకెన్నఁడో లోకాంతరంబునఁ జేసిన పాపములకై విమర్శించుటయు, ముద్దాయి తనసంగతి సందర్భములు రుజువుజేసికొనుటకైన నవకాశము లేకుండుటయుఁ దుట్టతుదకట్టి నేరములకై వానిని శాశ్వత నరకకూపంబునం బడఁద్రోయుటయు జరిగెడిచో నెంతయన్యాయంబుగ నుండఁగలదు. భూలోకస్థ ప్రభువులే పంద్రెండు సంవత్సరములకు మించిన నేరముల విమర్శించుట కనర్హములని శాసనముల విధించుచుండఁ బరలోకమందుండు ప్రభువిటుల విమర్శించి శిక్షించునని తలంచుటయే పొరబాటు.

మరణానంతరమున నివసింపనగు మాధ్యమికలోక మొకటి కలదనియు, దాని స్వభావమును తత్సంబంధములగు తబిసీళ్లును, బైబిలునందుఁగల వచనముల రీతిని రుజువుచేయ దొరకొనుటకు ముందు బైబిలు గ్రంథము మర్త్యలోకమునందుండు వారలనువర్తించుటకై యుద్దేశింపఁబడినదగుటచే మర్త్యలోకాతీతమగు మాధ్యమికలోక విషయాంశంబులందుఁబూర్ణంబుగ నుండఁగలవని ప్రతీక్షించుటయేతప్పు. ఆగామి జీవితము ప్రకృతానుసరణంబుగ నుండును; గావుననే బైబిలు ముందుగతికిఁ గారణమగు ప్రకృతావస్థయం దనువర్తింపఁదగు మార్గములనే బోధించును. భగవదత్తంబగు బైబిలు గ్రంథముయొక్క ఫలితము మానవుల స్వర్గమునందజేయుటయే కావున గమ్యస్థానమునకంటె నీచమగు మాధ్యమిక లోకాంశములందు విశేషించి వర్ణింపఁబడవు. పూర్వోక్తాంశంబులంబట్టి మాధ్యమిక లోకవిషయంబుల నీగ్రంథంబున విశేషంబుగ నుండునని తలంచఁగూడదు.

ఐనను బైబిలునందచ్చటచ్చటఁ గలకించి ద్వివరణములవలననే మరణమునం దినతోడనే జీవాత్మలు మాధ్యమిక లోకంబు నాఁబరఁగు పితృలోకంబున కేగెదరనియు, నీమర్త్యలోకంబు నందుండు నప్పటి సకలాంశంబుల స్మృతి కలిగియే యుందురనియు, విమర్శన దినంబు దనుక నాలోకంబుననుండి యభివృద్ధిఁ జెందెదరనియుఁ, క్రైస్తవ మతమచ్చటఁగూడ బోధింపఁబడు ననియు, నచ్చటనే తన్మతజ్ఞానమును సంపాదించి ముక్తినందనగుననియు, చూపింప నవకాశముకలదు.

## (a) ప్రాఁతనిబంధనలోని నిదర్శనములు.

ప్రాఁతనిబంధనమందు మరణానంతరము జీవులు నివసింపఁదగు లోక మొకటి గలదనియు, భూలోకంబున మరణమునందు జీవులాలోకంబునం గల తమ బంధుజనులం జేరఁగలవనియు, సూచన లచ్చటచ్చటఁగలవు.

1. యెహోవా మోషేకు సెలవిచ్చినదేమంటే:—

“నీ సహోదరుఁడైన అహీరోను చేర్చఁబడినట్లు నీవును నీ జనుల యొద్దికిఁ జేర్చఁబడుదువు.” (సం. XXVII. 13.)

2. యెహోవా మోషేకు సెలవిచ్చిన దేమంటే:—

“ఆ దినమందే యెరిబోపట్టణము నెదుట మోయాబు దేశమందున్న యీ అబారీము పర్వతసంబంధమైననిబో అనే కొండను నీవెక్కి యిశ్రాయేలు పుత్త్రులకు స్వతంత్రముగనే నిచ్చుకొన్నయను దేశమునుజూడుము. నీ సహోదరుఁడైన అహీరోను హోరుకొండమీఁద మరణమొంది తన జనులయొద్దఁ జేర్పఁబడినట్లు నీవెక్కఁబోవు కొండమీఁద నీవును మరణ మొంది నీ జనులయొద్దకుఁ జేర్పఁబడవలయును.” (ద్వి. XXXII. 48-50.)

3. “అతఁడు (ఇష్మాయేలు) ప్రాణమువిడిచి మృతిఁబొంది తన ప్రజల యొద్దకుఁ జేర్పఁబడెను.” (ఆదికాండ. XXV. 17.)

4. "యాకోబు మంచముమీఁదఁ దనకాళ్లు ముడుచుకొని ప్రాణము విడిచి తన ప్రజలయొద్దకుఁ జేర్చఁబడెను." (ఆది. XLIX. 33.)

5. "అహరోను మృతిఁబొంది తన జనుల యొద్దఁ జేర్చఁబడును." (సంఖ్యలు. XX. 26.)

6. "యెహోవాకు సేవకుండైన యెహోషువా మరణమొందెను. ఆతరము వారందఱును తమ పితరుల యొద్దకు జేర్చఁబడిరి." (న్యాయా. II. 8–10.)

7. దావీదు తనకుమారుఁడు చనిపోయినప్పుడు చెప్పినదేమంటే:—

"నేను వానియొద్దకు వెళ్లుదును గాని, వాఁడు నా యొద్దకు రాఁడు." (సమూ. XII. 23.)

8. యాకోబు తనప్రియపుత్త్రుఁడగు యోసేపుయొక్క యంగినిఁజూచి నప్పుడు తనకుమారుని నిమిత్త మంగలార్చుచు:—

"నేను అదృశ్య లోకమునకు నా కుమారునియొద్దకు వెళ్లెదనని చెప్పెను." (ఆది. XXXVII. 35.)

పూర్వోదాహృత సత్యవేదవాక్యస్థ పూరుషులు సమాధులయం దుండిరని భావింపఁజనదు. ఏలయనఁ బైవాక్యములలోని కొందఱు సమాధులయందుంచక పూర్వమే పైవాక్యములు పలుకఁబడెను. మఱి కొందఱు మృతినొందిన వెనుక దూరదేశములయందుఁ బూడ్చఁబడిరి, గాని, యొక్కశ్మశాన వాటికయందే ఖననము చేయఁబడలేదు.

కావున హెబ్రీయ భాషయందు "షియోలను" నామాంతరము గల పితృలోకమునందు వారు వారి పితరులఁ జేరిరనియే పైవాక్యములు సమన్వయింప నగును. దురదృష్ట వశమున నీషియోలను పదమునకు సమాధియని బైబిలు గ్రంథమును బ్రప్రథమమున భాషాంతరీకరించిన వారర్థమును వ్రాసిరి. కాని యాభాషాంతరీ కరణమును దిరుగ సవరించి ముద్రించినపుడు ప్రక్కను "ఈషియోలను" పదమునకు హీబ్రూ

భాషయందుఁ బితరులు నివసించు స్థలమున కన్వయించు ననియు, నూతన నిబంధనమం దీ యర్థమునిచ్చు "హాడ్సు" అను పదము వాడఁబడె ననియు స్పష్టముగ వివరించుటచే నీసందేహము వ్రాసెను:—

## (b) క్రొత్తనిబంధనలోని నిదర్శనములు.

నూతన నిబంధనమునందు "చనిపోయినవారలు కొంతకాలమైన వెనుక జీవించియుండి యాలోచనఁ జేయుచు మాటలాడుచుండి" నటుల స్పష్టముగఁ జెప్పఁబడియెను.

1. సమూయేలను దీర్ఘదర్శి తానుచనిపోయి నాల్గుసంవత్సరములు గతించిన పిదప "ఎండరుస్త్రీ" పిలుఁవగావచ్చి సౌలుఁడనువానితో దార్చినటుల వ్రాయఁబడినది. సమూయేలు చనిపోయినవాఁడు. "ఎండరుస్త్రీ" యును, సౌలుఁడును, భూలోకంబున జీవించియున్నవారు. వారలకు సంభాషణము జరిగెను.

2. మోషీయను ప్రవక్త క్రీస్తు రూపాంతరమునందిన కొండపైని క్రీస్తునకును వాని శిష్యులగు పేతురు, జేమ్సు, యోహాను లకును గనుపించి క్రీస్తుతో వానిసిలువపైని మరణమును గూర్చి తాను మరణించిన వెనుకఁ బెక్కు సంవత్సరములకుఁ బిమ్మట ముచ్చటించెను.

3. ప్రభువైన క్రీస్తు తాను సిలువపై మరణించిన తరువాతఁ బెక్కు మందికిఁ గానుపించి వారితోఁ గలసి, తిని, తిరిగి ముచ్చటించెనని స్పష్టముగ వ్రాయఁబడెను. (పేతురు. III. 18-20.)

4. లాజరసనువాని కథయందు మరణించిన వారనిరువురను సజీవులై మాటలాడుచుండు వారిని గాను, పూర్వము భూలోకజీవితజ్ఞానముఁ గలవారిని గాను ప్రభువగు యేసుచెప్పెను. (లూకా. XVI. 19-31.)

5. అబ్రహాము, ఈసాకు, యాకోబు మొదలగు వారు చిరకాలము క్రిందటనే భూలోకమున మరణమునొంది స్థూలశరీరమును విసర్జించినను, సజీవులై యున్నారని క్రీస్తు చెప్పెను. (లూకా. XX. 38.)

6. క్రీస్తువిట్లువచించె:—" సీ॥ జడియకుఁడీ యాత్మ సమయింప నేరక, మేనిని సమయించు వానివలన " (మత్తయి. X. 28.)

7. క్రీస్తిట్లనియె:—

" గీ॥ ....................................

మనుజపుత్త్రుఁడు తనతండ్రి మహిమగలిగి

స్వభటులనుగూడి తప్పక వచ్చునిటకు॥

వ॥ అప్పు డమ్మహనీయుండు స్వస్వకర్మాను రూపంబులగు ఫలంబుల నెల్లవారలకు నొసంగు." (మత్తయి. XVI. 27.)

పైవాక్యములంబట్టి మరణించిన తోడనే జీవులు స్వర్గమునకుఁగాని నరకమునకుఁగాని వెళ్లవని గ్రహింపనగును:—

8. " మనుష్యకుమారుఁడే (క్రీస్తు)తప్పఁ బరలోకమున కెక్కిపోయిన వాఁడెవఁడును లేఁడు." (యోహాను. III. 13.)

దీనినిఁబట్టియుఁ బరలోకమున కిప్పటిదనుక నెవ్వఁడు పోలేదని స్ఫురించుచున్నది.

9. " నేడుఁ నీవు నాతోఁగూడఁ బరదైసు (మాధ్యమలోకము) నందుందువని నిశ్చయముగా నీతోఁ జెప్పుచున్నానని" క్రీస్తుసిలువపైని దొంగ వానితో ననెను. (లూకా. XXIII. 43.)

10. పునరుత్థానానంతరమునఁ గ్రీస్తుమరియతో నిట్లనెను:—

" నేనింక నాతండ్రి యొద్దకు నెక్కిపోలేదు గనుక నన్నుఁబట్టికొనవలదు."

దీనివలనఁ గ్రీస్తుసూక్ష్మశరీరధారియై మాధ్యమికలోక వాసిగా నుండెనని భావింపనగును. పూర్వోక్తాంశంబుల సమన్వయించు కొనినచో మరణానంతరమున జీవులు మాధ్యమికలోకమున కేగదరని గ్రహింపనగును.

11. "ధనవంతుఁడుగూడఁ జనిపోయి పాతిపెట్టఁబడెను. అప్పుడతడు పాతాళములో (మాధ్యమికలోకమునందు) బాధపడుచుఁ, కన్నెత్తి దూరమునుండి యబ్రాహామును నతనిరొమ్ముననానుకొని యున్న లాజరును జూచెను." (లూకా. XVI. 22-23.)

పైవాక్యమువలన నెవఁడైనను పాపిగాని పుణ్యవంతుఁడుగాని స్థూల శరీరము విడచినతోడనే మాధ్యమిక లోకమునుజేరఁగలడని గోచరించుచున్నది.

12. పేతురిట్లువచించె:—

"మృతులు శరీరవిషయములో మానవరీతిచేఁ దీర్పుపొందునట్లును, ఆత్మవిషయములో దేవునిఁబట్టి జీవించునట్లును, వారికిఁగూడ సువార్త ప్రకటింపఁబడెను. (పేతురు. IV. 6.)

దీనివలన మాధ్యమిక లోకమునందుఁగూడ సువార్త ప్రకటింపఁబడునని స్పష్టమగుచున్నది.

13. క్రీస్తు:—

"మృతులు దేవుని కుమారుని శబ్దము వినుగడియవచ్చుచున్నది; ఇప్పుడేవచ్చినది; దానిని వినువారుజీవింతురనిచెప్పెను."(యోహాను. V.25)

మృతులు మాధ్యమికలోకమందుఁగాక మరెక్కడయేసుని శబ్దమును విని బాగుపడఁగలరు?

14. క్రీస్తు:—

"మరణముయొక్కయు, మృతులలోకముయొక్కయుఁ దాళపుచెవులు నాస్వాధీనములోనున్నవి." (ప్రకటనము. I. 18.)

ఇందు మృతులలోకమన నెద్ది? మాధ్యమికలోకమే.

15. "మరణమును, మృతులలోకమును, (మాధ్యమికము) వానివశమున నున్న మృతులనప్పగించెను." (ప్రకటనము. XX. 12-13.)

ఇందు సందిగ్ధమేమున్నది. మాధ్యమిక మనఁబడు పితృలోకము కలదని చెప్పుటయేకదా:—

16. పౌలుఁడుతనయొక్క స్వానుభవము నిట్లు చెప్పుచున్నాఁడు:—

"అతిశయపడుట నాకుఁ దగదుగాని యతిశయపడవలసి వచ్చినది. ప్రభువు (దయచేసిన) దర్శనములనుగూర్చియు, ప్రత్యక్షతలను గూర్చియుఁ జెప్పుదును. క్రీస్తునందున్న యొక మనుష్యుని నేనెఱుఁగుదును. అతఁడు పదునాలుగు సంవత్సరములక్రిందట మూడవ యాకాశమునకుఁ గొనిపోఁబడెను; అతఁడు శరీరముతోఁ గొనిపోఁబడెనో నేనెఱుఁగను; శరీరము లేక కొనిపోఁబడెనో నేనెఱుఁగను. అది దేవునకే తెలియును. అట్టి మనుష్యుని నేనెఱుఁగుదును. అతఁడు పరదైసులోనికిఁ గొనిపోఁబడి, వచింప శక్యముగాని మాటలు వినెను." (కొరంధీయనులు XII. 1-4)

పైవాక్యములవలన మాధ్యమికలోకముకలదని స్ఫురించుటయేకాక మనుష్యుని యాత్మ స్థూల శరీరాంతర్గత మయ్యు, ననఁగా భూలోకమునందు జీవించియుండు కాలమునందే మాధ్యమిక లోకమునకేగి తిరిగి యీ స్థూలశరీరమును జేరఁగలదనియు, పితృలోకమునకు లేక మాధ్యమికలోకమునకేగుటకు సూక్ష్మశరీరముండిన నేకాని వెళ్ల వీలులేదు. కావున సూక్ష్మశరీరము యీస్థూలశరీరాంతర్గతమై యుండెననియు గ్రహింపనగును.

తాను మూడవ యాకాశమునకుఁ (లోకమునకు) గొనిపోఁబడితినని చెప్పుచున్నాఁడు. దీనినిఁబట్టి గ్రహింపఁదగినదే మనఁగా.

1. ప్రథమాకాశము భూలోకసంబంధమైనది.
2. రెండవ యాకాశము పితృ లేక మాధ్యమిక, లోకసంబంధమైనది.
3. మూడవ యాకాశము సత్యలోకమునందగు స్వర్గ సంబంధమైనది. యనియు.

1. స్థూలశరీరము—భూలోక సంబంధమైనది.
2. సూక్ష్మశరీరము—మధ్యలోకసంబంధమైనది.
3. లింగశరీరము—స్వర్లోకసంబంధమైనది.

ఈమూడు శరీరములు నొకటిలోనొకటి యిమిడియే యున్నవనియు స్పష్టపడుచున్నది. హిందువులును దివ్యజ్ఞాన సమాజమువారునుగూడ నీ లోక శరీరత్రయంబుల నంగీకరించెదరు.

17. పౌలుఁడు:—"చావై తేభాలును." (పిలిప్పియులు. I. 21.) భూలోకస్థ జీవిత స్పృహయుండిననే తప్ప మరణమెట్లు లాభ మని పౌలుఁడు చెప్పియుండును.

ఒక మనుజుఁడు బాల్య యౌవన కౌమారవార్ధ కావస్థలనుబొందియు నాయా యవస్థ లనుభవించు కాలముల జ్ఞాపకముగలిగి తానొక్కఁడే యీ యవస్థలనన్నిటి ననుభవించితినను నిశ్చయ జ్ఞానమెట్లు కలిగియుండునో యట్లే మరణమను మార్పువలన నవస్థాంతర రూపాంతరములఁబొంది యుఁ దానే యీమార్పులను బొందినవాఁడనను జ్ఞానముఁగలిగి యుండుట యేకాక, యీమార్పునకుఁ బూర్వము తనకుఁ గలిగిన మంచిచెడ్డల జ్ఞానము గూడఁగలిగి యుండునని పూర్వోదాహృతాంశంబులు చెప్పకయ చెప్పు చున్నవి. (పై 2, 3, 5, పేరాలుచూడుఁడు) అచ్చట సువార్తప్రకటింపఁ బడును. (12 పేరా) ఇంకను మఱికొన్ని బైబిలులోని వాక్యము లీయంశ మును ధ్రువపరచఁగలవు.

18. "దేవుఁడు లోకము నెంతో ప్రేమించెను. కాగా, ఆయన తన యద్వితీయ కుమారుఁడుగా బుట్టిన వానియందు విశ్వాసముంచు ప్రతివాఁడును, నశింపక నిత్యజీవమును బొందునట్లూ యననను గ్రహించెను." (యోహాను. III. 16.)

19. "దేవుఁడు వారి యపరాధములను, వారిమీఁద మోపక, క్రీస్తు నందులోకమును తనతో సమాధానపరుచుకొనుచు, నాసమాధాన వాక్యమును (ప్రకటించుట) మాకప్పగించెను." (2 కొరింథి V.19.)

పై వాక్యమువలన భగవంతుఁడు ప్రపంచమునందలి జీవుల నన్నిఁటిని, సెక్కువగాఁ బ్రేమించి యందఱును మోక్షము నొందుటకుఁ దన యేక కుమారుని బలిగా నర్పించుకొనెనని స్పష్టపడుచున్నది. ప్రపంచమునందు లక్షలకొలఁది జనులు సువార్తను వినక పూర్వమే మరణమునందుచుండఁగా, వారలకందఱకు నీ సువార్త పితృలోకమున బోధింపఁబడునని యంగీకరింపనిచో, వీరందఱు శాశ్వత నరక కూపంబునం గూలవలసివచ్చును.

అటులనే భావించినచోఁ పైవాక్యములు సమన్వ యార్థములు గాక వ్యర్థపదములని నుడువవలసిన యవస్థతటస్థించును.

## (c) పితృలోకమున మతబోధ చేయబడును.

క్రీస్తు తాను స్వయముగాఁ పితృలోకమునఁ గలవారలకు జ్ఞానబోధఁ జేయునని యీక్రింది వాక్యములవలన గ్రహింపనగును.

1. " యేసుక్రీస్తు నిన్న, నేఁడు, నొక్కటే రీతిగనున్నాఁడు; అవును. యుగయుగములకు నొక్కటే రీతిగనుండును." (హెబ్రీ. XIII.8.)
2. " ఇదిగో నేను యుగసమాప్తి పర్యంతము సదా నీతోఁగూడనున్నానని వారితోఁ జెప్పెను. " (మత్తయి. XXVIII. 20.)
3. " ఇప్పటినుండి ప్రభువునందు మృతినొందు మృతులు ధన్యులు. వారు తమప్రయాసములుమానివిశ్రాంతిఁబొందుదురు." (ప్రకటన. XIV13.)
4. వెలిచూపువలనఁగాక విశ్వాసమువలననే నడుచుకొనుచున్నాము. గనుక నీ దేహములో నివసించుచున్నంతకాలము ప్రభువునకుఁ దూరముగానున్నామని యెఱింగియుండియు, నెల్లప్పుడును ధైర్యముగలవారమైయున్నాము. " (2 కొరింధి. V. 6-8)
5. " చావైతే లాభము.................ఈ రెంటి మధ్యమున నిఱుకునఁ బడియున్నాను. నేను వెడలిపోయి క్రీస్తుతోఁగూడ నుండవలెనని నాకాశయున్నది. అది నాకు మఱి మేలు. అయినను నేను

శరీరమునందు నిలిచి యుండుట మిమ్మునుబట్టి మరియు నవసర మై యున్నది.'' (ఫిలిప్పి. I. 21, 23, 24.)

6. "ఆరాత్రి ప్రభువు అతనియొద్ద నిలుచుండి ధైర్యముగా నుండుము, యెరూషలేములో నీవు నన్నుగూర్చి యేలాగున సాక్ష్య మిచ్చితివో యాలాగున రోమాలోఁ గూడ సాక్ష్య మియ్యవలసి యున్న దని చెప్పెను.'' (అపొ. XXIII. 11.)

పితృలోకమునం దీలోకమునందుఁ గలిగిన యనుభవజ్ఞానము జీవులకు కలిగి యుండు నని చెప్పియుండుటచే మరణమువలనఁ గలుగు దుఃఖము శాంతింప గలదు. ఇప్పుడు మనకంటె ముందు భూలోకమును విడిచిన మన బంధుమిత్రాదులు పితృలోకమునం దుంటే రనియు, నంత్యావస్థ తటస్థించి నప్పుడు వారలం జేరఁగల వనియుఁ, గావున మన వారలకును, మనకును గలిగిన యెడబాటు దీర్ఘ మైన దయినను శాశ్వత మైనది గా దనియుఁ దెలిసికొనుటచే, నాప్తుల దూరదేశమునకు వారిపురోవృద్ధి కై పంపుటవలనఁ గలుగు దుఃఖమునకంటె వారి మరణమున కై యెక్కువ దుఃఖము నందవలసిన యవసరము లేదు. వారు భూలోకముకంటెఁ బితృలోకమునం దెక్కువ సౌఖ్యముల నందు చుండి రనియుఁ బ్రభు వగుక్రీస్తు తానే వారల నాదరించుచుండె ననియు, దెలిసిన పిదప వారలమరణమున కై జుగుప్సనంద నవసరము లేదు. దీనియం దెంత మనశ్శాంతిగలదో విచారించుకొనుఁడు.

చదువరులారా? హూణభాషయందుఁ బెక్కుమతగ్రంథముల వ్రాసి, ప్రసిద్ధివడసిన రివరెండు "ఆర్థరుఛేంబర్సు" అను ఋషివ్రాసిన వాక్యములును పైభావమును స్పష్టముగఁ జెప్పియున్నవి.

పితృలోకమునందలిజీవులు భగవత్తత్త్వసంబంధము లగుసత్యములఁ బూర్తిగఁ గ్రహింప సమర్థతగల వై యుండును. జీవులు స్థూలశరీరాంతర్గతము లై యుండుకాలమున బహుపరిశ్రమముఁజేసి సంపాదింపనగు దూరదృష్టి, దూరశ్రవణాదు లగుయోగసిద్ధులను, స్థూలశరీర విసర్జనానం

తరమునఁ, బరిశ్రమముఁ జేయకయె స్వాభావసిద్ధముగఁ బొందఁగలవు. ఈ యోగసిద్ధులు, మానవులకు లభించియున్నవని బైబిలునం దనేక స్థలముల యందు వ్రాయఁబడియున్నది. వానిని ముందు మఱియొక సందర్భమున, స్పష్టముగ వివరించెదము. సీమదేశమునందుఁగల యాత్మతత్త్వ విచారణ సంఘమువారును నిర్ధారణములవలన హిందూదేశమునందలి పురాతన మహర్షివర్గమును నీశక్తులు మానవు లభ్యాసవశమున వశపరచుకొందురని, ఘంటాపథంబుగ నుడివియుండిరి.

---

## 4. అధ్యాయము

### కార్యకారణరూప మగుకర్మానుభవము తప్పదు.

### “ ప్రతివాఁడును వానిభారమును మోసికొనును. ”

పురుషుఁడు మరణానంతరమున భూలోకమునందలి వాని జీవితమున కనుగుణ మగు నిమ్నోన్నతస్థానమును, పితృలోకమునఁ జెందఁగలఁడని పౌలుఁడు చెప్పియున్నాఁడు. ఈ యభిప్రాయమునే ఆపోస్తలుల కార్యములు 1-25 నందు చెప్పఁబడియున్నది. అచ్చటఁ బ్రభుద్రోహి యగు “ ఇస్కరియోతు ” తాను జేసిన ప్రభుద్రోహముయొక్క ఫలితమున ననుభవించఁదగు నీచస్థానమును, పితృలోకమునఁ బొందెనని చెప్పఁబడియున్నది. ఇదియె కార్యకారణములను వాదుకగల “ కర్మ ” నాఁబరఁగు దైవత శాసనము.

దీనికి వ్యతిరేకింప నెవరికినిఁ దరముకాదు. ఈకర్మము ననుభవించి తీరవలయునని క్రీస్తు వీ క్రిందివాక్యమువలన సూచించియున్నాఁడు. “ కడపట కాసు చెల్లించువఱకు నక్కడినుండి నీవు వెలుపలికి రాలేవని నీతో నిశ్చయముగఁ జెప్పుచున్నాను.” (మత్తయి V. 26)

ఈ సత్యమునే. పౌలుఁ డీ క్రిందిరీతి నుడ్వడించె:—

"ఆయన ప్రతివానికి, వానివాని క్రియలచొప్పునఁ బ్రతిఫలము నిచ్చును. సత్క్రియను, నోపికగాఁ జేయుచు, మహిమను, ఘనతను, అక్షయతను వెదకువారికి నిత్యజీవము నిచ్చును. అయితే భేదములుపుట్టించి, సత్యమునకు లోఁబడక, దుర్నీతికి లోఁబడువారివిూఁదికి, ఆయన యుగ్రతను • రౌద్రమును కలుగును. దుష్కార్యము చేయు ప్రతి మనుష్యుని యాత్మకు, మొదట యూదునికి హెల్లేనీయునికిఁగూడ, శ్రమయును, వేదనయు, కలుగును." (రోమా II. 6-9.)

ఇంకను నీదిగువ నుదహరించు బైబిలులోని వాక్యములఁ జూడఁ బ్రార్థించెద.

1. "ప్రతివాఁడును తన బరువును తానే భరించుకొనవలెనుగదా? మోసపోకుఁడి, దేవుఁడు వెక్కిరింపఁబడఁడు." (గలతి VI. 5-7.)
2. "మీలోఁ బ్రతివాఁడు, తనసహోదరుని హృదయపూర్వకముగ, క్షమించని యెడల, పరలోకపునాతండ్రియు, నా ప్రకారమే చేయును." (మత్త XVIII. 35.)
3. "అన్యాయము చేయువాఁడింకను, అన్యాయమే చేయనిమ్ము. అపవిత్రుఁడైనవాడింకను, అపవిత్రుఁడుగానే యుండనిమ్ము. నీతిమంతుఁడింకను, నీతిమంతుఁడుగానే యుండనిమ్ము. పరిశుద్ధుఁడింకను, పరిశుద్ధుఁడుగానే యుండనిమ్ము." (ప్రకటన XXII. 11.)
4. "మంచిచెట్టు కానిఫలములు ఫలింపనేరదు. పనికిమాలినచెట్టు మంచిఫలములు ఫలింపనేరదు." (మత్త. VII. 18)
5. "మఱియు శిష్యుఁడని, యెవఁ డీ చిన్నవారిలో నొకనికి గిన్నెడు చన్నీళ్లుమాత్రము త్రాఁగనిచ్చునో వాఁడు తనఫలము పోఁగొట్టుకొనఁడని నిశ్చయముగ మీతోఁ జెప్పుచున్నాను." (మత్త. X 42.)

6. "నేను మీతోఁ జెప్పున దేమనఁగా, మనుష్యులు పలుకు వ్యర్థమైన ప్రతి మాటనుగూర్చియు, విమర్శదినమున లెక్క చెప్పవలసి యుండును." (మత్త. XII. 36.)

7. "పరిపూర్ణుఁడవగుటకు నీవు కోరినయెడలఁ, బోయి నీ యాస్తినమ్మి బీదలకిమ్ము. అప్పుడు పరలోకమందు నీకు ధనము గలుగును. నీవు వచ్చి నన్ను వెంబడించుమని యతనితోఁ జెప్పెను" (మత్త. XIX. 21.)

8. "మనుష్యకుమారుఁడు.—అప్పుడాయన యొవని క్రియలచొప్పున వానికి ఫలమునిచ్చును." (మత్త. XVI. 27.)

పైని వివరించిన వాక్యములన్నిఁటివలన దప్పించుకొన శక్యము కానట్టియుఁ, బ్రతి జీవుఁడు ననుభవించి తీరవలసినట్టియుఁ, గర్మమనఁ బడు దైవదత్తమగు శాసనము కలదని స్పష్టపడుచున్నది. మనుజుఁడు పశ్చాత్తాపమునంది క్రీస్తుని వైపునకుఁ దిరిగినను నీ కర్మఫలము ననుభవింపక తీరదు, కావునఁ, బశ్చాత్తాపము నందినంతమాత్రమునఁ గర్మఫలము ననుభవింపకయే తరింతుమని తలంచుట వెఱ్ఱితనము. ఈ కర్మబంధము మొదలగు ప్రపంచవ్యాప్తమైన విధులకుఁ గారణభూతుఁడై సర్వశక్తిగలిగిన భగవంతుఁడైన నీ విధులను దప్పింపఁడు. తన విధులను దానే తప్పించినచో వాని సర్వజ్ఞత్వమున కనుపపత్తి తటస్థించును. జననంబాదిగ, భగవంతుఁడు సర్వజ్ఞుండని బోధింపఁబడి, దానిని నమ్మిన జనులకు సర్వజ్ఞుఁడు కాఁడని నుడివిన, వ్యగ్రతగానుండును. కావున, నట్లనఁజనదు. ఈ కర్మబంధనువిలంఘ్యమనియె, తలంచి తీరవలయును. అట్లు కాక భగవంతుఁ డీవిధులను బుద్ధి పూర్వకముగ మీఱునసెడిచో నాశాసనములు తనపైఁ బ్రవర్తింపఁ జేసికొనవలసినప్పుడు మీఱుట ప్రజలపై వర్తింపఁజేయఁదగినంత గనుక మీఱకుండుట దటస్థించు గావున, భగవంతుఁ డన్యాయప్రవర్తకుం డనవలసివచ్చును. భగవంతుఁడు న్యాయస్వరూపుఁడని తలంచు

మానవులాయనయం దన్యాయారోపణము జేయనొల్లరు, గావున నదియు నసంభవమె.

(*a*) క్రీస్తుని మరణమువలన కలిగిన లాభమేమి ?

యేసుక్రీస్తు మనకై సిలువపై మృతినొందె ననుటవలనఁ దాఁ బ్రజల నీ యవిచ్ఛేద్యంబగు కర్మబంధంబునుండి తొలఁగించెనని తలంచఁగూడదు. రివరెండు. యఫ్. డబ్లియు. కెర్లెట్టనుదొరవా రీవిషయమును మిక్కిలి చక్కఁగ వ్రాసిరి. ఎట్లన:—“క్రీస్తు బలిగా నర్పింపఁబడుటలో భగవంతునియొక్క న్యాయమును, దయయుఁ, గలిసియున్నవి. ఇందుఁ బాపము శిక్షింపఁబడియు, దేవుని ప్రేమవలన మనుజునకు ముక్తి యనుగ్రహింపఁబడినది.”

క్రీస్తుని సిలువపైని మరణమున కిదియే నిజమైన యర్థము. మానవుఁడు దుర్మార్గప్రవర్తనమువలన దేవునకుఁ దూరస్థుఁ డాయెను. ఆదామునాటినుండియు మనపైనావహించిన పిత్రార్జితమగు పాపమును, ప్రతిమనుజుఁడును, దెలిసియుఁ, దెలియకయుఁ, దాఁజేసికొనిన పాపములును, పర్వత ప్రాయములై పెరిగి, తండ్రియగు దేవునకును, మనుజునికిని, మధ్యమున నేర్పడిన “అఖాత” మతిశయమాయెను. అయ్యది కాలము గడచినకొలఁది నిడుపగునుగాని, సంకుచితముకానేరదు.

సర్వదయాపరుఁడగు భగవంతుఁ డీ యఖాతమును బూడ్చుటకై “ఆత్మావై పుత్త్రనామాసి” యను న్యాయానుసరణంబుగఁ దానే తన పుత్త్రుని పేరిట భూమియందవతరించి, మానవులు స్వశక్తినిఁ బరిహరింప శక్యముగాని పాపజనితమగు భగవంతుని యుగ్రక్రోధమును దా ధరించి మనుజు లెన్నఁటికైన దేవుని దరిఁజేరుట కర్హులగునటులఁ జేసెను. నరుఁడు, తనంతటఁ దానీభగవంతుని క్రోధమును జల్లార్ప సమర్థుఁడుగాఁడని యీ క్రింది వాక్యము చెప్పుచున్నది. “ధర్మశాస్త్ర సంబంధమైన క్రియ మూలముగానే మనుష్యుఁడును, ఆయన దృష్టికి నీతిమంతుఁడని తీర్పఁబడఁడు.

ధర్మశాస్త్రమువలనఁ బాపమనఁగా నెట్టిదో తెలియఁబడుచున్నది." (రోమా. III. 20.)

పైవాక్యమువలనఁ గ్రీస్తు నరుఁడు తనంతట తాఁ జేసికొనఁజాలని దానిని వానికొఱకుఁ జేయుటకుమాత్రమే భూమియం దవతరించెనని స్పష్టపడుచున్నది. మనుష్యుఁడు సృష్ట్యాది నుండియుఁ గూడుకొనిన పాపము వలనఁ గలిగిన భగవత్క్రోధజనితాఘాతమును తప్పింప నసమర్థుండగుటను, భగవంతుఁడు తన ఋజుమార్గమునుండి మఱలఁడు గావునను గ్రీస్తు "ధర్మసంస్థాపనార్థ" మై పాపసంహారమును జేయ నవతరించెను. ఈక్రిందివాక్యములవలన భగవంతుఁడు తనవిధుల నతిక్రమింపఁడని గ్రహింపనగును. "ఆ నిబంధనములు నాముందరఁ దప్పిపోయిన పక్షమందు, ఇశ్రాయేలు సంతతి కూడ నాముందర జనాంగమై యుండునట్లుగా, నెన్నఁటికిని లేకపోవునని యెహోవా యానతిచ్చెను." (ఇర్మియా XXXI. 36.)

పైవాక్యమువలన దేవుఁడు, తనవిధుల నతిక్రమింపకయే యిశ్రాయేలీయులకు మోక్షమియ్యఁ దలంచెను గావున నీయుభయ ప్రతిజ్ఞలు నెఱవేర్పఁ దనజనితైకకుమారుని, నవతార మెత్తించుటయే కాక, సిలువపైని మరణమునుగూడ నందఁజేసెను. క్రీస్తుచే ననుగ్రహింపఁబడిన యీపాపవిమోచనమును, పాపఫలితానుభవవిమోచనముగాఁ గొందఱు దురభిప్రాయ పడుచున్నారు. ఈపాప ఫలితానుభవము క్రియకుఁ బ్రతీకారముండక తీరదను దైవవిధియే కావునఁ దనతండ్రి విధులను మీఱిభంగ పఱుచుటకై క్రీస్తవతరించె ననుకొనుట వెఱ్ఱితనము కాదా? ఈవిధనే కర్మ యనియు, ఈకర్మానుభవమే లోకమున డాగినను దప్పదనియు, హైందవ జ్ఞానులును, మహర్షివర్యులును, శ్రుతి, స్మృతి, పురాణేతిహాసంబులయం దనాఘాతంబుగ నుడివియుండిరి. ఈవిధనే క్రీస్తువును, అపోస్తలులును, పూర్వోదాహృత సత్యవేదవాక్యావళి మూలమున స్పష్టముగ బోధించి యుండిరి. కావుననే పాశ్చాత్యజ్ఞాను లనేకులు, క్రీస్తు, దేవుని క్రోధమున

కాహుతిగా సిలువపై మరణించెనని చెప్పియున్నారు. కొందఱి యభిప్రాయములఁ బొందుపఱచెద :—

(*b*) దేవుని క్రోధమునకు నిదర్శనములు.

1. 'ష్లాప్' లను పండితుఁ డిట్లునుడివె.

"అనంతుఁడగు భగవంతుని నిశ్చలమగు క్రోధానలమున, నరక సంబంధమగు శ్రమములకుఁ గ్రీస్తు తండ్రిచేతనే యొప్పగించఁబడెను."

2. "బాధ" రిట్లుపలికె :—

"క్రీస్తు నిశ్చయముగఁ బ్రజలందఱికొఱకు భగవంతుని క్రోధమును, మరణమును, బరిపూర్ణముగ నొందెను."

3. "ఆరిజి" నిట్లనె :—

"క్రీస్తు వనుభవించిన కష్టములు ప్రజల పాపములకు న్యాయకర్త యగు భగవంతుఁడు విధింపఁదగిన శిక్షకుఁ దులఁదూఁగియుండెను. ప్రజలందఱుఁ, బొంద విధిక్రృతమగు, పాప ఫలితమును సర్వస్వమును దాననుభవించెను."

4. "స్టార్" డనువాఁ డిట్లు వచించె :—"భగవత్క్రోధానల భరితంబగు గిన్నె నెత్తి క్రీస్తుఁడు ద్రావె."

5. "జంకినుఁ" డిట్లు సెప్పె :—"క్రీస్తు భగవంతునిచే విడువఁబడిన వానివలెఁ గష్టములనందె."

6. "బిమపుజ్యానను" నాతఁడిట్టులాడె :—"మనుజుఁడు దుష్కృతము లాచరించిన పిదప దౌష్ట్యము క్రీస్తువనుభవించుటకుఁ దక్కితాను తన తండ్రిచేతులలోఁ బడె."

7. "డై" డిట్లు వక్కాణించె :—"భగవంతుని తిరస్కారమును ద్వేషమును దా భరించె."

8. "తాన్సు" నను నార్చిబిషప్పిట్లు ప్రవచించె:—"భగవంతుని తీవ్రమైన యాగ్రహమను మేఘము ప్రజలనందఱి నావరించె. అది క్రీస్తునిపై విసర్జింపఁబడె."

9. "లిడ్డ" నిట్లు వ్రాసెను:—"మానవులు హానిసలనియు, వారి విడుదల సొమ్మును, గ్రీస్తువు సిలువపైఁ జెల్లించుచున్నాఁడనియు, నపోస్తలులు బోధించుచున్నారు."

దీనిని మఱింతదృఢపఱచుటకు బైబిలునందలి కొన్ని వాక్యముల నీక్రిందఁ బొందుపఱచెద.

1. "శ్రమము ఓర్పును, ఓర్పు పరీక్షను, పరీక్ష నిరీక్షణను, గలుగఁ జేయునని యెఱిఁగి శ్రమములయందును, అతిశయపడుదుము. మనకనుగ్రహింపఁబడిన పరిశుద్ధాత్మద్వారా దేవుని ప్రేమ మన హృదయములలోఁ గుమ్మరింపఁబడియున్నది గనుక ఈ నిరీక్షణము మనలను సిగ్గుపఱచదు. ఎందులకనఁగా మనమింక బలహీనులమై యుండఁగా, క్రీస్తు యుక్తకాలమున భక్తిహీనులకొఱకుఁ జనిపోయెను. నీతిమంతునికొఱకు సహితమొకఁడు చనిపోవుట యరుదు; మంచివానికొఱ కెవఁడైన నొకవేళఁ జనిపోవఁ దెగింపవచ్చును. అయితే దేవుఁడు మనయెడలఁ దనప్రేమను వెల్లడి పఱచుచున్నాఁడు; ఎట్లనఁగా, మన మింక పాపులమైయుండఁగాఁ గ్రీస్తు మనకొఱకుఁ జనిపోయెను. కాఁబట్టి యాయన రక్తమువలన నిప్పుడు నీతిమంతులముగఁ దీర్పఁబడి, మఱింత నిశ్చయముగా నాయనద్వారా యుగ్రత నుండి రక్షింపఁబడుదుము." (రోమా V. 3-9.)

పై వచనములలోని కష్టములనునవి కర్మ యను విధిచే మనయభివృద్ధికై యేర్పడిన పాపఫలితములగు కష్టమును, వానివలననే దినదినాభివృద్ధి నంది క్రీస్తునిమరణమువలన దేవుని క్రోధానలమునుండి తప్పించుకొనఁగల మను నాశజనించును. తద్ద్వారా మోక్షము కలుగును.

(c) హిందూఋషులు వివరించిన కర్మయొక్క వివరము.

హిందువు లీ కర్మబంధమును రెండు విధములుగా భావించెదరు :—

1. హిందువుల ప్రార్థనయగు సంధ్యావందనమును, భూలోకమునకు పైనికలుగు నాలుగులోకములనఁగా భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకము లను నేడింటిని పేర్కొని మొదరు. దీనిలో కడపటిది యగు సత్యలోకంబీశ్వరుని నివాస స్థానమని తలంచెదరు. ఆత్మ కర్మవలనఁ బరిశుద్ధత నందుచు మధ్యలోకములనన్నిఁ టిని గడచి పరిపూర్ణావస్థయందు సత్యలోకంబును జేరి బ్రహ్మైక్యసంధానమును పడయఁగలదని వారి మతము. సంధ్యావందనమునం దెల్లెడలఁ బాప క్షమాపణమును దయచేయుమను కోరిక వ్యాపించియుండును. ఈయమి (ఈ లోకములు) బైబిలునందుఁగల పిత్రులోకమును, తదంతర్గత న్యూనాన్యూనావస్థలను బోలియుండును. తల్లోకస్థావస్థలయందారితేటి పరిపూర్ణతనంది బ్రహ్మైక్యసంధానము నందుటయే కదా బైబిలుయొక్కయు, వీ సంధ్యావందన కర్తలగు మహాత్ములయొక్కయు గమ్యస్థానము.

వేదాంతు లీ లోకసప్తకమును, స్థూలశరీరాంతర్గతము లై యుండెననియు,నెయ్యది బ్రహ్మమున కాలయమనియుఁ జెప్పెదరు. ఈ లోకసప్తకమును యోగవిద్యవలన నందదఁగు యే డవస్థ లనియు, సహస్రారమందు జ్యోతిస్స్వరూపమై ప్రకాశించు పరబ్రహ్మముఁ జేరుటకే యేడవస్థల దాటవలయుననియుఁ జెప్పుదురు. ఈ యవస్థలస్థానము లెవ్వియనిన, గుదప్రదేశంబునంగల మూలాధారచక్రము మొదటిది. రెండవది స్వాధిష్ఠానము. మూఁడవది మణిపూరకము. నాల్గవది అనాహతము. ఐదవది, విశుద్ధము. ఆఱవది యాజ్ఞాచక్రము. కడపటిది శిరోమధ్యస్థమగు సహస్రారకమలము.

2. రెండవ తెగవారు భూలోకమున జీవుఁడు మరణము నందిన తోడనే జీవుఁడు స్వర్గమునకేగి భూలోకమునందుఁ దాను జేసిన పుణ్యకార్యముల కనుగుణమగు స్వర్గాది భోగముల ననుభవించి తదనంతరమునఁ దాఁజేసిన పాపముల కనుగుణమగు శిక్ష ననుభవించుటకై భూలోకమునఁ

తిరిగి జన్మించుచు, నిటుల కర్మనశించువఱకుఁ బుట్టుచుఁ జచ్చుచునుండి పరిపూర్ణావస్థయందు బ్రహ్మైక్యమునందఁ గలుగునని చెప్పెదరు.

బైబిలునందు జెప్పఁబడినట్లు పితృలోకమునకేగి యచ్చటఁ గల నిమ్నోన్నతావస్థలరీతిం గర్మఫలానుభవ మంది భగవత్కృపం బడసి పరిపక్వతనంది మోక్షమునందిన నేమి; లేక యీ తెగవారు చెప్పురీతిం గర్మఫలానుభవార్థ మీ భూలోకమున జన్మాంతరముల నందుటచేఁ దత్కర్మఫలము ననుభవించి పరిపక్వావస్థయందు భగవత్కటాక్షమునంది మోక్షము నందిన నేమి. ఏకఱ్ఱతోఁ గొట్టినను పాము చచ్చుటయే గదా ప్రధానము. భావనయందు దప్పనడకయందుఁగాని, పరిసమాప్తియందుఁగాని, యీ రెండు మార్గములకును భేదమేమియుఁ గాన్పించదు. నిష్కళంకబుద్ధితో నిది మామతము, అది పరులమతమను భేదబుద్ధి నవలఁద్రోసి సత్యాన్వేషణమే ప్రధానముగా భావించి విమర్శించుకొనినచో నీ రెండు మతములును నేకీభావము నందఁగలవు.

---

## ౫. అధ్యాయము

### పునర్జన్మము

ఆత్మముక్తి నందుటకుఁ బూర్వ మనేక జన్మముల నెత్తునని ప్రపంచమునందలి గొప్పమతము లనేకములు చెప్పుచున్నవి. అట్టి మతములఁ గొన్నిఁటి నిందుదాహరించెద.

1. ఆసియాఖండమునం దనేక ప్రాంతములం గల బౌద్ధమతము, “ఒకసారిచచ్చి, తిరిగిపుట్టును, పాపము యొక్కయుఁ, బుణ్యముయొక్కయు ఫలితములు తేలికగఁ ద్రుంపఁబడనేరవు. ఒక్కపుట్టువయు, నొక్క చావును జాలదు. పూర్వజన్మములోని పాపపుణ్యములు మఱియొక జన్మ

యందలి సుఖదుఃఖములుగ మారుచుండును. స్థూలశరీరము చచ్చును, గాని యాత్మ సమాధిచేయఁబడదు."

(బౌద్ధసూక్తములు 37-వ యధ్యాయము.)

**2.** "ఐగుప్తు దేశస్థుల యొక్కయుఁ, బురాతన గ్రీకుదేశస్థుల యొక్కయు, డ్రూయిడుల యొక్కయు, మడగాస్కరు మొదలగు నాఫ్రికా దేశపువారి యొక్కయు, నుత్తరపు అమెరికా దేశస్థులయొక్క మతములయందు జన్మాంతరములు గలవని నమ్మిక."

(ఛేంబర్సు యెన్ సైక్లో పిడియా)

3. రోమను దేశస్థులయందును, జన్మాంతరము గలదను నమ్మిక కలదు. "ఓవిడ" ను కవి యిట్లువ్రాసె.

"ఆత్మచావదు. స్థలముమారి రూపాంతరమున మఱియొక జన్మ మును బొందును. ఈ యద్భుతములైన సత్యములనుజెప్పు నేను నొకప్పుడు ట్రోజాను యుద్ధములో యుఫిల్లియస్ అనువాడను. నా పేరును ఆజన్మము లోని వంశాను క్రమణికను నిప్పటికి జ్ఞాపకముకలదు. కావున, నన్నివస్తు వులును రూపాంతరము నొందుచుండును. ఏదియుఁజావదు. శరీరమును విడిచిన యాత్మ, యచ్చటచ్చటి కెగురుచుండును."

**4.** హిందూ మతములోని యన్ని యుపశాఖలవారును జన్మాంతర ములు గలవనియే నమ్మెదరు.

**5.** క్రైస్తవమతమునందును, జన్మాంతరములు గలవను సూచన లచ్చటచ్చటఁ గలవు. (మత్తయి XVI. 14. యొహన్న XVII. 12) ఈ రెండును గలిపి చదివినచో "ఎలీజా" యను ఋషి, స్నానమునిచ్చు యోహానుగాను, "ఎరిమియా" యను ప్రవక్త మెస్సయ్యగాను, పునర్జన్మ ముల నందినటుల, యేసుక్రీస్తు చెప్పినటులఁ దెలిసికొనఁగలము. ఈ యభి ప్రాయమునే రివరెండు "జి. టి. సెడ్లరు. యం. ఏ. యల్. యల్. బి." యను క్రీస్తుచర్చియొక్క ప్రధానబోధకుఁడు చెప్పియున్నాఁడు. వాని

వాక్యముల నీక్రింద పొందు పఱచెద. "ఆరిజన్" అనువాడు షుమారు 250 ఏ. డి. యందిట్లు చెప్పె. ఆత్మలయొక్క పతనమును సాంకేతికముగా స్వర్గమునుండి భూమి కొకనిచ్చెన వేయఁబడినటుల వర్ణించెను. మైత్రులను వారిమతములలో గుహనుండి యొకనిచ్చెన వేయఁబడి దానిమీఁదుగా స్వర్గమునుండి భూమి కాత్మలు దిగుచుండినటులఁ జెప్పఁబడి యున్నది. అటుల నేయాకోబుయొక్క స్వప్నమందును, దేవదూతలు (ఆత్మలు) ఎక్కుచు, దిగుచు నుండిరి. మత్తయి X I. 14. XVII. 12. లలో నీ యభిప్రాయమే కలదు. ఈ వాక్యముల యభిప్రాయము, ఎలీజాస్నానమునిచ్చు యోహానుగాను, ఎరిమియా మెస్సయ్యగాను, బునర్జన్మమునందిరనియే. యూదులు జన్మాంతరము గలవని ధ్రువముగా నమ్మిరి. వారి బోధకుల నేకులు జన్మాంతరమును బోధించిరి. ఆదాము, దావదుగా జనించెననియు, తిరిగి మెస్సయ్యగా వచ్చుననియు బోధించెడివారు."

---

## ద్వితీయ భాగము

## 6. అధ్యాయము

## మోక్షము

బైబిలునందలి పెక్కువాక్యముల వలన భూలోకమునకును, స్వర్గమునకునుమధ్య, పితృలోకము గలదనియు, భూలోకమునందు మరణించిన ప్రతిమానవుని యాత్మయు, లింగశరీరముతో నాలోకమునఁ గర్మానుభవము నందుటవలనఁ బరిపూర్ణతకై ప్రయత్నించుచు, యేసుక్రీస్తుయొక్క సాహాయ్యమువలన నభివృద్ధి నందుచుండుననియు నింతదనుక సిద్ధాంతీకరించి యుంటిమి. కావున నిఁక స్వర్గమననేమి? యది యెట్టిస్వభావ, స్వరూపములుగలదై యుండును? దాని నెవరు చెందఁగలరు? అను సంశయముల విషు

క్షించుటయే కర్తవ్యము. జనులందఱును బొందఁదలఁచిన దిదియే కావున, దేనినివిషయమై సత్యవేద మెట్లు నుడువుచున్నదో తెలిసికొనుట యావశ్యకము.

ఆంగ్లేయ భాషయందలి స్వర్గమను పదమునకుఁ బర్యాయ పదమగు "సాల్వేషను" అను మాటకుఁగల యర్థమును విచారింతము. పాపక్షమాపణమును బాపములకై విధింపఁబడు శిక్షలనుండి విముక్తినందుట, స్వర్గారోహణము సేయుట యనునదియే యీశబ్దమున కర్థమని కొందఱనియెదరు. స్వర్గమన నిట్లు భావించువారి దృష్టియందుఁ గ్రీస్తునిచేతను వాని శిష్యులచేతను విధికృతమని నొక్కి చెప్పఁబడిన నడవడికను బాగుఁజేసికొనుట" ఎక్కువ ప్రధానమైనది గాదు. క్రీస్తు ఇందునుగూర్చి యిట్లు చెప్పెను. "మీ పరలోకపు తండ్రి పరిపూర్ణుఁడు గనుక మీరును బరిపూర్ణులుగా నుండెదరు" (మత్తయి. V. 48.) తన పాపములకై పశ్చాత్తాపమునంది క్రీస్తుని నమ్మినవారలు స్వర్గారోహణమున కేర్పడిన నిచ్చెనయొక్క మొదటి మెట్టు నెక్కినవారుగా భావింపనగును.

ఆ నిచ్చెనయొక్క చివర మెట్టు పరిపూర్ణతనందుట. మధ్యమునంగల మెట్లన్నియు బరిశ్రమముఁజేసి ప్రతి మానవుఁడెక్కవలసినవియే. పై మత్తయి సువార్తలోని వాక్యమున కిదియే యభిప్రాయము. ప్రతి మానవుఁడును, దన పరిశ్రమమువలనను, గ్రీస్తుని మార్గదర్శిత్వమువలనను, దన యందుఁగల నీచ స్వభావమును బోనడచి, తన నడవడికను బరిశుద్ధతయందుఁ బరిపూర్ణత నందించుకొనినప్పుడుగాని దేవుని రాజ్యమందుఁ జేరుటకు వాని కర్హతగలుగదు. కావుననే పౌలుఁడు "నీ మోక్షమును భయముతోను, వణఁకుతోను సంపాదించుకొనుము" అని చెప్పెను.

ఇటుల మనలను బరిపూర్ణులనుగాఁజేసి మోక్షమునకుఁ గొనిపోవుటకై భూలోకమునందవతరించెనుగాని దుష్ప్రవర్తనగల వారినైనను దన్ను నమ్మినంతమాత్రమున స్వర్గమునఁజేర్చుట కవతరించుటలేదు. దేవుఁడును,

దేవుని రాజ్యమును, స్వచ్ఛందమగు పరిశుద్ధత గలవారలై యున్నారు. అట్టి నిర్మలమైన స్థలమున నిర్మలుఁడగు భగవంతుని సాన్నిధ్యమున మలినాంతఃకరణము లగు జీవులు, చేరుట కెట్లర్హము లగునని భావింపనగునో యనిర్వాచనీయము. కావున నీషద్భేదంబుగ దేవుని నిర్మల స్వభావముతోఁ దుల్యమగు నంతఃకరణమును బొందినఁగాని మోక్షము నందఁజాలరు. కావున నంతఃకరణమును శుభ్రపరచుకొనఁ బ్రారంభించిననేగాని మోక్షమార్గోన్ముఖుఁ డయ్యెనని వచింప వలనుపడదు. మోక్షశబ్దార్థమును బరిశీలించిన, నీయభిప్రాయముతో నేకీభవింపఁగలరు. ఆంగ్లేయభాషయందలి యీ పదము, ల్యాటినుభాషయందుఁ గల "శాల్వరీ" యను పదమునుండి యుత్పత్తినందెను. దానికర్థము పరిపూర్ణత నందుటయే. మనము మన స్వశక్తి వలనను, క్రీస్తుని సాహాయ్యమువలనను, సంపూర్ణ పరిశుద్ధత నందవలయును. అనఁగా నరు లధోగతినుండి భేదాభావమును, అహంకార, మమకార, శూన్యత్వమును గల యూర్ధ్వగతికి నుద్ధరింపఁబడవలయును.

పశ్చాత్తాపమును, గ్రీస్తునియందు నమ్మికయుఁ గలినంతమాత్రముననే మోక్షము నందనేరఁడని పైని వివరించియుంటిని. ముముక్షువులకవి రెండు నావశ్యకములు కావని చెప్పుటలేదు. వానిని మాత్రమే సంపాదించి నడవడికను బాగుఁజేసి కొనుటయం దుపేక్షించినఁ బ్రయోజనములేదు. అదియును గృషిచేసి సంపాదింపవలసిన యావశ్యకత కలదు. కృషియందుండి పెడత్రోవఁ బట్టనీక కడతేర్చుటకై యేసుని చారిత్రము మార్గదర్శిగా నుంచుకొన వలయును. అప్పుడు వానిసాహాయ్యములను లభించి పరిపూర్ణత నందుట సులభసాధ్యమగును. ఏసు తానెప్పుడును మనలను వెంబడించి గమ్యస్థానమును జేర్చెదనని వాగ్దానముఁ జేసియున్నాఁడు. తత్సూచకములగు వాక్యములఁ గొన్నింటి నిందుఁ జూపెద.

1. "జీనా సేవకుఁడైన యాకోబా నీవు భయపడవలదు; ఏమంటే నేను నీకుఁ దోడుగా నున్నాను." (ఇర్మియా. XLVI. 28.)

2. "నేను స్పష్టముగా, మీకుఁ దండ్రిని గనఁబఱచెదను."

3. "మీలోనీ సత్క్రియ నారంభించిన వాఁడేసుక్రీస్తు దినమువఱకు దాని గొనసాగించునని రూఢిగా నమ్ముచున్నాను."

(ఫిలిప్పీలు. I. 6.)

4. "తన నిత్యమహిమకుఁ గ్రీస్తునందు మిమ్మును బిలిచిన సర్వకృపానిధి యగు దేవుఁడు కొంచెము కాలము మీరు శ్రమపడిన పిమ్మటఁ దానే మిమ్ముం బూర్ణులఁగాఁజేసి, స్థిరపఱచి బలపఱచును."

(1 పేతురు. V. 10.)

పాపులకై పశ్చాత్తాపము నందుటయుఁ, గ్రీస్తునందు విశ్వాసముంచుటయు నను నీరెంటివలననే మోక్షమబ్బునను వాదము రెండు కారణముల వలన నిలువనేరదు.

1. దీనివలన మనుష్యులు స్వార్థపరాయణులై జన్మమంతయుదుష్ప్ర వర్తనలయందు వర్తించి యుత్క్రమణ కాలమునఁ బశ్చాత్తాపమునంది ప్రభువు వైపునకుఁ దిరిగి మోక్షమంద వచ్చునను దీమాకుచేలోకమున కపటకారులై ప్రవర్తింపఁగలరు. నైవాదమే సత్యమగు నెడల జీవితమంతయు దుష్కార్యాచరణమునందు నడిపి మరణకాలమునఁ బశ్చాత్తాపమునంది క్రీస్తునివైపునకుఁ దిరిగినంత మాత్రమున నాదుర్మార్గుఁడు పలుకష్టముల నోర్చి సత్ప్రవర్తనను నార్జించుకొని ప్రభుభక్తి గలిగిన యోగ్యునితో సమానునిఁగఁ బరలోకమునఁ జేర్పవలసివచ్చును. ఈయది ధర్మవిరుద్ధము కాదా. ఈయది సత్యమని నమ్మినయెడల సంఘమున యోగ్యప్రవర్తన మరుదై సంఘవినాశమునకు హేతువగును. కావుననే సర్వజ్ఞుఁడగు క్రీస్తు వీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

"మంచిఫలములు ఫలింపనిచెట్టు నరకఁబడి అగ్నిలో వేయఁబడును, కాఁబట్టి మీరువానిఫలమువలన వానిఁదెలిసికొందురు. ప్రభువా! ప్రభువా! యనినన్నుఁ బిలుచు ప్రతివాఁడుఁ బరలోక రాజ్యములోఁ

ప్రవేశింపఁడు కాని పరలోకమందున్న నాతండ్రిచిత్తప్రకారము చేయువాఁడే ప్రవేశించును." (మత్తయి VII. 19-21.)

2. మరణకాలమునఁ బ్రభువు నంగీకరించి జన్మమంతయు దుష్ప్రవర్తనలయందు గడిపిన లౌకికవిరోధియు నాజన్మాంతము ప్రభువునందు భయ, భక్తి, విశ్వాసములు గలిగి యుచితప్రవర్తనము గల యోగ్యుఁడును దైవముచే సమముగా భావింపఁబడుదురని తలంచుటయే పలువురకు వ్యగ్రతను గలిగించి దేవుని న్యాయమార్గమును సందేహింపవలసిన యవస్థతటస్థించును, మరణమునందినంత మాత్రమున జీవితకాలమంతయు, సత్ప్రవర్తనలతోఁ గడిపిన అబ్రహాము, సాలుమాను, మొదలగు మహాభాగులును, బాల్యమునుండియు జార, చోర, త్యాదివ్యగ్రములగు దుష్కర్మములయందుఁ గాలముఁగడపిన మహాపాతకియంత్యదశయందు గోతఁబడుచుంటనను భయంబునఁ బ్రభువును నమ్మితినని చెప్పినంత మాత్రమున వాఁడును సమముగాఁ జూడఁబడుదురని తలంచుట న్యాయముగాదు. అట్లనినఁ బ్రజలంపటును దనజీవితములను జిత్తవృత్తి దుష్ప్రవర్తనలయందుఁ గడిపి మరణకాలమునఁ బ్రభువును నమ్మితినని చెప్పినముక్తిగలుగునని తేలును. అట్లు తేలిన నందఱును దుష్ప్రవర్తకులే యగుదురుగావున, సంఘమొక్క క్షణమున వినాశమందఁ గలదు.

---

## 7. అధ్యాయము

### పరిపూర్ణస్వభావము నందుట మోక్షమునకు ముఖ్యము.

ప్రవర్తనయందుఁ బరిపూర్ణత నందియే మోక్షమును జెందఁగలఁ డనినచో నీ భూలోక జీవిత మత్యల్పకాలము గలదియగుట నట్టి పరిపూర్ణావస్థ నీస్వల్పకాలమున నందువార లరుదుగా నుందురు గావున మోక్షమునకుఁ బోవువార లుందురో లేదో యని కొందఱు సంశయించి ప్రభువు నాశ్ర

యింపరని కొందఱనియెదరు. ఇది సరికాదు. ఇట్టి యసందర్భమును దొలఁగించుటకే దయామయుఁ డగు భగవంతుఁడు పితృలోకము నొకదాని నేర్పరచెను. ప్రతిమానవుఁడును, యోగ్యుఁడైనను నయోగ్యుఁడైనను, ప్రభువును నమ్మినవాఁడైనను, నమ్మనివాఁడైనను, జచ్చినతోడనే పితృలోకమునఁ గన్నెత్తిచూచి పూర్వ జ్ఞానము గలవాఁడై యచ్చట నివసించి ప్రభుభక్తిని సంపాదించి తత్కటాక్షవీక్షణంబుల ఋజుమార్గత నవలంబించి పరిపూర్ణతనంది మోక్షమును జేరఁగలఁడు. (లాజరుసుని కథ.)

(*a*) భగవంతుఁడు విధించు శిక్షలు ప్రజల యభివృద్ధికొఱకే.

జ్ఞానవంతు లని పలువురిచే నెన్నఁబడు పాశ్చాత్య కవిరత్నములు మానవులు బొందుకష్టములు వారిని యోగ్యులనుగా మార్చుట కేర్పడినవని చెప్పియుండిరి. వారివాక్యములఁ గొన్నిటి నిందుఁ జూపెద.

1. ఆలివరు గోల్డుస్మిత్తు ఇట్లు చెప్పెను:—"సువాసన గల చెట్లు పెరుగునప్పుడు వాని పరిమళమును వెలువఱచలేవు, కాని నేల పైనిఁ ద్రొక్కఁబడి నలపబడినప్పుడు వానిసుగంధసంపటను వ్యాప్తమగును. అటులనే యోగ్యునికిఁదటస్థించు కష్టములు వానియోగ్యత నతిశయింపఁజేయును. ప్రతిసద్గుణమును దానికై పాటుఁబడిననే యలవడును."

2. సాదీయను నత డిట్లు చెప్పెను:—"భగవంతుఁడు తాను ప్రేమించు వార లభివృద్ధినందుటకై సకలకష్టములఁ బెట్టును. అట్టి కష్టములు వ్యర్థములు కానేరవు."

3. కోల్రిడ్జియను వాఁడిట్లు చెప్పెను:—"పితృలోకమునం దెంత ముచ్చటగా వికసించునో చూచుటకై యొకముద్దయిన లేఁతమొగ్గ భూమినుండి బాల్యముననే త్రుంచఁబడెను."

4. షేక్స్పియరిట్లు ప్రవచించె:—"ఆమె మేఘములపైనిగల స్వర్గమున కెక్కుచుండఁగాఁ జూచి నీ విపుడు విలపించుచుంటివా."

5. షెనిసను యిట్లు వ్రాసెను:—"స్వభావ సిద్ధములైన కష్టములుండినను, అంతఃకరణమునుండి వెలువడిన పాపములుండినను, సందేహములవలనఁ గలుగు లోపములుండినను, రక్తమువలనఁ గలుగు శ్రమములుండినను ఎటులనో తుదకందఱికిని మోక్షప్రాప్తియగునని మేము నమ్ముచున్నాము."

6. డ్రైడెనుఁ డిట్లు చెప్పె:—"మనమార్చియుండినఁ జెడుగే తుదకు మంచిగా మాఱును."

ప్రభువైన యేసుక్రీస్తు తాను భూలోకమందుఁ జేయఁదగిన బోధను పూర్తిపరిచి మరణానంతరము సమాధినుండి వెలువడి పునరుద్ధానమునంది, యదృశ్యలోక మనఁబడు పితృలోకమునకేగెను. అచ్చటఁగల జీవాత్మలకు బోధచేసి పరిశుద్ధత నందించెదనని చెప్పెను. కావుననే ప్రళయమునకుఁ బూర్వమునఁ గల వారి జీవములకు సహితము సువార్త ప్రకటింపఁబడెనని చెప్పఁబడియున్నది." (పిలిప్పి. I. 6.)

(b) స్వచ్ఛంద స్వభావము మోక్షమున కావశ్యకమని చెప్పుటకు బైబిలులోని నిదర్శనములు.

ఈ దిగువ నుదాహరింపఁబోవు సత్యవేదమునందలి వాక్యములవలన మోక్షప్రాప్తికిఁ బరిపూర్ణదశ యావశ్యకమని స్పష్టపడఁగలదు.

1. "యథార్థుని గుఱుతుపట్టుము, సత్యవంతునిఁజూడుము; శాంతిచిత్తునికి ముందుగతిగలదు." (కీర్తనలు. XXXVII. 37.)

2. "కాఁబట్టి నిర్జీవ క్రియలను విడిచి మారుమనస్సు పొందుటయు, దేవునియందలి విశ్వాసమును..........,అను పునాది మఱల వేయక, క్రీస్తును గూర్చిన మూలోపదేశమునుమాని, సంపూర్ణుల మగుటకు సాగిపోదము." (హెబ్రీ. VI. 1. 3.)

3. "ఫలించు ప్రతితీగె మఱి యెక్కువగా ఫలింపవలెనని దానిలోని (పనికిరాని) తీగెలను తీసివేయును." (యోహాను. XI. 2.)

4. "వానివాని పనియెట్టిదో దానినగ్నియే పరీక్షించును. పునాదిమీఁద నొకఁడు కట్టినపని నిల్చినయెడల వాఁడు జీతముపుచ్చుకొనును. ఒకని పని కాలిపోయినయెడల వానికి నష్టము కలుగును; అతఁడు తనమట్టుకు రక్షింపఁబడునుగాని, అగ్నిలోనుండి తప్పించుకొన్నట్లు రక్షింపఁబడును." (1 కొరింథి. III. 13-15.)

5. "పరలోకమందు వ్రాయబడిన........సంపూర్ణ స్థితిపొందిన నీతిమంతుల యాత్మలయొద్దకును." (హెబ్రీయులు. XII. 23.)

6. "ఇదివఱకే నేను గెలిచితినని యైనను, ఇదివఱకే సంపూర్ణస్థితి పొందితిననియైనను నేననుకొనుట లేదుగాని, నేను దేని నిమిత్తము క్రీస్తు యేసుచేతఁ బట్టఁబడితినో దానిఁ బట్టుకొనవలెనని పరుగెత్తుచున్నాను." (ఫిలిప్పీయులు. III. 12-14.)

7. "మనమందఱము విశ్వాస విషయములోను దేవుని కుమారునిఁ గూర్చిన జ్ఞానవిషయములోను, ఏకత్వముఁబొంది సంపూర్ణ పురుషులమగువఱకు, అనగాఁ క్రీస్తునకుఁ గలిగిన సంపూర్ణమైన పురుషత్వమునకు సమానమైన పురుషత్వముగలుగు వారమగువఱకు, ఆయన యీలాగు నియమించెను." (యెఫెసీయులు. IV. 13.)

8. "అటువలెఁ క్రీస్తుకూడ సంఘమును ప్రేమించి, అది కళంకమైనను, ముడతయైనను, అట్టిది మఱియేదైనను లేక పరిశుద్ధమైనదిగాను, నిర్దోషమైనదిగాను, మహిమగల సంఘముగాను, ఆయన తన యెదుట." (యెఫెసీ. V. 27.)

9. "వీరందఱుఁ దమ విశ్వాసముద్వారా సాక్ష్యము పొందినవారైనను, మనము లేకుండ సంపూర్ణులుగా కుండు నిమిత్తము, దేవుఁడు మనకొఱకు, మఱి శ్రేష్ఠమైనదానిని ముందుగా సిద్ధపరచెను గనుక వీరు వాగ్దానఫలము ననుభవింపలేదు." (హెబ్రీయులు. XI. 40.)

ఉ. "కాంచన వస్తు సంకలిత కల్మష మగ్నిపుటంబు వెట్టి సా
లించిన రీతి నాత్మని గుడించిన దుష్కర దుర్మలత్రయం
బంచితభక్తియోగ దహనార్చికిఁ గల్పక పాయునే, క్షన
త్కాంచనకుండ లాభరణ దాశరథీ కరుణాపయోనిధీ."

(దాశరథీ శతకమునందు.)

పైని దొమ్మిదవ వచనములోఁ జెప్పఁబడిన రీతిని భూలోకమందును, పితృలోకమందును నివసించుచు జీవాత్మలన్నియుఁ, బరిశుద్ధతనందిన వెంటనే, స్వర్గారోహణ దినము నియమింపఁబడును.

---

## 8. అధ్యాయము

### ఎప్పటికైన నందరు ముక్తినందెదరు.

ఇంతదనుక రక్షకుఁడగు క్రీస్తు జనాంగము నంతను భూమియందైన గాని, పితృలోకమునందైనఁగాని పరిశుద్ధులనుగాఁ జేయునని చెప్పియుంటిమి. కాని యందఱికిని మోక్ష మలవడునని చెప్పుటవలనఁ గొందఱి కాశ్చర్యముగా నుండనోపును. కావున సత్యవేద మందఱికిని మోక్ష మలవడునని బోధించిన వాక్యములఁ గొన్నిఁటి నిందుఁ బొందుపరచెద.—

1. "దేవుఁడు లోకము నెంతో ప్రేమించెను, కాఁగా నాయన తన యద్వితీయ కుమారుఁడుగాఁ బుట్టినవానియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్యజీవనముఁ బొందునట్లాయన యనుగ్రహించెను. లోకము తన కుమారునిద్వారా రక్షణముఁ బొందుటకే కానిలోకమునకుఁ దీర్పుసేయుటకు దేవుఁడాయనను లోకములోనికిఁ బంపలేదు. (యోహాను III. 16-17.)

2. "దేవుఁడు వారి యపరాధములను వారిమీఁద మోపక, క్రీస్తునందు లోకమును తనతో సమాధానపఱచుకొనుచు, నా సమాధానవాక్యము ను (ప్రకటించుట) మాకప్పగించెను." (2 కొరింథి. V. 19.)

3. "అందుచేతను బరలోకమం దున్నవారిలోఁగాని, భూమిమీఁద నున్నవారిలోఁగాని, భూమిక్రిందనున్న వారిలోఁగాని, ప్రతివాని మోకాలును యేసు నామమున వంగునట్లును, ప్రతివానినాలుకయును, దండ్రియైన దేవుని మహిమార్థమైయేసుక్రీస్తు ప్రభువని యొప్పుకొను నట్లును, దేవుఁడాయన నధికముగా హెచ్చించి, ప్రతి నామము నకుఁ బైనామము నాయన కనుగ్రహించెను." (ఫిలిప్పి II. 9-11.)

4. "ఆయనయందు సర్వసంపూర్ణత నివసింపవలెననియు, ఆయనసిలువ రక్తముచేత సంధిచేసి ఆయనద్వారా సమస్తమును, అవి భూలోక మందున్నవైనను, బరలోకమందున్నవైనను, వానినన్నిటినిఁ దన ద్వారా తనతో సమాధాన పఱచుకొనవలయుననియుఁ దండ్రి కభీష్టమాయెను." (కలొస్సి. I. 20.)

5. "ఈ సంకల్పమునుబట్టి యాయన పరలోకములో నున్నదేకాని, భూమిమీఁద నున్నదేకాని, సమస్తమును క్రీస్తువందేకముగ సమ కూర్చవలెనని తనలోఁదాను నిర్ణయించుకొనెను." (ఎఫెసీ. I. 10.)

6. "మఱియుఁ దండ్రి తన కుమారుని లోకరక్షకుఁడుగా నుండుటకుఁ బంపియుండుట మేము చూచి సాక్ష్యమిచ్చుచున్నాము." (1 యోహాను. IV. 14.)

7. "ఈయన యందఱికొఱకు విమోచనక్రియ ధనముగాఁ దన్నుఁ దానే సమర్పించుకొనెను." (1 తిమొథే. II. 6.)

8. "మఱియు సమస్తము నాయనకు లోఁబఱచఁబడినప్పుడు దేవుఁడు సమస్తములో సర్వముగు నిమిత్తము కుమారుఁడు తనకు సమస్తమును లోఁబఱచిన దేవునికిఁ దానేలోఁబడును." (1. కొరింథి. XV. 28.)

9. "మనుష్యుల కందఱకు రక్షకుఁడు." (1 తిమొథి. IV. 10.)

10. "ఈయన యందఱికొఱకు విమోచన క్రయధనముగా, దనకుఁ దానే సమర్పించుకొనెను." (1 తిమొథె. II. 6.)

11. "ఆయన మన పాపములకుమాత్రమే కాదు. సర్వలోకమునకును శాంతికరుఁడై యున్నాఁడు." (1 యోహాను. II. 2.)

12. "ఇదిగో లోకపాపమును మోసికొనిపోవు దేవుని గొఱ్ఱెపిల్ల." (యోహాను. I. 29.)

13. "నేను భూమిమీఁదనుండి పైకెత్తఁబడి నప్పుడందఱిని నాయొద్ద కాకర్షించుకొందునని చెప్పెను." (యోహాను. XII. 32.)

14. "మీరు సర్వలోకమునకు వెళ్లి సర్వసృష్టికి సువార్తను బ్రకటించుఁడి." (మార్కు XVI. 15.)

15. "నేనిచ్చు నాహారము లోకమునకు జీవముకొఱకైన నా శరీరమే యని మీతో నిశ్చయముగాఁ జెప్పుచున్నా ననెను." (యోహాను. VI. 51.)

16. సృష్టిక్షయాధీన దాస్యములోనుండి విడిపింపఁబడి, దేవుని పిల్లలు పొందఁబోవు మహిమగల స్వాతంత్ర్యము పొందుదునను నిరీక్ష గలదై, స్వేచ్ఛగాఁ గాక దానిని లోఁబఱచినవాని మూలముగా మాయకు లోఁబరచఁబడెను." (రోమా. VIII. 20-21.)

17. "ఏలీయా వచ్చి సమస్తమును చక్కబెట్టునను మాట నిజమే." (మత్తయి. XVII. 11.)

పై వాక్యములఁ జదివిచూచిన భగవంతుఁడు తన జనితైకకుమారుని భూలోక పితృలోకస్థ జీవసర్వస్వ సముద్ధరణార్థము భూలోకమున కంపి సిలువపై మరణము నందఁజేసెనని నిస్సంశయముగ గ్రహింపనగును. కావున భూలోకమునఁ బశ్చాత్తాపము నంది యేసుని నమ్మిన క్రైస్తవులుమాత్రమే

రక్షింపఁబడుదురని తలంచువారివాదము జనులందఱికొఱకు మృతిఁ బొందిన క్రీస్తుని సమాధానమును సంకుచితపఱచుటయే కాక సమంజసమును గా నేరదు. స్వభావమునందుఁ గల కష్టసుఖములను, మంచిచెడ్డలను, విమర్శించినచో భగవంతుఁడు జీవకోటినంతను నిష్పక్షబుద్ధితోఁ బరిపాలించుచున్నాఁడని తోపకమానదు. కావున నట్టి దయామయుండగు భగవంతుఁడు తన పిల్లలలో నొక కొందఱికి మోక్షమును, తక్కుంగలవారల కెల్ల శాశ్వత నరకకూపంబును సిద్ధింపఁజేయునని న్యాయబుద్ధి నాలోచించువారల కెరికిని దోపనేరదు. మానవు లందఱును పాపముఁ జేసి తండ్రికి దూరులైరి. నేను పాపముఁ జేయలేదని చెప్పఁగలవా రొక్కరును గానరారు. అట్టిస్థితిలోఁ దండ్రి ముక్తిసాధనమును గల్పించునపుడు నమ్మినవారల నొక సంఘముగాను, నమ్మనివారల వేరొక సంఘముగాను, విడఁదీసి, నమ్మినవారలకుమాత్రమే యాముక్తి లభించునటులను, తదితరులధోగతిపాలగునటులను నేర్పఱచునని తలంచుటలో భగవంతుని కన్యాయారోపణముఁ జేసినటుల యగును. యోగ్యతాయోగ్యతల విమర్శింపకయే భగవంతుఁ డందఱిపైని సమముగా దృష్టినింపుచుండ స్వసూర్యు నందఱిపై నేకరీతి వెలుంగఁజేయుచుండ (మత్తయి. V. 45) వానివిధులందఱిపై నొక్కవిధమున ప్రవర్తించుచుండ నిదివఱ కెన్నఁడు లేని పక్షపాతము, నీ ముక్తినీయు సందర్భమునమాత్రమా భగవంతుఁ డవలంబించెనని యేల తలంచవలయునో అది దురూహ్యము. నిష్పక్షపాతబుద్ధి గలవానికిఁ బక్షపాతబుద్ధి నారోపించుట, యట్లారోపించినవారి యజ్ఞతనే సూచించును. క్రీస్తు వెక్కడను భగవంతునియం దిట్టి పాక్షికస్వభావము నారోపించియుండలేదు. క్రీస్తు తన నిర్వ్యాజ కరుణాకటాక్షదత్తంబగు మోక్షంబు తన్ను నమ్మినవారికిమాత్రమే యిచ్చి, నమ్మనివారి నధోగతికిఁ బడఁద్రోయునని తలంచినచో "మీ శత్రువులను ప్రేమించుఁడి. మిమ్ము హింసించువారి కొఱకు ప్రార్థన చేయుఁడి." (మత్తయి. VI. 41.) అని తా నితరులకు

బోధించుచు, నా బోధను దా నాచరింపక తన్ను నమ్మినవారికి మోక్షము, నమ్మనివారికి నరకమునిచ్చువాఁడని యనవలసివచ్చును. అట్టి క్రీస్తునియందు స్వవచనవ్యాఘాతము నారోపించుట తప్పు. క్రీస్తు భూలోకమునం దవతరించి చేయఁదలచినకార్యము పైవాక్యమువలన వ్యక్తమగుచున్నది. శత్రువులకు మేలుచేయుమని ఘనమైనయుపదేశమునిచ్చిన మహామహుఁడు దురదృష్టవశమునఁ దనసువార్త విననివారలను విని బుద్ధిమాంద్యంబున నవలంబించనివారలను వెలిజేయునని భావింపఁజనదు. భూలోకమందుండు కొలమున జీవాత్మలు రంగుగల యద్దముల నమర్చిన సులోచనముల ద్వారా చూతురు గావున, భగవత్తత్త్వ సత్యమును గొందఱారయఁ జాలకుందురు. ఈ లోపము వారి జ్ఞాననేత్రముల కడ్డముగా నుండు రంగుటద్దములదైయున్నది. కవచముయొక్క లోపమువలన భ్రమజెంది సత్యము నారయఁ జాలనివారలను జ్ఞానవంతులనుగాఁ జేయుటయుక్తముగాని, అట్టి యజ్ఞుల శిక్షించుట ధర్మవిరుద్ధము కాదా. భగవదవతారమగు క్రీస్తువట్టి యనర్హమగు శిక్షల విధించునని తలంచఁగూడదు. "యేసు.—తండ్రీ! వీ రేమిచేయుచున్నారో వీరెఱుఁగరు గనుక వీరిని క్షమించుమని." (లూకా. XXIII. 34.) తన మరణమునకుఁ గారకులైన వారి నిమిత్తమై ప్రార్థనఁజేసిన క్రీస్తు కొందఱికి మాత్రము మోక్షమిచ్చి మిగిలిన జనసమూహము నంతను సైతానున కప్పగించునని తలంచుట హాస్యాస్పదము కాదా? ఈ సందర్భమున "పశ్చాత్తాపమునందుఁడీ, మీ పాపములు క్షమింపఁబడును." అను వాక్యము, పశ్చాత్తాపము నందని వారిని మోక్షమునుండి వెలిఁబఱచినటుల భ్రమపుచ్చును, కాని అట్లు కాదు. ఏలయనఁ గ్రీస్తు విట్లు చెప్పుచున్నాఁడు. "మీలో నేమనుష్యునికైనను, నూఱు గొఱ్ఱెలుగలిగియుండఁగా వానిలో నొకటి తప్పిపోయినయెడల నతఁడు తొంబది తొమ్మిదింటిని అడవిలో విడచిపెట్టి తప్పిపోయినది దొరకువఱకు దానిని వెదుక వెళ్లఁడా? (లూకా. XV. 4.) కావున పైరెండు వాక్యములును సమన్వయించుకొనినచో

వ్యతిరేకభావము చూపనేరదు. ఎట్లన, యేసు తన్ను నమ్మినవారినే తన మందలోఁ జేర్చుకొనుచు నమ్మనివారిని వెంబడించి పట్టుకొని నమ్మినట్లు చేసికొనును. "ప్రభువు అందఱికిని మంచివాఁడు. వాని కరుణ వాని యన్ని కార్యములయందును వ్యాపించియున్నది." పితృలోకమునందు సువార్త ప్రకటింపఁబడునని యొప్పుకొనునప్పుడీ పైకీర్తన సార్థకమగును. పితృలోకము నంగీకరించిననే భగవంతుని మంచితనమును వాని దయయును, వాని న్యాయమును, సార్థకములగును. ఆలోక మొప్పుకొననిచోఁ గోటాన కోట్లు జీవులు నరకమునకుఁ బోవలసివచ్చును గావున పై విశేషములు భగవంతునికి వర్తింపనేరవు. భగవంతుఁడీ ప్రపంచమను యంత్రము నొక కార్యమునకై సృజించి యాకార్యమును నెరవేర్చుటకొఱకు మానవునకు స్వతంత్రశక్తినిచ్చి యప్పగించెను. ఆ భగవంతుని కార్యము మానవుఁడు పాపముల పరిత్యజించి, స్వశక్తినిఁ బరిపూర్ణుఁడై తనంతటి వాఁడగుటయే. మానవుఁడే ప్రపంచమను యంత్రమును దుర్వినియోగపర్చినయెడల, నా యంత్రముపగిలి, దుర్వినియోగముఁ జేసినవానికిని, వాని సమీపవర్తులకుఁ గూడఁ గష్టములు గలుగక మానవు.

---

## 9. అధ్యాయము

### తప్పిపోయిన గొఱ్ఱె, క్రిందపడిన కాసు, దుష్టుఁడగు పుత్త్రుఁడు. అను క్రీస్తుని యుపమానముల వివరణము.

యేసుక్రీస్తు తానీలోకమునకుఁ వచ్చుటకుఁ గారణము మానవుల సంపత్తిని రక్షించుటకే యని తప్పిపోయిన గొఱ్ఱెపిల్ల, పోఁగొట్టుకొనిన నాణెము, దుర్వ్యయము చేసి చెడిపోయిన తనయుఁడు నను మూఁడుపమానములచే ఘంటాపథముగ నొక్కి చెప్పెను. ఈ యుపమానత్రయమును

గలిపి చదివినచోఁ గ్రీస్తు ప్రపంచము నంగల పలువిధములగు పాపములను మూఁడు విధముల విభజించెనని గ్రహింపనగును.

1. మనుష్యులు స్వభావముచేతఁ బ్రేరేపింపఁబడి చేయు పాపముల న్నియుఁ దప్పిపోయిన గొఱ్ఱెపిల్లయొక్క కథలో వివరింపఁబడినవి.
2. మనుష్యులకుఁ దమ స్వభావమువలనను, స్వబుద్ధివలననుగాక, దేశ కాలానుగతి ననుసరించి తటస్థించు పాపములు పోయిన నాణెము యొక్క కథారూపకముగా వివరింపఁబడినవి.
3. మనుష్యులు, స్వబుద్ధివలనఁ బాపములని తెలిసియు లెక్కింపక చేయు పాపములు దుర్వ్యయముచేసిన తనయుని కథాసామ్యమున వివరింపఁబడినవి.

1. మొదటి తరగతి పాపులకు గొఱ్ఱెతోను పమితి గలుగుట బహు యుక్తముగనున్నది. ఏలయన నీ తరగతిలోని పాపులు గొఱ్ఱెల వలెనే వారి స్వభావములు ప్రేరేపించిన కార్యములను, వానివలనఁ గలుగు దుష్ఫలితముల నారయకచేసి కష్టముల నందువారలు. గొఱ్ఱె స్వాభావిక జ్ఞానము మాత్రమే కలది, గావున, పచ్చిక మొదలగువానిచే నాకర్షింపఁబడి కాపరి దృష్టి పథమును దాటి యడవిలోఁ దప్పిపోవును. పోయిన మార్గ మును గుర్తింపనేరక తిరిగితిరిగి వేసరియు గాఁపరిని తిరిగిచేరనేరదు. కాపరి తన గొఱ్ఱెలలో నొకటి తప్పిపోయినదని గ్రహించి మందనంతను నడవిలోవిడచి తప్పిపోయిన గొఱ్ఱెకై దొరకువఱకు నన్వేషించిపట్టుకొ నును. దొరకినప్పుడు దానినిఁ దన భుజములపైనెక్కించుకొని, కొని వచ్చి తనచుట్టు ప్రక్కలవారితోఁ జేరి గొఱ్ఱె దొరికినందులకు సంతోషిం చును. ఈ కథలోఁ గ్రీస్తు గొల్లవానితోను, తప్పిపోయిన గొఱ్ఱె సహజ జ్ఞానముయొక్క ప్రేరణవలనఁ బాపముఁజేసిన మనుజునితోడను బోల్పఁ బడిరి. ఈ కథవలనఁ గ్రీస్తు తానిట్టివిధమైన పాపములను జేసినవారలు దొరకువఱకు వెదకి తన వైపునకు మళ్లించుకొని, పోయిన గొఱ్ఱెను వెదకి.

పట్టుకొనిన కాపరికలె సంతోషింతుననియుం జెప్పెను. కాపరియొక్క సంతోషముతోఁ బోల్చుట యేసునకీ పాపులనుఁబట్టుకొనుటలోఁ గల యాతురతను సూచించుచున్నది. సర్వశక్తిగలిగిన యవతారమునకిట్టి యాతురతగలిగియుండ నక్కార్య సఫలత కడ్డుకలుగ నేరదు.

2. హస్తగతమగు పదినాణెములలో నొకటి యాకస్మికముగా, భూపతనమై మృణ్మయమై యుండును. యజమానుఁడు జాగ్రత్తతో దొరకువఱకు వెదకి చిక్కినప్పుడు తన పొరుగువారలతోఁ జేరి సంతసించును. ఇచ్చటను స్వశక్తివలనఁగాని సహజ జ్ఞానముచే నీడ్వఁబడిగాని, లేక తన స్వాతంత్ర్యమునకులోఁబడని దేశకాల పారతంత్ర్యముల వలన విధికృతములగు పాపముల నాచరించువారల కుపమానముగా నాణెముయొక్క కథను జెప్పుట బహు యుక్తియుక్తముగనున్నది. నీచములగు జాతులయందు జనించి దారిద్ర్య దేవతచే నావహింపఁబడిన వారలు వారలసాంఘిక వ్యాపారానుగుణముగఁ దెలిసియుఁ, దెలియకయు, ననేకపాపములఁ జేయవలసివచ్చును. ఉదాహరణమును జూడుఁడు. నరమాంసభక్షకుల మధ్యమున జనించిన యొకఁడనేక నరహత్యల నాచరించును. అట్టి హత్యలఁ జేయకుండుట వాని స్వాధీనమందు లేదు. కాని ధర్మశాస్త్రవిధుల ననుసరించి వాఁడు మరణదండనమున కర్హుఁడు. ఆవిరియంత్ర మొకటి కలదనుకొనుఁడు. ఆ యంత్రమును ద్రిప్పువాఁడు దానిలో నేమరెనేనిఁ వెడమార్గమునఁ ద్రిప్పినచో నయ్యది పగిలి దానిని వెడమార్గమునఁ ద్రిప్పినవానికే కాక సమీపవర్తులగువారి కందఱికిని దెబ్బలు తగులును. ఈ తగులుట వలన న్యాయవిరుద్ధ మగుట యతృప్తి జనించి, దెబ్బలు తగిలినవారలను మఱికొన్ని పాపములఁ జేయఁబురికొల్పును. తద్వారా తుదకు వారు పాపులయ్యెదరు. జారి క్రిందఁబడిన నాణెముయొక్క కథఁ జెప్పుటలోఁ బైతరగతి పాపులనందఱి నిమిడ్చెను. ఇట్లు చెయిజారి క్రిందఁబడిన నాణెమునుబోలు పాపుల నందఱినిం దాను వెదకి రక్షించి సంతసించెదనని క్రీస్తు పైకథవలన సూచించియున్నాఁడు.

**3.** ఈ మూడవకథయం దొకధనికుని పుత్త్రిలలో నొకఁడు తండ్రి యొద్దఁ దనభాగమును బంచి పుచ్చుకొని, యా ధనముతోఁగూడ దేశాంతరమునకేగి తన స్వబుద్ధిని జారత్వాది దుష్కార్యములయం దా ధనమునెల్లఁ గోల్పోయి తినుటకుఁ దిండియు నిలువ నీడయు, గట్టవస్త్రమును లేక నొకనియొద్దఁ బందులకాపరితనమున కేర్పడి క్షామవశమునఁ దినుట కా పందులయొద్దనుండు పొట్టయిన దొరకక, యష్టకష్టములకు లోనై, తన దుశ్చరితమునకుఁ బశ్చాత్తాపము నొంది, తన తండ్రిదరిఁ జేర వాఁడాతనినిఁ జేర్చుకొనెను.

ఈ కథయందుఁ బాపములను గుర్తెఱిఁగియు నిర్లక్ష్యభావమున వాని నాచరించుపాపులగతి సూచింపఁబడినది. ఈ తరగతిలోని వారలు సకల కష్టముల ననుభవించినపిదపఁగాని తండ్రినిఁ జేరనేరరు. ఎప్పటికైన వీరలనుగూడఁ దాను జేర్చుకొందునని యుపమానపూర్వకముగాఁ జెప్పెను. ఈమూడుకథలలో నన్నితరగతుల పాపులు నిరూపింపఁబడియుండిరి. గొఱ్ఱెవలె స్వభావముచే నాకర్షింపఁబడి, యజ్ఞానవశమునఁ, బాపమని గుర్తింప నేరకదుష్కార్యములు చేయువారు మొదటితరగతిలోనివారు. తమస్వాధీనతలోలేని బాహ్యములైన దేశకాలతంత్రములకులోనై, దుర్గతినందినవారు రెండవతరగతిలోనివారు. పరలోకమందుండుతండ్రిమనస్వాధీనతయందుంచిన ప్రాపంచిక వస్తుసముదాయమును బుద్ధిపూర్వకముగా, దుర్వినియోగపఱచి తత్ఫలితములగు సకల కష్టములకు లోనై పరితపించువారలు మూడవతరగతిలోనివారలు. ఈకాలపు స్వభావశాస్త్రజ్ఞులు వస్తుసముదాయమును దరగతులుగా విభజించినటుల నాత్మతత్త్వజ్ఞుండగు క్రీస్తు పాత్మలు లోనగు పాపముల నెటుల సులభంబుగ విభాగ మొనరించెనో చూడుఁడు. లోకములో నేవిధమైన పాపమును మనము విమర్శించిచూచిన నీ మూడింటిలో నేదో యొక తరగతిలోఁ జేరకమానదు. ఈ మూడు కథలనుఁ బూర్వోదాహృత సత్యవేదస్థవాక్య సముదాయమును జదివిచూచిన, యేసు

పాపుల సందతి నెవ్విధమైన రక్షించి తీరునని తోపకమానదు. క్రీస్తు తానవతరించుటకుఁ గారణమగు నిజమైన సువార్తనీ కథాత్రయంబున విస్పష్టంబుగఁ జెప్పెను. ఆ సువార్త, యేదియన "నశించినదానిని వెదకి రక్షించుటకు మనుష్య కుమారుఁడు వచ్చెను.,, (లూకా. XIX. 10.) ఈ క్రింది వాక్యములవలనఁ గ్రీస్తు పాపుల సందతిని రక్షించునని తేలఁగలదు.

1. "నేనుభూమిమీఁదనుండి పైకెత్తఁబడినప్పుడు, అందఱినినాయొద్దకు నాకర్షించుకొందును." (యోహాను. XII. 32.)
2. "పాపులను రక్షించుటకుఁ గ్రీస్తు యేసు లోకమునకు వచ్చెను. (1. తిమొథె. I. 15.)
3. "మనుష్యుల కందఱికి రక్షకుఁడు." (1. తిమొథె. IV. 10.)

పై వాక్యములవలన మానవులు క్రీస్తు నంగీకరించినను, నంగీకరింపక పోయినను, గ్రీస్తు వారిని వదలక వెంబడించి వారిలోపములకుఁ దగిన శిక్షలను జేయుచు భూలోకముననో, తప్పినఁ బిత్రులోకముననో ప్రతిమనుష్యునిఁ దనవైపునకుఁ ద్రిప్పుకొని మోక్షము నిచ్చునని నిస్సందేహముగాఁ దేలఁగలదు.

ఉపాధ్యాయునితోఁ గ్రీస్తుని పోల్చుకొని చూడఁగఁదా సందఱికి మోక్షమెట్లొసంగునో సుబోధము కాఁగలదు. ఉపాధ్యాయులు, విద్యార్థుల కందఱకు వారల జ్ఞానాభివృద్ధికై యొక పాఠమును జక్కఁగా బోధించి మఱుదినమున మననముఁజేసికొని రావలసినదని చెప్పును. వాని యాజ్ఞాను సరణముగఁ గొందఱు వల్లించుకొనివత్తురు. మిగిలిన వాలు రాటపాటలకు లోఁబడి చదువమఱచి, మఱుదినము పాధ్యాయుని యెదుట నా పాఠము నొప్పగింప లేకపోవుదురు. పాఠము వల్లించిన వారికి బహుమతులును, వల్లింపక యుపేక్షచేసిన వారికిఁ దగుశిక్షను విధించుటయేకాక మూడవ దినమున నా పాఠమును గ్రొత్తపాఠమునుగూడఁ జదువ నియమిం

చును. ఇటులనే పాఠములు క్రమముగా వల్లించువఱకు నాచిలిపి పిల్లల నానాఁటి కానాఁటికిఁ గఠినశిక్షల విధించుచు నెటులనో కష్టపెట్టి చదివించును. ప్రభువైన యేసుక్రీస్తును, ఆ యుపాధ్యాయునివలెనే, భగవంతుఁడు తన స్వాధీనము నందప్పగించిన జీవులనందఱిని వారివారి పురోవృద్ధి కనుగుణమగు స్వల్పశిక్షలవిధించుచు, పాఱిపోయినను వెంబడించిపట్టుకొని క్రమముగా నభివృద్ధినొందించి యెప్పటికైనను బరిపూర్ణులనుజేసి మోక్షము నొసఁగితీరును. అటులనే కానియెడల సమస్తశక్తి జ్ఞానసంపన్నుండగు భగవంతుఁడు పంపుట, తత్తుల్యుండగు భగవత్తనయుండీ లోకంబున మానవుండై జన్మించుటయుఁ దటస్థింపకయేపోవును. నమ్మినవారికిని నమ్మనివారికినిఁగల భేదమేమనఁగా, నమ్మినవారు విశేష కష్టములకులోను గాక తన్నియమిత మార్గానుసరణ ప్రవర్తకులై సుఖమునందెదరు. నమ్మనివారు పెడత్రోవలఁబట్టి, దుర్మార్గావృతకంటకాది దుర్భర భేదంబులకుఁ జిరకాలము దనుకలోనైకర్మచేఁ బీడింపఁబడి విసిగివేసరి, తుదకుఁ బ్రభువుపై భారమువైచి తన్మార్గానుసరణరూపమున ముక్తినందెదరు. ఈ రెండు మార్గములలోనేది సుఖకరమో చదువరులే యూహింతురు గాక.

ఇంతదనుక మోక్షమననేదియో, అది యెవరిచేఁ బొందఁబడునో విమర్శించి భూలోకమునఁబుట్టిన ప్రతి మానవుఁడును, సాత్త్విక గుణానుభవమున సులభముగానును, రాజస, తామస, గుణానుభవములవలనఁ గఠినముగాను తుదకందఱును ముక్తినందఁగలరని చెప్పియుంటిని.

---

## 10. అధ్యాయము.

### మారుమనస్సునందుట యన నేమి?

క్రైస్తవులు మార్పునందిననేకాని మోక్షార్హులుగారని చెప్పెదరు. ఆ మార్పన నెట్టిదియో, కొందఱు పాశ్చాత్య పండితులు చెప్పియున్నారు.

చానవరుల సౌలభ్యంబునకు వారల యభిప్రాయమిందుఁ బొందుపరిచెద.

1. ప్రొఫెసరు ఫిడ్చ్లను వాని యభిప్రాయము :—

"నిజమైన ప్రతి క్రైస్తవుని జీవితమునందు, నొకటే యనుభవము గలదు. ఎప్పుడో యొకప్పు డేదో యొకవిధమున నిజమైనశక్తి మనుష్యుని యందుఁ బ్రవేశించును. దేవుని హస్తము మానవుని హృదయమును తాకి వాని ప్రవర్తనయందు మార్పుఁగలుగఁజేయును. ఈ మార్పువలన వాని పురాకృత పాపములన్నియు నశించి దేవుని సంతతిగా మారి మోక్షార్హతనందును. దుష్కృతమునుండి సుకృతమునకు మారుటకుఁ బశ్చాత్తాపమును, భక్తియును ముఖ్యసాధనములు. పశ్చాత్తాపమన, వెనుకకుఁదిరిగి పురాకృత దుష్కృతముల నారసి లజ్జించుటయే. ధర్మశాస్త్రవిధుల యాచరణము వలన మానవుఁడు తాను పాపిననియు, పాప ప్రతిఫల మతి ఘోరమనియు, గ్రహించును. గ్రహించినతోడనే భగవంతుఁడే దిక్కని వానియందు నమ్మకము గలుగును.

శ్లో॥ పాపోహం, పాపకర్మాహం, పాపాత్మా, పాపసంభవః,
త్రాహిమాం, కృపయా దేవ, శరణాగతవత్సల, అన్యధా శరణంనాస్తి
త్వమేవశరణంమమ, తస్మాత్కారుణ్యభావేన రక్షరక్షమహేశ్వర॥

ఒక్క పశ్చాత్తాపముచాలదు. ఒక్క భక్తియుఁజాలదు. పశ్చాత్తాపమును, భక్తియు, రెండును గలసిననే మార్పుకలిగిన దనవచ్చునని దేవుని వాక్యము చెప్పుచున్నది."

2. న్యూయార్కు పట్టణంబునంగలమిషను సంఘమునకధ్యక్షుఁడగు రెవరెండు ఏ-బి. సిమ్సనిట్లువ్రాసె:—"మార్పనునది పునర్జన్మమనుటకు సందియములేదు."

3. న్యూయార్కు నంగల రెవరెండు సి. యల్. గుడ్విన్. అనుబోధకుఁడిట్లువ్రాసెను:—"మార్పన నవీన భావములంకురించిన క్రొత్తజీవనమన నొప్పును."

4. రెవరెండు మాల్కలన్, అనువాదయాత్ర్యబోధకుఁ డిట్లు చెప్పెను:- "మార్పనఁగా, యేసుక్రీస్తునిద్వారా భగవంతుని వైపునకుఁదిరుగుట. వాని కిష్టమగు కార్యములను జేయుట. వాని కహితములగు కార్యములఁ ద్యజించుటయే మార్పనఁబడును."

---

## మూడవ భాగము

## 11. అధ్యాయము

## క్రీస్తువును కృష్ణుడును పోల్చబడిరి

మనమింతవరకుఁ, పితృలోకమొకటి కలదనియు, భూలోకమునఁగాని, పితృలోకమునఁగాని, కర్మానుభవమువలనఁ బరిపూర్ణతనంది భగవత్కటాక్షమునకుఁ బాత్రుఁడై ప్రతిజీవుఁడును ముక్తినందఁగలఁడని స్థాలీపులాక న్యాయమునఁ జూపియుంటిమి. ప్రభువగు యేసుక్రీస్తుని జీవితమును, వానిబోధయు, శ్రీకృష్ణుని జీవితమునువాని బోధయు, నొక్కరీతి నున్నవని మాయభిప్రాయము. దీని సత్యాసత్యములను జదువరులు గ్రహించుట కనువగునటుల వీరియుభయుల జీవితములను, వీరి యుభయుల మత బోధలనుఁ బోల్చిజూపెదను. ఇంతవరకు బైబిలులోని పైపై యంశములను వివరించియుంటిమి. ఇఁక నా గ్రంథమునంగల తత్త్వశాస్త్రమును బరిశీలింప వలసియున్నది. క్రీస్తు, కృష్ణావతారముల తత్త్వబోధ లేకభావము నంది యుండుటచే నీ రెంటి నేకముఖమున వివరించెద.

1. క్రీస్తు, కృష్ణ, శబ్దోచ్చారణములయందు, శబ్దసాదృశ్యము శ్రుతిగోచరముగాఁ గలదు.

2. ఉభయులును రాజవంశములఁ జన్మించిరి.

3. ప్రవక్త లుభయుల జననములను గూర్చియు, భవిష్యత్సూచనలఁ జేసిరి. "ద్వాపరాంతే హరేర్జన్మ, యదువంశే భవిష్యతి," అని కృష్ణునిఁగూర్చి చెప్పిరి. క్రీస్తునిగూర్చియు, నట్లే చెప్పియుండిరి

4. దేశాధిపతు లుభయుల విషయమై భయమునంది యాయా దేశములం గల పసిబాలురఁ జంపించిరి. క్రీస్తునివిషయమున హేరోదును, కృష్ణుని విషయమునఁ గంసుఁడును.

5. వీరుభయులును వారి యత్యున్నత్య దశల కనర్హములగు నీచస్థలముల యందుఁ జననము నందిరి. ఒకరు పశువుల తొట్టిలోను, మఱి యొకరు కారాగారమునందును.

6. జననకాలమున, జ్ఞాను లుభయులను రహస్యముగ దర్శించిరి.

7. ప్రభువుల యాగ్రహములకు వెరచి, ప్రభువులకు స్వాధీనము కాని రహస్యస్థలములఁ బరదేశములయం దుభయులును బెంపఁబడిరి.

8. ఉభయులకును మఱి సంబంధమైన సంస్కారములు రహస్యమున జరుపఁబడెను.

9. ఉభయులు అంధులకు దృష్టి నిచ్చిరి. కృష్ణుఁడు ధృతరాష్ట్రునికిని, క్రీస్తు వనేకులగు గ్రుడ్డివారికిని చూపునిచ్చిరి.

10. ఉభయులును వారి ప్రియశిష్యులకు విశ్వరూప సందర్శనము నొసంగిరి.*

11. ఉభయులును భూతముల నుక్కడంచిరి.

12. ఉభయులును జచ్చినవారిని బ్రతికించిరి.

13. ఉభయులును దమకుఁ బూర్వము భూలోకమున నివసించినవారి నెఱుఁగుదు మనిరి.

14. ఉభయులును మతబోధఁ జేసిరి.

15. వారికాలమునఁ బండితుల మనుకొనిన పెద్ద లుభయులను దిరస్కరించిరి.

16. ఉభయులను, స్త్రీలును, బాలురును, నాదరించిరి.

17. ఉభయులును నీతిబాహ్యులగు స్త్రీల పాపముల క్షమించిరి.

18. ఉభయులును దుర్మరణమునందిరి.

19. ఉభయులునుఁ బునరుత్థానము నందిరి.

20. ఉభయులును కురూపులగు స్త్రీల, సురూపులుగాఁ జేసిరి.

21. శ్రీ కృష్ణుఁడు విష్ణువుయొక్క యవతారము. అట్టి విష్ణునకు పన్ని ద్రాళ్వారులు అను 12 గురు శిష్యులు కలరని వైష్ణవులు చెప్పుదురు. క్రీస్తునకును 12 గురు శిష్యులే కలరు.

22. నిర్మల స్థలములయందు మతబోధ జేయుటకు గాను వీ రుభయులును తమ శిష్యులను తరుచు వనములకుఁ దీసికొని వెళ్లుచుండెడి వారు.

23 క్రీస్తుని యొక పురుషుఁడు గానున్న క్రైస్తవ సంఘమునంతను స్త్రీ గానున్న వర్ణించి యనేకస్థలములయందు భార్యాభర్తలకుఁ గలుగఁ దగిన యన్యోన్య ప్రేమానుబంధములను మతకర్తకును సంఘమునకును నారోపించి వర్ణించియుండిరి. కృష్ణుని మతకర్తగను వాని శిష్యవర్గమునంతను గోపికలుగను భావించి పరస్పరానురాగ సంబంధములు కల్పించి వర్ణించిరని భావించినచో కృష్ణుని జారత్వ ముడుగును. ఇట్టి వర్ణన ముభయపక్షములను సమానధర్మముగనే దోఁచఁ గలదు. కృష్ణుని చరిత్రమును వ్రాయువారలు తమ భాషాగ్రంథముల యందపరిమితముగఁ బ్రబలియుండెడి శృంగారరసమును వానియందు వెదజల్లుటచే నిప్పుడు ప్రతిపదార్థమును దలంచిన కేవల వ్యభిచారిగా గనుపించుచుండెను. ఈ విషయమును బుద్ధిమంతులు దూర దృష్టి విమర్శింతురు గాక.

పై సందర్భములను నిర్మల హృదయములతో నాలోచించి చూచిన, నుభయుల జీవితములయందును సాదృశ్య మెక్కుడు గాన్పించక మానదు.

జీవితములయందె కాక, వారి బోధలయందును సంపూర్ణ సాదృశ్యముగలదు. అట్టి సాదృశ్యముల నీ క్రింద వివరించెదము.

---

## 12. అధ్యాయము

### భగవద్గీతయందలి వేదాంతము.

హిందువులలో వేదాంతము విశేషముగఁ జర్చింపఁబడుచుండును. ఈమతభిప్రాయ భేదములచే దీనిలోఁ బలుతెగలేర్పడినవి. ఈ భేదాభిప్రాయముల నన్నిటి నిచ్చట విమర్శించ నవసరములేదు. ఈగ్రంథమునందా పనికిఁ దావు చాలదు. ఉపనిషత్తులయందు నుత్తర మీమాంసయందు, భగవద్గీతలయందు నుదాహరించినరీతిని సూక్ష్మముగ నిందు వివరించి యా సత్యములు, సత్యవేదమునందుఁగూడఁ గలవా యని విమర్శింతము. జ్ఞానమార్గమును గూర్చి రామచారక యోగీంద్రులవారు క్రిందిరీతిని వ్రాసియుండిరి.

"ప్రపంచమునఁ గల జీవాత్మల కన్నిఁటికిఁ బరమాత్మయే యాధారము. ఈ పరమాత్మను మించిన దేదియులేదు. ఈ పరమాత్మయే సమస్త చరాచర జీవప్రపంచమునందు వ్యాప్తమై వ్యవహరించుచుండ నజ్ఞానవశమునఁ బ్రతిజీవుఁడు నీ యాత్మ తన సొత్తుగ భావించుచుండును. నిజమైన దొక్కటియే కలదు. మీ కందఱికిని స్థితి దానియందే కలదు ఆ పరమాత్మను గ్రహింపఁగలిగిన వారలకు జీవాత్మలు వేఱువేఱుగఁగలవను భ్రాంతి నశించును. ఈ యూహయందు శాంతిగలదు. ఈ జ్ఞానమునందు, బలమును, శక్తియుఁ గలవు. కావున నీ రాజ్యమున నీవు ప్రవేశించుము. జన్మముచే నీకు హక్కుకలిగిన యీ జ్ఞానమును సంపాదించుకొనుము. నీతనుమధ్యమునసే యాపరమాత్మ నివసించియుండుటను గనుగొనఁగలవు. కావున నా సమాధియందుఁ బ్రవేశించుము." సమస్త చరాచర ప్రపంచము

నకును సృష్టి, స్థితి,లయకారణ భూతుఁడగు పరబ్రహ్మ యొక్కఁడేయనియుఁ, దనయందుఁ గల మాయాశక్తివలన దీనినంతను సృజించెననియుఁ, బ్రతి జీవ జంతువునందు నా పరమాత్మయే, జీవాత్మయై ప్రవర్తించుచుండుననియు, వేదాంత మతము బోధించును. ఈ జీవాత్మలు మాయయను మహాశక్తి యొక్క చిత్ర విచిత్ర, మహేంద్రజాలమునందు నిమగ్నులై మైమఱచి స్వీయపరమాత్మ స్వభావ, స్వరూపజ్ఞానమును మఱచి సంసారసాగర నిమగ్నులై దుఃఖభాజనులగుదురు. ప్రత్యాత్మయుఁగాలాను క్రమమున జ్ఞానాభివృద్ధినంది మాయను దిగఁద్రొక్కి, భక్తిమార్గమును గాని, కర్మమార్గమును గాని, జ్ఞానమార్గమును గాని యవలంబించి సోహంబ్రహ్మ యను, సత్యమును స్వానుభవమునకుఁ దెచ్చుకొని బ్రహ్మైక్య సంధానమును, వడయుదురు. వేదాంతము జగన్మిథ్య, బ్రహ్మసత్యమని చెప్పును.

మిథ్యావాక్య ప్రయోగమువలన నస్థిరతయూహ్యము. బ్రహ్మజ్ఞానముతో మాయ కభావము కలుగుచుండుట నీ మాయయొక్క యశాశ్వతత్వము గ్రాహ్యము. "మంచు బిందువులయందుఁ బ్రతిఫలించు సూర్యుఁడొక్కఁడేయైనను బాహ్యదృగింద్రియ ప్రసారమునకు సూర్యబాహుళ్యము గానుపించును. కాని మంచు బిందువులయందుఁగల సూర్యభ్రాంతి కేవల ప్రతిబింబమాత్రమే కాక సూర్యకరప్రసారసహితమై యున్నది. అటులయ్యు సూర్యుని సంపూర్ణత కభావము ప్రాప్తింపదు." అటులనే పరబ్రహ్మ పదార్థాను ప్రసారము ప్రతి జీవాత్మయందుఁ గలదయ్యు బ్రహ్మ పదార్థమునకుఁ గొఱంత రానేరదు. మఱియొక దృష్టాంతము నారయుఁడు.

"తరణికిరణ ప్రసారమున తదంబుకణంబు లావిరిగ మారి మేఘములై యాకాశమునంతయు నావరించి వర్షధారా రూపమునను, దుహినరూపంబునను, భూమీతలంబునంబడి సెలయేఱులై పాఱినదులంజేరఁ దన్నదీజలంబు లపార ఝరీవేగంబులై సమస్త జీవసముదాయంబునకు జీవనంబై తుదకు దధింజేరురీతిఁ, పరబ్రహ్మంబునుండి పరమాణువులు వెలువడి జీవా

త్మలై జననమరణంబులందగిలి, సుకృత, దుష్కృత ప్రతిఫలంబగు కర్మ లోఁజిక్కి లోకోద్ధరణాది మహాకార్యంబులం దనిసి కడు భీకరాకారంబునం బ్రజలఁబట్టి పీడించు ఘోరాఘంబుల కాటపట్టగు మాయాదేవినిఁ బరమాత్మజ్ఞానం బనుపవిత్రంబున ఛేదించి స్వస్వరూప గ్రాహ్యరూపంబగు బ్రహ్మైక్య సంధానంబును బొందఁగలవు.

---

# 13. అధ్యాయము

## బైబిలునందలి వేదాంతము.

పైని వివరించిన యాత్మానుభవ జ్ఞానబోధమను వేదాంతమును యేసు క్రీస్తువును, సత్యవేదమును, బోధించెనా? బోధించినయెడల నెంతవఱకు నీ రెండును బోల్పఁదగియుండునని విమర్శింపవలసియున్నది.

1. "దేవుఁడు తన స్వరూపమందు నరుని సృజించెను." (ఆది. I. 27.)
2. "మఱియు యెహోవా దేవుఁడు నేల ధూళితో నరుని నిర్మించి వాని నాసికా రంధ్రములలో జీవముల యూపిరిని నూదెను. అప్పుడు నరుఁడు జీవాత్ముఁడాయెను." (ఆది. II. 7.)

పై నుదాహరించిన వాక్యములు పరిశీలించినచో భగవంతుఁడు, తన నివాసమున కాలయముగ మానవ కళేబరమును జేసి తానే తన శ్వాసమూలముగ వానిలోఁ బ్రవేశించెనని స్ఫురించును. అనఁగా భగవంతుని జీవశక్తి లోని యొక పరమాణువు మనుష్యునిలోఁ బ్రవేశించి వానికిఁ జలనాది శక్తులఁ గలిగించె ననవచ్చును. కావునఁ బ్రతిమానవునియందుఁగల సత్త్వము ను భగవదంశమే యగుటవలన మానవుల కభేదము, నారోపింపవచ్చును.

3. "దేవుని రాజ్యమెప్పుడు వచ్చునని పరిసయ్యు లాయన నడిగినప్పు డాయన, దేవుని రాజ్యము ప్రత్యక్షముగా రాదు. ఇదిగో దేవుని

రాజ్యము మీ మధ్యముననే యున్నది గనుక, ఇదిగో యిక్కడనని, అదిగో యక్కడనని చెప్ప వీలుపడదని వారికి నుత్తరమిచ్చెను." (లూకా. XVII. 20, 21.) ఈ వాక్యముపైనిఁ జెప్పఁబడిన యర్థమును బలపఱచుటలేదా ? భగవంతుఁడు ప్రతి కళేబరమునందును నివసించుచుండెనని చెప్పుటయేకదా యీ వాక్యమునకుఁ బ్రయోజనము.

4. "మీరు దేవుని యాలయమై యున్నారనియు, దేవుని యాత్మ మీలో నివసించుచున్నాఁడనియు మీరెఱుఁగరా ?". (1 కొరింథి. III. 16.)

పూర్వోదాహృత సత్యవేదవాక్య చతుష్టయముందిలకించి, నిష్పక్షపాతబుద్ధితో నాలోచించినఁ బ్రతి మానవుని యాత్మయు భగవదంశమే యని తేలకమానదు.

5. "మఱియు మీరు కుమారులై యున్నందున, నాయనా ! తండ్రీ ! అని మొఱ్ఱఁ బెట్టు తన కుమారుని యాత్మను దేవుఁడు మన హృదయములలోనికిఁ బంపెను. కాఁబట్టి నీవిఁకను దాసుఁడవు కావు కుమారుఁడవే, కుమారుఁడవైనయెడల దేవుని ద్వారా వారసుఁడవై యున్నావు." (గలతి. IV. 6, 7.)

ఈ వాక్యమువలన "ఆత్మావై పుత్రనామాసి" యను న్యాయానుసరణంబున మనము భగవత్తనయుల మగుటచేఁ దత్తుల్యులమని తేలుటయే కాక ప్రజలనందఱిని రక్షించుటకై భగవంతుఁడు క్రీస్తు రూపమున నవతరించెనని తేలుచున్నది.

6. "అందఱికిఁ దండ్రియైన దేవుఁడొక్కఁడే. ఆయన అందఱికిఁ బైఁగానున్నవాఁడై అందఱిలోను వ్యాపించి అందఱిలోను న్నాఁడు." (ఎఫెసీ. IV. 6.)

పరబ్రహ్మ మొక్కఁడే యనియు నాతఁడు సృష్టియందంతటను వ్యాప్తుఁడైయుండియు సృష్టి కతీతుండైయుండెనని ప్రవచించు నుపనిషద్ర హస్యమునకును, నీ సత్యవేదవాక్యమునకును భేదమించు కేనిఁ గాన్పించదు.

7. "మఱియు నీవు నన్నుఁబంపితివని లోకమునమ్మునట్లు, తండ్రీ, నాయందు నీవును నీ యందు నేను నున్నలాగున వారును మన యందేకమై యుండవలెనని వారికొఱకుమాత్రము నేను ప్రార్థించుటలేదు ; వారి వాక్యమువలన నాయందు విశ్వాసముంచు వారందఱు నేకమైయుండవలెనని వారికొఱకును ప్రార్థించుచున్నాను." (యోహాను. XVII. 20, 21.) ఇచ్చటఁ గ్రీస్తు తానును దన తండ్రి యగు భగవంతుఁడు నొక్కటియేయని తాను గ్రహించినవాఁడై, తన్ను నమ్మిన వారికందఱికిని నిట్టి జ్ఞానమే కలుగఁజేయవలసినదని తండ్రినిఁ బ్రార్థించెను. ఈ వాక్యార్థమునకును వేదాంత బోధకును, అభేదాధ్యవసాయము కలదు. మఱియు నింకొక సందర్భమునఁ "దానును, దన తండ్రియు నొక్కటియేయని చెప్పెను." (యోహాను. X. 30.)

8. "అప్పుడు ఫిలిప్పు ప్రభువా ! తండ్రిని మాకుఁ గనఁబఱచుము ; మాకంతయే చాలునని యాయనతోఁ జెప్పఁగా—ఫిలిప్పు, నేనింత కాలము నీయొద్ద నుండినను, నీవు నన్నెఱుఁగవా ? నన్నుఁజూచిన వాఁడు తండ్రినిఁ జూచియున్నాఁడు గనుకఁ దండ్రిని మాకుఁ గనఁబఱచుమని యేల చెప్పుచున్నావు ? తండ్రియందు నేనును నాయందుఁ దండ్రియు నున్నామని నీవు నమ్మవా ? నేను మీతోఁ జెప్పుచున్న మాటలు నాయంతటనే నేఁ జెప్పుటలేదు ; తండ్రి నా యందు నివసించుచుఁ, దన క్రియలు చేయుచున్నాఁడు. తండ్రియందు నేనును, నాయందుఁ దండ్రియు నున్నామని నమ్ముఁడి; లేదా యీ క్రియల నిమిత్తమైనను నన్ను నమ్ముఁడి." (యోహాను. XIV. 8. 11)

ఈ వాక్యమునకు మేము వేఱుగ వ్యాఖ్యానముఁ జేయ నవసరము లేదు. ఏలయన, నీ వాక్యములే వేదాంత బోధకములు.

9. యేసు దేవాలయమున సలోమోనుని మంటపమునందు దెరూష లేములో శీతకాలమునఁ బచారుచేయుచుండఁగా యూదులు నీ నిజమైన తత్త్వమును దెలియఁజెప్పుమని ప్రశ్నింపఁగా నీదిగువ రీతిని స్పష్టముగ సమాధానముఁ జెప్పెను—"నేనును దండ్రియు నేకమై యున్నాము." (యోహాను. X. 30.)

10. సీమోను పేతురు తన విషయమై సందేహింపఁగా నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "మీ హృదయము కలవర పడనియ్యకుఁడి; దేవుని యందు విశ్వాసముంచుచున్నారు. నా యందును విశ్వాసముంచుఁడి. నా తండ్రియింట ననేక నివాసములుగలవు, లేనియెడల మీతోఁ జెప్పుదును; మీకు స్థలము సిద్ధపఱచ వెళ్లుచున్నాను. నేను వెళ్లి మీకు స్థలము సిద్ధపఱచినపుడు నేనుండు స్థలములో మీరు నుండులాగున మరల వచ్చి నాయొద్ద నుండుటకు మిమ్మును దీసికొని పోవుదును." (యోహాను. XIV. 1-3.) పూర్వోక్త వాక్యములవలన యేసు తన శిష్యులకుఁ బరలోకరాజ్యమునందుండఁ దనతో సమానమైన పదవి నిత్తునని చెప్పెను. తానును దన తండ్రియు నొక్కటియేయని చెప్పుటవలనఁ దన శిష్యులను దనతో సమానులనుగాఁ జూతుననుటవలనఁ దన తండ్రియగు దేవునితో సమానులగుదురని చెప్పినటులనే యగును. ఇదియే మోక్షము. దీనిని మానవజాతమున కంతకు నియ్యఁగలఁడని మోక్షవిచారణ ఘట్టమునందీ గ్రంథములోఁ జెప్పియుంటిమి. ఈమోక్షమునుఁ బొందుటకవలంబించఁదగు మార్గము లెవ్వియైన నెప్పటికో యొకప్పటికి మానవజాతియంతయు దేవునితో సమానులై "అహంబ్రహ్మాస్మి" యనఁదగు పదవినందెదరని తేలుచున్నది. పైఁజెప్పిన మార్గము

తెల్పియున — దేవునియందుఁ గ్రీస్తునందును నమ్మిక గలవారలై భక్తి, జ్ఞాన, కర్మ, మార్గంబులలో నెద్దియేని యొకటి యవలంబించవలయును. ఈ యభిప్రాయమునే క్రీస్తు తన బోధయందెల్లెడల వెదఁజల్లియుండెను. గ్రంథ విస్తర భీతిచే వానినన్నిటి నిం దుదాహరింప వెనుదీయుచున్నారము. ఐనను సత్యవేదములోని యీ బోధను గూర్చిన వాక్యములుగల యధ్యాయవచన సంఖ్యలనిచ్చుచున్నాను. చదువరులా యా స్థలములయందుఁ జదువుకొనవలయును. (యోహాను. XII. 45; XIII. 20: 31, 32, XIV. 1, 7, 9, 10, 11, 20; XVII 11. 21. 22.)

11. క్రీస్తు పునరుత్థానానంతరము మరియమ్మకుఁ గాన్పించి యిట్లు చెప్పెను. "నా సహోదరులయొద్దకు వెళ్లి నా తండ్రియు, మీ తండ్రియు నా దేవుఁడును మీ దేవుఁడు నైన వానియొద్దకు నెక్కిపోవుచున్నానని వారితోఁ జెప్పుమనెను." (యోహాను. XX. 17.) ఏసుపై వాక్యములను జెప్పుటవలనఁ దాను సామాన్యమనుష్యునివలెఁ బర్వతముపైని సైతాను (మాయ) వలన శోధనముఁ జేయఁబడి నిగ్రహించుట వలనను, నిర్మలమైన జీవితమును మోషే విధించిన ధర్మశాస్త్రానుసరణముగ నడుపుటవలనను, దనయొక్క మితిలేని సత్కార్యాచరణ ఫలితము నాశింపక త్యజించుటవలనను, తుదకు లోకసంరక్షణార్థమై సిలువపైఁ దన ప్రాణము నిచ్చుటవలనను, జీవేశ్వరైక్యసంధాన తత్త్వమును గ్రహించితిననియు, నివి యన్నియు జరిగిన వెనుకఁ దానిప్పుడు తన తండ్రియొద్దకుఁ బోవుచుంటిననియు, నీ తండ్రియొద్దకు ననుటవలన మీరును నావలెఁ బై కార్యములనన్నిటి నాచరించినచో నావలె స్వస్వరూపజ్ఞానముగలిగి బ్రహ్మసాక్షాత్కారమునందఁగలరని తన శిష్యులకుఁ గడపటి యుపదేశమును జేసెనని పైవాక్యముల వలన గ్రహింపనగును.

12. ఏసు తాను కడపటి దినమునఁ దిరిగివచ్చి సింహాసనముపైఁ గూర్చుండినపుడు దుష్టుల నీరీతి వారించెదనని చెప్పెను. అపుడాయన యెడమవైపున నుండువారినిఁ జూచి, శపింపఁబడిన వారలారా! "నే నాకలిగొంటిని, మీరు నాకు భోజనముఁ బెట్టలేదు; దప్పిగొనియుంటిని, మీరు నాకు నీరీయలేదు." (మత్తయి XXV. 42.) ఆయన యిట్లుపలుకఁగా "మీ కెప్పు డాకలిగొంటిరి, మీ కెప్పు డాహారమియ్యకపోతి" మని యడిగెద రనియుఁ దానీ దిగువరీతి ననఁగా "ఈ మిక్కిలి యల్పులైనవారిలో నొకనికైనను మీరీలాగునఁ జేయలేదు. కనుక నాకుఁ జేయలేదని నిశ్చయముగా మీతోఁ జెప్పుచున్నానని వారితో ననును." (మత్తయి. XXV. 45.) దీనివలనఁ బ్రభు వన్నిజీవులయందును నివసించియుండును గావున వేని కాహార మిడకపోయినను దనకిడనట్లే యెంచునని గ్రహింపనగును. అనఁగా సహాయార్థియై బాధపడుచుండు నే మనుజుని కుపకారముఁ జేయకపోయినను భగవంతుని సేవఁ జేయనిరీతిగా భావించి దానికనుగుణమగు స్వల్పశిక్ష విధింపఁబడునని గ్రహింపవలయును. ఈ దిగువ నుదాహరింపఁబోవు వాక్యములవలన జీవాత్మలకును, బరమాత్మకు నభేదాధ్యవసాయము నిశ్చితమగును.

13. "అందు కేసు- మీరు దైవము లని నే నంటినని మీ ధర్మశాస్త్రములో వ్రాయఁబడి యుండలేదా? లేఖనము నిరర్థకము కానేరదుగదా; దేవునివాక్య మెవరికి వచ్చెనో వారే దైవములని చెప్పినయెడల- నేను దేవుని కుమారుడనని చెప్పినందులకుఁ దండ్రి ప్రతిష్ఠఁ జేసి ఈ లోకములోనికిఁ బంపినవానితో - నీవు దేవదూషణముఁ జేయుచున్నావని చెప్పుదురా?" (యోహాను. X. 34. 36.)

14. "నీవు న్యాయాధిపతిని (దేవుళను) నిందించవలదు" (నిర్గమ. XXII. 28.)

15. "మీరు దేవు లనియు, మీరందరు సర్వోన్నతుని కుమారు లనియుఁ బలికితిని" (కీర్తనలు. LXXXII. 6.)

16. ఆమహిమ గుణాతిశయములనుబట్టి యాయన మన కమూల్యములు నత్యధికములు నైన వాగ్దానముల ననుగ్రహించియున్నాఁడు. దురాశ ననుసరించుటవలన లోకమం దున్న భ్రష్టత్వమును ఈ వాగ్దానములమూలముగా మీరు తప్పించుకొని దేవస్వభావము నందుఁ బాలివారగునట్లు వాని ననుగ్రహించెను." (2 పేతురు. I. 4.)

17. "దేవునియాత్మచేత నెందరు నడిపింపఁబడుదురో వారందరు దేవుని కుమారులై యుందురు. ఎందుకనఁగా, మరల భయపడు టకు మీరు దాస్యపుటాత్మను బొందలేదు. కాని స్వీకృత పుత్త్రాత్మను పొందితిరి. ఆయాత్మ కలిగినవారమై మనము నాయనా! తండ్రీ! యని మొఱ్ఱపెట్టుచున్నాము. మనము దేవుని పిల్లలమని ఆత్మ తానే మన యాత్మతోఁగూడ సాక్ష్య మిచ్చుచున్నాఁడు. మనము పిల్లలమైనయెడల వారసులము, అనఁగా దేవుని వారసులము; క్రీస్తుతోఁగూడ మహిమఁబొందుట కాయనతో శ్రమ పడినయెడలఁ గ్రీస్తుతో వారసులము." (రోమా. VIII. 14. 17.)

ఇంతదనుక ను సత్యవేదవాక్య పురస్సరముగ జీవాత్మలకును, పర మాత్మకును, భేదములేదని రుజువుచేసియుంటిమి. ఇఁక నా సంగతిని తెలిసికొనుటకుఁ గ్రీస్తు చెప్పినమార్గము లెవ్వియో విమర్శింతము. దేవుని గుర్తించి వాని రాజ్యమును బొందదలంచినచో మనదృష్టిని బహిర్ముఖము గానీయక యంతర్గత మగునటులఁ జేయవలయును. దేవుని రాజ్యము

మనస్థూలశరీరాంతర్గతమై యున్నది గాని దానికి భిన్నమగు స్థలమున లేదు. దానినిఁ జెందుటకు సరియైన మార్గమునఁ బ్రవేశింపవలయును. దీనినే యాధ్యాత్మిక తత్త్వజ్ఞులు జ్ఞానమార్గమని వాడెదరు. దీనినే యుపనిషత్తులును, బ్రహ్మసూత్రములును బోధించును. దీనినే శంకరుఁడు విపులముగ వ్రాసియున్నాఁడు. ఈ విషయమునఁ గొందఱు జ్ఞానులు వ్రాసిన మాటలనింకఁ బొందుపరచెద.

1. శ్రీరామ కృష్ణానంద స్వాములవారిట్లు వ్రాసిరి :—

"క్రీస్తు భూమియం దవతరించి ప్రజలు భగవత్తత్త్వమును గ్రహించుట కావశ్యకమగు జ్ఞానమార్గమును బోధించెను. భగవంతుని నిజహృదయముతోను ఆత్మతోను సంపూర్ణమనస్సుతోను, ప్రేమించుట మనుష్యునకు విధికృతమని బోధించెను. క్రీస్తు సాత్త్వికుఁడు. మోషే కంటె నెక్కువ లోచూపు గలవాఁడు. దేవునిరాజ్యము తనలోనే కలదని గ్రహించెను. దేవునిరాజ్యమే నీలో నుండినపుడు దేవుఁడు నీలో నుండెనని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కావున వానినిఁ ద్రికరణశుద్ధిగఁ బ్రేమించుటకు బాహ్యప్రపంచము నన్వేషింపక నీలోఁ గల యంతరాత్మను దెలిసికొనుము. కావున మోషేవలనను, గ్రీస్తువలనను బోధింపఁబడిన మార్గములకును, శంకరుఁడు మొదలగు నాత్మతత్త్వజ్ఞుల బోధకును భేదమేమియులేదు. అందఱును "తత్త్వమసి" యని గ్రహించవలసినదనే బోధించిరి."

"మఱియొక మార్గములేదు ; క్రీస్తు "నేనే మార్గమునని" చెప్పినది సత్యము : ఏలయనఁ గ్రీస్తనుటవలన వాని స్థూలశరీరము గ్రాహ్యము కాదు గాని వానియందు నివసించియుండు పరబ్రహ్మమే గ్రాహ్యము. క్రీస్తునివంటి జ్ఞానము సంపాదించుటకు లేక మనము భగవంతుని పుత్త్రుల మగుటకు, లేక మనము వానియం దైక్యమగుటకు నజ్ఞానవశమున మనకుఁగల జీవాత్మజ్ఞానమునుఁ బరమాత్మజ్ఞానమను సముద్రములోఁ గలప

వలయును. దేవుని కుమారుఁడొక్కఁడె యెరూషలేములో నేకాదు. అంతటను గలఁడు. శ్రీకృష్ణపరబ్రహ్మ "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" యని చెప్పియున్నాఁడు."

2. "నీవు మనో బుద్ధి చిత్తాహంకారములను జయింపవలయును, నీవు క్రీస్తువలె, నీ స్థూలశరీరమును, నందుఁగల యింద్రియ వ్యాపారములను సిలువవేసి జయించిననేకాని నీ మృతకళేబరమును దాటి యూర్ధ్వముఖుఁడవు గానేరవు. ఇది ప్రతి మనుజుఁడును జేయవలసిన కార్యము. ఇందుల కనుగుణమగు సాధనసంపత్తిని శ్రీ రామకృష్ణ పరమహంసుఁడు చెప్పెను."

3. డెస్సరను పాశ్చాత్యుఁడు, యాత్మాన్వేషణమను తన గ్రంథమున వ్రాయుటలో సమాధియం దున్నకాలమున జీవాత్మ పరమాత్మలో నేకీభవించును. కాని రెండును నొకటి గానేరవు. క్రీస్తు భగవంతుఁడు తన తండ్రియని చెప్పిన దిట్టి స్వానుభవ జ్ఞానమువలననే కావున వానిబోధ యంగీకరింపవలసినదియే. నేనును నా తండ్రియు నొక్కటియే యని చెప్పిన క్రీస్తుని వాక్యమునకు వేదాంతార్థము నారోపించుచున్నారు. (రాజం అయ్యరు.)

4. "ఏసుని వాక్యములు—లిబియను అను నెడారిలో నీ మధ్యమున నొక "పేపిరస్" అను కాగితము దొరకినది. ఈ కాగితము క్రీస్తు పుట్టిన తరువాత 150 మొదలు 300 సంవత్సరముల మధ్యను వ్రాయఁబడినదని నమ్మెదరు. ఇందులో నేసుక్రీస్తు చెప్పిన యెనిమిది వాక్యములు గలవు. వానిలో రెండు ముఖ్యమైనవి. "1. సబ్బాతుదినముఁ బరిశుద్ధముగ నాచరించినఁగాని తండ్రిని నీవు చూడవు." 2. "ఆత్మ లెన్ని యుండినను ఒక్కటి మాత్రమే గలదు. నేను వానిలో నున్నాను. రాతినెత్తుము. అక్కడ నన్నుఁ జూడఁగలరు, చెట్టును కొట్టుము. నేను

అక్కడ నున్నాను.'' వీనిని గూర్చి లండను స్పెక్టేటరను పత్రిక యిట్లు వ్రాసెను.

''పైవాక్యములనుఁ బూర్తిగనంగీకరించినచోఁ గ్రైస్తవప్రాపంచికాభిప్రాయమును, హిందువుల యభిప్రాయాను సరణముగ మార్చుకొనవలసివచ్చును. భగవంతుఁడు సృష్టియం దంతటను (అనగా) రాతియందును, గడ్డియందునుగూడ వ్యాప్తుఁడై యుండెననుపక్షమున హిందువులు చెప్పునట్లాయన, నాయా వస్తురూపములచే నేల పూజింపఁగూడదు? భగవంతుఁడు ప్రతివస్తువునందు నున్నయెడల నన్నివస్తువులనుఁ బూజార్హములే.'' (రాజమయ్యర్.)

5. ఇంద్రియవ్యాపార యుక్తం బగులోకమున జనన మందినను, మనమాత్మస్వరూపులమై యున్నాము. మీ వేదాంతశాస్త్రములోని చాలభాగము మా నూతన నిబంధనతో నేకీభవించును. గావున జర్మను దేశస్థుఁడగు ''హెజల'' ను మహాత్ముఁడు వ్రాసిన మాటలు సత్యములే. ఆమాట లెవ్వియనిన- ఆత్మ వినా సత్యమైన పదార్థ మేదియులేదు. ఏవస్తువులైన నాత్మసంబంధమున నెంత వెలుగుచుండునో యంత సత్యమైన దగుచుండును. (టి. యి. స్లేటరు.)

6. డాక్టరు యఫ్. హెచ్. బ్రాడ్లే. అనునాతఁ డిట్లు వ్రాసెను. ''దృశ్యపదార్థ మంతయు సత్యమగు నదృశ్యపదార్థముయొక్క ఛాయయే. ఛాయ లేనిదే సత్యపదార్థము నుండదు. సత్యపదార్థముయొక్క నిజమును దాని ఛాయవలననే గ్రహింపనగును.''

ఈ పైవాక్యమునకును ఉపనిషద్వాక్యములకును భేదములేదు. ఎట్లన, అవాఙ్మానసగోచరమగు బ్రహ్మపదార్థముయొక్క స్థితి దాని ఛాయయు నసత్పదార్థమునగు ప్రపంచమువలన నూహ్యము. అనఁగా- సత్పదార్థజ్ఞాన మసత్పదార్థమువలననే తెలిసికొనవలనని తాత్పర్యము.

# 14. అధ్యాయము

## (a) వేదాంతుల సాధన చతుష్టయ సంపత్తి.

బ్రహ్మజ్ఞాన విచారణమునకు సాధన చతుష్టయసంపత్తి కల వాఁడే యధికారియని గీతాశాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నది. ఆ సాధనచతుష్టయసంపత్తి యెట్టిదన :—

1. నిత్యానిత్య వస్తువివేకము. బ్రహ్మపదార్థమే సత్యమనియు, దృశ్య ప్రపంచమంతయు ననిత్యమనియుఁ దెలిసికొనఁదగు వివేకము.

2. ఇహాముత్రార్థఫలభోగవిరాగము :—ఐహికములగు స్రక్చందన వనితాది విషయ భోగాదులయందును, ఆముష్మికము లగు రంభాద్యప్సరస్త్రీ సంభోగంబులయందును, వమనాన్న మూత్ర పురీ భాషాదులయందువలెనే యిచ్ఛలేకయుండుట.

3. శమాది షట్క సంపత్తి :—

   (a) శమము :—మనంబును శ్రవణాది వ్యతిరిక్తమైన విషయాదుల వలనం ద్రిప్పి శ్రవణంబునందే నిలుపుట.

   (b) దమము :—జ్ఞానేంద్రియంబులను, కర్మేంద్రియంబులను, శ్రవణాది వ్యతిరిక్తంబులైన విషయంబులవలన మరలించి, శ్రవణాదులయందే నిలుపుట.

   (c) ఉపరతి :— విహితమైన కర్మములను విధ్యుక్తముగా విడుచుట. అనఁగా, విహితమైన కర్మములను కర్తృత్వాద్యభిమానరహితుఁడై ఫలంబు నపేక్షింపక చేయుట.

   (d) తితిక్ష :—శీతోష్ణాదులు సహించుట.

   (e) సమాధానము :—త్రిప్పిన మనస్సును, ఇంద్రియములును, వాసనావశమువలన, మళ్లించి శ్రవణాదులయందే నిల్పుట.

(*f*) శ్రద్ధ:—గురువుల యందు, వేదాంత వాక్యముల యందు, నీశ్వరుని యందుఁ గలవిశ్వాసము–అనఁగాఁ దనవిశ్వాసమునంతయు గురువేదాంత వాక్యేశ్వరుల యందే నిలుపుట.

4. ముముక్షుత్వము—సమస్త ప్రాణులును మోక్షము కావలెనని చెప్పుచున్నారు. అది మోక్షేచ్ఛ కానేరదు. గృహము దగ్ధమగుచుండఁగా నట్టి గృహంబు నందుఁ బ్రవేశించిన పురుషుండు పుత్త్రమిత్ర కళత్రాదు లేమైపోయిరో యని విచారపడినవాఁడై యగ్నిచేతఁ దప్తుఁడై–ఆపుత్ర మిత్రాదులను విడిచి శీతలంబునం బ్రవేశించినట్లు సంసారము నందు, ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, అధిదైవిక–తాపత్రయాదు లనెడి యగ్నిచేతఁ దప్తుఁడై, పురుషుఁడీ సంసార తాపంబు నెవరు పోఁగొట్టుదురో, సద్గురువు లెక్కడఁ గలరో దీనికి సాధనంబు లేమేమి కావలెనో యని తపించుకొనుచు నుండువాని చిత్తవృత్తికే మోక్షేచ్ఛ యనిపేరు. మఱియు మనస్సనెడి బెబ్బులియును, ఆశయను కృష్ణసర్పమును, కామాదులనెడి దొంగలును, అను వీని నిరాకరించుటకై పైనాలుగు సాధనంబులును గలవాఁడే యధికారి.

## (*b*) క్రీస్తుని శిష్యులకుండవలసిన లక్షణములు

వేదాంత విచారణమునకు ముందుఁబొందవలయునని వేదాంతులు చెప్పు సాధన చతుష్టయ సంపత్తి మోక్షము నొందుట కావశ్యకమని యేసుక్రీస్తును బోధించియుండెను. కావున నా సాధన చతుష్టయములోని ప్రత్యంశమునకును బోల్చఁదగు సత్యవేదములోని వాక్యములనిందు బొందుపరచి సమన్వయించెద.

1. "మీరేమి వినుచున్నారో జాగ్రత్తగాఁజూచుకొనుఁడి, మీరెట్టి కొలతతోఁ గొలుతురో యట్టి కొలతతోనే మీకుఁ గొలవఁ

బడును. మఱి యెక్కువగా మీకియ్యఁబడును." (మార్కు. IV. 24.) (ఇదియే నిత్యానిత్యవస్తు వివేకము.)

2. "తండ్రినైనను దల్లినైనను నాకంటె నెక్కువగాఁ బ్రేమించువాఁడు నాకుఁ బాత్రుఁడుగాఁడు; కొమారునైనను గొమార్తెనైనను నాకంటె నెక్కువగాఁ బ్రేమించువాఁడు నాకుఁ బాత్రుఁడుగాఁడు." (మత్తయి. X. 37.) (ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము).

3. (*a*) "నీవు ప్రార్థనఁ జేయునపుడు నీ గదిలోనికి వెళ్ళి తలుపు వేసి, రహస్యమందున్న నీ తండ్రికిఁ బ్రార్థనఁజేయుము; అప్పుడు రహస్యమందుఁ జూచు నీతండ్రి నీకుఁ బ్రతిఫలమిచ్చును." (మత్తయి. VI. 6.) (ఇది శమము.)

(*b*) "ఏమి తిందుమో యేమి త్రాగుదుమో యేమి ధరించుకొందుమో యని చింతింపకుఁడి." (మత్తయి. VI. 31.) (ఇది దమము.) "రేపటినిఁగూర్చి చింతింపకుఁడి; రేపటిదినము దాని సంగతులనుగూర్చి చింతించును; ఏ నాఁటి కీడు ఆ నాటికిఁజాలదా?" (మత్తయి. VI. 34.)

(*c*) "మీరు శత్రువులను బ్రేమించుఁడి. మిమ్మును హింసించు వారికొఱకుఁ బ్రార్థనఁజేయుఁడి." (మత్తయి. V. 44.) (ఇది ఉపరతి.)

(*d*) "దుష్టుని నెదిరింపక నిన్నుఁ గుడిచెంపమీఁదఁ గొట్టిన వానివైపునకు నెడమచెంపఁగూడఁ ద్రిప్పుము." (మత్తయి. V. 39.) (ఇది తితిక్ష.)

(*e*) "కాలము నెరవేరినది. దేవుని రాజ్యము సమీపించినది. మీరు పశ్చాత్తాపమునంది సువార్తనునమ్ముడి." (మత్తయి. 8. 10.) (ఇది శ్రద్ధ.)

(*f*) "సమాధాన పర్చువారు ధన్యులు. వారు దేవుని కుమారులనఁ బడుదురు." (మత్తయి. V. 9.) (ఇదియే సమాధానము.)

4. "మీరే పట్టణములోనైనను, గ్రామములోనైనను ప్రవేశించు నపుడందులో నెవఁడు యోగ్యుఁడో విచారణఁజేసి, యక్కడ నుండి వెళ్లువఱకు నతని యింటిలోనే బసఁజేయుఁడి. ఆ యింటిలోఁ బ్రవేశించుచు నింటివారికి శుభమని చెప్పుఁడి. ఆ యిల్లు యోగ్యమైనదైన మీ సమాధానము దాని మీదికి వచ్చును. అది యయోగ్యమైనదైన మీ సమాధానము మీకుఁ దిరిగివచ్చును. ఎవఁడైనను మిమ్మును జేర్చుకొనక మీ మాటలు వినకుండినయెడల మీ రాయిల్లైనను, ఆ పట్టణమైనను విడిచి పోవునప్పుడు మీ పాదధూళి దులిపివేయుఁడి." (మత్తయి. X. 11-14.) (ఇదియే ముముక్షుత్వము.)

క్రీస్తు వీ మాటలతోఁ దన శిష్యులకు నాతురతతోఁ గొరువారికిఁ దప్ప నాధ్యాత్మిక గూఢార్థములను దదితరులకు బోధింపవలదని ఖచితముగఁ జెప్పెను.

---

## 15. అధ్యాయము

### మాయ - సైతాను

జీవాత్మలు పరమాత్మలోని భాగము లేయైన నవిద్యనాఁ బరఁగు మహామాయచే మోహితులై స్వస్వరూపజ్ఞానమును మఱచి దారపుత్రాది దీషణ త్రయంబునం జిక్కి యుందురనియు, ఇంద్రియ నిగ్రహమును గావించి సగుణ బ్రహ్మమును సదా ధ్యానించుటచే నీ మాయ యను మహాంధకారమును బాఱఁజిమ్మి బ్రహ్మజ్ఞానమను వెలుఁగును బొందఁగల రనియు, నీ మాయపై విజయంబు నందిననేకాని మోక్షప్రాప్తి లేదనియు,

నీమాయ పెక్కు రూపంబుల నావరించి పటుత్వము గలదిగఁ గాన్పించినను, సృష్టికిఁ బూర్వము నుండియు స్థితిగలిగి యనాదియని పిలువఁబడు చుండినను, ప్రబోధ చంద్రోదయమగు సరికి నీమాయ హరించుననియు, నీమాయను హరింపఁజేసి బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకే శ్రీకృష్ణభగవానులు భక్తి, కర్మ, జ్ఞాన, యోగంబులను త్రివిధంబులగు మార్గంబులఁ గల్పించి బోధించెననియుఁ, బరబ్రహ్మము నందు భక్తి యీ మూఁడు మార్గంబులకుఁ బ్రధానమనియు, వేదాంతులు చెప్పెదరు.

క్రైస్తవ మతమునందీ మాయయను నవిద్యకుఁ దుల్యమగునదేదైనను గలదా యనియుఁ గలిగి యుండినచో దానినిఁ బరిమార్చుటకే యే మార్గంబుల నామతస్థాపకు లేర్పఱచికొని యుండిరో యనియు విచారింప వలసి యున్నది. బైబిలునం దెల్లెడలఁ జెప్పఁబడుచుండు సైతాను వలన గలిగెడి కార్యములకును వేదాంతుల మాయవలనఁ గలిగెడి కార్యములకును భేదమేమియుఁ గాన్పించదు. వీ రుభయులునుఁ (అనఁగా మాయయు, సైతానును) సృష్టికిఁ బూర్వము నుండియు ననాదిగా నుండిరి. ఏసు క్రీస్తువును ప్రవక్తలును గూడ నీ సైతానుని జయించిననే కాని మోక్షప్రాప్తి గలగనేరదని ఘంటాపథంబుగఁ జెప్పియున్నారు. వేదాంతులు చెప్పునదియు నదియే. క్రీస్తు వీ యంశమును బోధించుటయే కాక తాను స్వయముగ నీ సైతానుచే ననేక విధముల శోధింపఁబడియు దాని మాయలకు లోఁబడక జయించియే పరిపూర్ణుఁ డాయెను. పైఁజెప్పిన సంగతుల నన్నిటిని విమర్శించి చూడ భగవద్గీతలోఁ జెప్పఁబడిన మాయయుఁ, క్రొత్త నిబంధనములోఁ జెప్పఁబడిన సైతానును నొక్కటియే యని తోపక మానదు.

"టి. యి. స్లేటరను పాశ్చాత్య పండితుఁడు వ్రాసిన యీ క్రింది యంశమును జదివినచోఁ బై యభిప్రాయము మఱింత స్థిరపడఁగలదు." పాప మిప్పటికి నిజమైనదే యైనను దుదకు స్థిరమైనది కానేరదు. పాపము మనచే జయింపఁబడఁ దగినదై యున్నది. కావుననే మానవులకు మోక్షా

పేక్షకలిగి యుండుట తటస్థించెను. దానితోఁ బెనుగులాడుట చావు చం
పులతోఁ గూడినది. ఈ యుద్ధము నందు విజయము నందిననే శాశ్వత
జీవము లభించును. ఈ పోరాటముననే మానవుని యాత్మ దృఢపడఁగలదు.
ఈ పాపమే, జీవులను మాయఁజేసి పెడత్రోవలఁ ద్రొక్కించును. దాని
కాటున రక్తము నంతను విష పూరితముగఁజేయును. మేధాశక్తిని నశింపఁ
జేయును. ఆ కోరరాని కోరికలం గల్పించి యాకాశ విమానముల నెక్కిం
చును. పాపము వలనఁ గలిగెడి సౌఖ్యములు మిధ్యా స్వరూపములు. దాని
వాగ్దానము లసత్యములు దీని ప్రోత్సాహము వలన మనము చేసిన కార్య
ముల ఫలితముల ననుభవింప వలసి వచ్చినప్పుడు గాని దాని దౌష్ట్యము
వెల్లడికాదు. కావుననే బైబిలులో నిట్లుదాహ రింపఁబడి యున్నది.

“ఓ,పడుచువాఁడా నీ యౌవనమందు సంతోషపడుము; నీయౌవ
నపు దినములయందు నీహృదయము నిన్ను సంతుష్టుఁజేయనిమ్ము; నీమన
స్సుయొక్క త్రోవలయందును నీ కన్నులయొక్క దృష్టియందును నీవు
నడువుము; అయితే వీని నన్నిటి నిమిత్తము బరాత్పరుఁడునిన్ను న్యాయపు
తీర్పులోనికిఁ దెచ్చునని తెలిసి కొమ్ము.” (ప్రసంగి. XI. 9.)

ఈ మాయయొక్క ప్రేరేపణవలనఁ గలిగిన మధుపాన ఫలితమును
గూర్చి సత్యవేదమిట్లు పలుకుచున్నది.

“ద్రాక్షరసము మిక్కిలి యెఱ్ఱఁబడి, గిన్నెలోఁ దళుకులాడుచుండి
మెల్లఁగాఁ దిరుగుచుండునపుడు దానివైపుఁజూడవలను. పిమ్మట నది సర్పము
వలెఁ గఱచి కట్లపామువలెఁ బొడుచును.” (సామెతలు. XXIII. 31-32.)

ఇట్టి సౌఖ్యము లెట్టిమాయా స్వరూపములోచూడుఁడు.

“ఒకనికి యధార్థమైనదని కనఁబడు నొకమార్గమున్నది. దాని అం
తము మరణమార్గములు నవ్వులోనయినను హృదయము దుఃఖపడవచ్చును.
తుదను దాని సంతోషమువ్యసనము.” (సామెతలు. XIV. 12.)

ఈ మాయను జూచి మోసపోకుఁడి. దీనినిగూర్చి పౌలుఁడను మహార్షి యిట్లు చెప్పుచున్నాఁడు.

"ఏలాగనఁగాఁ దన శరీరేచ్ఛలనుబట్టి విత్తువాఁడు తన శరీరము నుండి, క్షయమను పంటఁగోయును, ఆత్మనుబట్టి విత్తువాఁడు ఆత్మనుండి నిత్యజీవమను పంటను గోయును." (గలతి. VI. 8.)

ఈ పైవాక్యమును జదివిచూచిన వేదాంతుల మాయయుఁ గ్రైస్తవుల సైతానును, అవి నా భావము నందుటయేకాక మఱియొక వేదాంత రహస్యముగూఁడ నీ క్రైస్తవమతబోధతో నేకీభవించును. వేదాంతులు. "యద్దృశ్యం తన్నశ్యం" అనియు నింద్రియముల కగోచరమగు బ్రహ్మమే సత్యమనియుఁ జెప్పెదరు. ఈ సత్యమును, సత్యవేదము గూడ బోధించు చున్నదని యీ దిగువ వాక్యమువలన గ్రహింపనగును.

"క్షణమాత్ర ముండుమా. చులకన శ్రమ మాకొఱకు నంతకంత కెక్కువగా నిత్యమైన మహిమభారమును గలుగఁ జేయుచున్నది. దృశ్యమైనవి యనిత్యములు. అదృశ్యమైనవి నిత్యములు." (2 కొరింథి. IV. 18.)

ఇదియే-క్రొత్త నిబంధన రూపమున నేను క్రీస్తుబోధించినట్టియు భగవద్గీతా మూలమున శ్రీకృష్ణుఁడు బోధించినట్టియు జ్ఞానమార్గము.

---

## 16. అధ్యాయము

### యోగము

శ్రీకృష్ణభగవానులు. ఈ యోగమార్గము నర్జునునకు బోధించిన తర్వాత నీవీ విధమున బాహ్యాంతరేంద్రియ నిగ్రహమునఁ బరబ్రహ్మపై లక్ష్యము నిలుపఁజాలవేని నింద్రియ నిగ్రహార్థమై యోగవిద్య నభ్యసింప వలసియుండునని చెప్పెను. హిందువులలో బహు వ్యాప్తముగా నుండు నీ యోగాభ్యాసమునుఁ గూర్చి క్రీస్తు వుపదేశించెనా లేదాయని విమర్శింప

వలసియున్నది. పరమాత్మునిఁద దేక నిష్ఠతో ధ్యానించుటకు నింద్రియ వ్యాపారముల బాహ్యప్రపంచమునుండి యరికట్టుట యవశ్యకముగావున నందులకు శ్రీకృష్ణులవా రుపదేశించినట్టియుఁ బతంజలి విపులముగా శాస్త్రమును వ్రాసినట్టియు నీయోగశాస్త్ర విధులచ్చటచ్చటఁ గ్రీస్తునిబోధయందుఁ గాన్పింపఁగలవు. హిందువు లీ యోగ శాస్త్రము స్వభావాతీతమైన దూర దృష్టి,దూరశ్రవణాది యష్టసిద్ధులనంబరగుమహాశక్తులకాటపట్టయియుండుట స్వార్థ పరిత్యాగము సేయని స్వకుక్షింభరుల పాలఁబడె నేనీలోకోద్ధరణంబునకు మారుగ లోకోపకారంబగు ననుభీతిచే నీయోగవిద్యను బహు రహస్యంబుగనుంచి యర్హులగు ముముక్షువులకే బోధించుచుండెడి వారు. ఈ విషయమునఁ గ్రీస్తువును దీనిని బహుగుప్తముగనుంచెను. వాని ప్రియ శిష్యులగు యోహాను, పేతురు, పౌలుఁడు మొదలగువారికీ విద్య నుప దేశించినటులఁ బూర్వోత్తర సందర్భముల ననుసరించి గ్రహింపనగును. ఎట్లన వీరలకు దూరదృష్టి దూర శ్రవణాదులగు యోగసిద్ధులుగలవు. ఈ యోగసిద్ధులనుబట్టి యోగమాహాత్మ్యము. దేశకాలభేదముల ననుసరించి ఈ యోగ విద్య నభ్యసించు మార్గములు భేదించినను భేదింపవచ్చును, గాని ఫలిత మొక్కటియే. బైబిలులో నెచ్చటఁజూచినను యోగశక్తులుగల వారలచరిత్రము లనేకములందుఁ గాన్పించుచుండుటచే నా దేశమునందే యవతరించిన క్రీస్తునకును వానిశిష్యులగు నపోస్తలులకును నీయోగవిద్య కరతలామలకమైయుండెనని స్వాభావికముగ నూహింపవచ్చును. బైబిలు నందు యోగవిద్య నభ్యసించు మార్గములని ఎచ్చట నొక్కచోగుదిగూర్చి చెప్పఁబడియుండలేదుగాని యోగవిద్య యననేమియో దాని స్వభావ స్వరూపముల నెఱిఁగిన వార లీసత్యవేదమును బరిశీలనోద్యమముతోఁబఠించి దాని యందచ్చటచ్చటఁగల చెణుకుల, నేకముఖమున గుది గూర్చి చూచినచో యోగవిద్యయందుదాహరింపఁ బడినదని యొప్పుకొనకతీరదు. ప్రప్రథమమున హిందూశాస్త్రాలను సరణముగ యోగవిద్యయన నేమో తూష్ణింభావమున నించుక నిందు సూచించి పిదప దీని సూచనలు క్రీస్తుని

బోధలయందుఁగలవని చెప్పుటకుఁ దగువాక్యముల బైబిలునుండి చూపిం చెదను. హైందవయోగు లీయోగవిద్యను బొందుట కర్హతగల శిష్యుఁడు దొరకునంత వఱకును గుప్తముగ నుంచెడివారు.

## (A) హిందువుల యోగశాస్త్రము

## యోగమునందీ క్రింద వివరించిన యంతరములు గలవు

1. ప్రాణాయామము—

ఇంద్రియ వ్యాపారముల బహిర్ముఖములఁ గానియ్యక నిరోధిం చి గమ్యస్థానమగు పరబ్రహ్మమునందుఁ జిత్తము నేకాగ్రముగా నిలుపుటయే ప్రాణాయామ మనఁబడును. యోగులు వాయు నిరోధ మునుజేసి దానిని సాధించెదరు.

2. ప్రత్యాహారము—

బాహ్యేంద్రియ వ్యాపారనిరోధానంతరము నిశ్చలమగు చిత్త ము నంతర్ముఖముగ మరల్చుటయే ప్రత్యాహారమనఁబడును.

3. ధారణము—

పరబ్రహ్మను సంధాన చికీర్షువులై చిత్తము నాకార్యమునకై ప్రవర్తింపఁజేయుట. ఈ ధారణ మలవడినతోడనే యోగసిద్ధులు వానికి హస్తగతములగును. వానిని వైరాగ్య దృష్టితోఁ ద్యజింపక స్వార్థ పరత్వమున నుపయోగించిన లోకమున నుపకారము మెండు గా జరుగఁగలదు. ఈ ప్రాణాయామాదు లభ్యసించుటవలనఁ బ్రా ణవాయువును కదిల్చి మూలాధార చక్రముగుండ సూక్ష్మమగు సుషుమ్నా నాడిం బ్రవేశింపఁజేయనగును.

4. ధ్యానము—

పైనుదాహరించిన మార్గత్రితయము నవలంబించినతోడనే ధ్యా నమలవడును. ఈ మెట్టు నెక్కువఱకుఁ దనయాత్మకును లోకము

లోని యితర జీవాత్మలకును భేదమేమియులేదని స్పష్టపడఁగలదు. ఈ జ్ఞానమే యోగశక్తులను దుర్వినియోగముఁ జేయకుండఁ గాపాడు నది. తనకు నితరులకును భేదములేదని తెలిసినప్పుడా శక్తుల స్వార్థ పరాయణత నుపయోగించుకొను తలంపు నశించును.

5. సమాధి—

పైఁజెప్పఁబడిన ధ్యానము మూలమున యోగశక్తుల యందాశ విడచినచో సమాధికుదురును. శక్తులఁద్యజించి ప్రాణవాయువును సుషుమ్నా నాడి వెంట నూర్ధ్వముఖముగా సహస్రారమునకెక్కించిన యెడల నటఁబరమాత్మ తత్త్వమునఁజేరి వర్ణ నాతీతమగు నిర్మలమైన బ్రహ్మానందమును బడయఁగలఁడు.

## (B) బైబిలునందలి యోగశాస్త్రము

హిందువుల యోగమార్గమెట్టిదియో పైపైని సూక్ష్మముగా వివరించితిని. క్రీస్తువు దీనినిఁగూడ బోధించిన జాడలేమైన బైబిలునందుఁ గలవా యని విచారింప వలసియున్నది.

(మత్తయి. VII. 6. 20.) వాక్యముల నీసూచనలు గలవు.

1. "పరిశుద్ధమైనది కుక్కలకుఁబెట్టకుఁడి, మీముత్యములను బందుల యెదుట వేయకుఁడి, వేసినయెడల నవియొకవేళ వానినిఁగాళ్లతో ద్రొక్కి మీమీఁదఁబడి మిమ్మును జీల్చివేయును"

పైవాక్యమున నీ దిగువఁ జేయఁబోవుబోధను బహు జాగ్రత్తగాఁ గాపాడుఁడనియు దుష్టుల కీబోధయలవడెనేని తత్ఫలితములగు శక్తులవలన మిమ్ములనుగూడ బాధింపఁగలరని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు.

ఈ క్రీస్తుని హెచ్చరికకును యోగుల హెచ్చరికకును భేదమేమియునులేదు. క్రీస్తుతాఁజేయు బోధలన్నియు గూఢార్థ గర్భితములుగాఁ బామర జనాహ్లాదంబుగను పండిత జనగేయంబుగనుండు నటులఁజెప్పుటంబట్టి

హిందువుల శాస్త్రములయందు వ్రాయఁబడి నంతవిపులముగాఁ గాన్పింపవు. అంతరార్థము లూహ్యములు. తానటుల గూఢముగా బోధించెదనని క్రీస్తు చెప్పియుండినటుల నీ పీఠిక మొదటిభాగమున రుజువుఁజేసి యుంటిమి. గావునఁ బలువుర చేతంబడిన ప్రమాదమున కాకరంబగు నీయోగవిద్య నతి గోప్యంబుగ బోధించెను.

"చెవులుగలవారు వినఁదగినదియు, నేత్రములుగల వారు చూడఁదగినదియు నైయున్నది."

2. "అడుగుఁడి మీకీయఁబడు." నని చెప్పెను. దీనియర్థము దేవు నడుగవలసినదియేకదా. దేవునడుగుటయెట్లు? 'చిత్తము శివుని మీఁదను భక్తి చెప్పులమీఁదనను' లోకోక్తిననుసరించినఁ బ్రయోజనములేదు. త్రికరణశుద్ధిగా నింద్రియ వ్యాపార నిగ్రహమును గావించి మానసము నాభగవంతుని యందు లయింపఁజేసియే వాని నడుగవలయును. అట్లడిగిన మీకీయఁబడునని క్రీస్తు చెప్పియున్నాఁడు. ఈ యడుగుటపై విధముగానే చేయవలయునని సూచించుటకు పౌలుఁడే క్రిందిరీతినిఁ జెప్పియున్నాఁడు.

"ఆత్మతోఁ బ్రార్థనచేయుదును, మనస్సుతోను ప్రార్థనచేయుదును. (కొరింథి XIV. 15.)

కావునఁ గ్రీస్తు ప్రాణాయామమును "అడుగుఁడి" యను పద ప్రయోగమువలన గూఢముగా నుపదేశించెను. అటులనే కాక పెదవులతో నడుగవలసినదని చెప్పెనని తలంచిన నావాక్యము సార్థకముగానేరదు.

3. పైరీతినిఁ బ్రాణాయామమును సూచించిన పిదప "వెదకుఁడిమీకు దొరకును" అని చెప్పియున్నాఁడు. కావున మనుజు డింద్రియ వ్యాపారముల నిగ్రహించిన పిదప బహిర్ముఖములను గానీయక తనలోనికి మళ్లించి పరిశోధింపవలసినదని ప్రత్యాహార ప్రక్రియను సూచించెను. అంతర్ముఖముఁజేసికొన వలసినదని వానియభిప్రాయ

మని యెట్లు గ్రహింపనగునని సంశయింపవలదు. "దేవుని రాజ్యము నీలోనే కలదు. బయట వెదకిన దొరక నేరదని" స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. కావునఁ బ్రత్యాహారమునే దీనివలన బోధించును.

4. ఇట్లు వెదకిన తరువాత "తట్టుఁడిమీకుఁ దలుపుదీయఁబడు" నని చెప్పెను. "తట్టుట" "తలుపు తెఱచుట" యను పద ప్రయోగములను యోగశాస్త్ర విధులను గుఱ్ఱె ఱెఁగిన వారు చదివిన తోడనే వారికి "ధారణ" జ్ఞప్తికిరాక మానదు. ఏలయనఁ బ్రాణాయామ ప్రత్యాహారముల నభ్యసించిన తోడనే యభ్యసించిన వానియాత్మ లేపఁబడి మూలాధారమును తలుపును తెఱచుకొని సూక్ష్మ మార్గమగు సుషుమ్నా నాడియందుఁ బ్రవేశించునని వారలు పూర్తిగా నెఱిఁగినదియే. కావున "తట్టుఁడి తెరువఁబడు" ననఁగాఁ బైరెండు క్రియలను బ్రాణాయామ ప్రత్యాహారముల నభ్యసించిన తోడనే జీవాత్మ మూలాధారమను తలుపునొద్దకు వచ్చి దానినిఁ దాకుననియుఁ దాకినతోడనే యాకమలము వికసించి మార్గము నిచ్చుననియు గ్రహింపఁ దగినది. ఇదియే క్రీస్తుని తాత్పర్యము గానిచో "తట్టుడి తెఱవఁబడుననను" పదము కేవల నిరర్థకమని యనవలసి వచ్చును. పరమ యోగియగు క్రీస్తునట్లనఁజనదు.

5. (8—11) వాక్యములలో పైమూఁడు వాక్యములను మఱియొకసారి త్రిప్పి చెప్పెను.

"మనుష్యులు మీకేమి చేయవలెనని మీరు కోరుదురో యాలాగు ననే మీరును వారికిఁ జేయుఁడి. ఇది ధర్మశాస్త్రమును బ్రవక్తల యుపదేశమునై యున్నది." (మత్తయి. VII. 12.)

ఈ వాక్యము వలన యోగ విద్యాభ్యాసి పై నుదాహరించిన మూఁడు మెట్టుల నెక్కిన తోడనే "ఆత్మవత్సర్వ భూతాని, యః పశ్యతిసపశ్యతి"

యను వాక్యమును మరువక యాచరణమందుంచుకొన వలసినదని చెప్పు చున్నాఁడు. ఇటుల యోగశాస్త్రమును బోధించు సమయమునఁ బ్రాణాయామ ప్రత్యాహార ధారణములను జెప్పి పైమెట్టులఁ జెప్పక ముందీ వాక్యముల నేలచెప్పెనని యందురేమో, కారణము లేకపోలేదు. ధారణము లభించిన తోడనే యష్టసిద్ధులు లభింపఁగలవు. పైవాక్యమును మననముఁజేసి తనకు నితర జీవాత్మలకును భేదము లేదని స్థిరముగా నిర్ధారణము చేసికొననిచో నీయోగశక్తులఁ జూచి మోసపోయి స్వార్థపరాయణుండై వీనిని దుర్వినియోగ పరచిన తన కాత్మ వినాశనమే కాక లోకమునకు నుపహాపకారమగును. ఇటుల యోగశక్తుల నుపయోగించుకొనిన పైమెట్ల నెక్కనేరఁడు. కాన నీ తరుణమునందీ హెచ్చరిక చేయుట బహుయుక్తి యుక్తముగాను సార్థకముగాను నున్నది.

6. ఇఱుకు ద్వారమునఁ బ్రవేశించుఁడి; నాశనమునకుఁ బోవుద్వారము వెడల్పును ఆదారి విశాలమైయున్నది............. జీవమునకుఁ బోవు ద్వారము ఇఱుకును ఆదారి సంకుచితమునై యున్నది; దానిఁ గనుఁగొనువారు కొందఱే ఇచ్చటను యోగశాస్త్రిను సరణముగనే బోధించెను. నాశనమున కీడ్చునదువైన మార్గమను నవి యోగశక్తుల నుపయోగించు కొనుటయే. సూక్ష్మమైన మార్గము సుషుమ్నా నాడియే. ఆసూక్ష్మమైన మార్గమునఁ బోయిన సహస్రారమందుఁగల నిత్య జీవమను బరబ్రహ్మమును జేసి సుఖింతుమని చెప్పెను. ఇదియే సమాధి. ఇంతకంటె యోగమార్గమును గూర్చి చేయఁదగిన బోధ యేమి కలదు? చెప్పఁదగిన దంతయు సంపూర్తిగాఁ జెప్పెను. ఇది మత్తయినుండి యొకవాక్యము, లూకానుండి యొకవాక్యమున బోగుచేసి సమన్వయించినదికాదు. ఒక్క స్థలమునందీ బోధనంతయుఁ జెప్పియున్నాఁడు. ఆవాక్యములు యోగశాస్త్రము నుద్దేశించిచెప్ప లేదన వీలులేదు. ఏలయన యోగశాస్త్రము నందు జెప్పఁబడిన కర్తవ్య కార్యముల మార్గమునుగూడ

భేదింపక సక్రమముగాఁ జెప్పెను. యెట్లన ప్రాణాయామప్రత్యాహారధారణ ధ్యాన సమాధులను క్రమముతప్పక బోధించెను. కావున క్రీస్తుయోగ శాస్త్రమును బోధించెనని నొక్కి చెప్పుచున్నాము. యోగసిద్ధి పొందినవారల కష్టసిద్ధులు కలుగును. అవి యేవియన. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, వశిత్వము, ఈశిత్వము దుర్మార్గుల కివిసిద్ధించిన లోకమును మాడ్చఁగలరు. కావుననే యోగాభ్యాసము నంతగోప్యముగా నుభయ మతములును దాచినవి.

పోల్పదగినంత దనుక నుభయ మతముల యందును గల యోగమార్గముల నిందుఁ బొందుపరచితిమి. ఇవి యెంత దనుక సమంజసముగ నుండఁగలవో చదువరులే నిష్కల్మష బుద్ధితో విచారించి నిశ్చయించుకొని యెదరుగాక.

---

## 17. అధ్యాయము

### దూరదృష్టి దూరశ్రవణాది యోగశక్తులు

ఆత్మతత్త్వ విచారణసంఘము. (Society for psychical research) వారు ప్రచురించిన పర్యవసానములవలన దూరదృష్టి దూరశ్రవణములును దివ్యదృష్టి మొదలగు స్వభావాతీతములైన శక్తులను మానవులు యత్నమువలన స్వాధీనపరచుకొనఁ గలరని గ్రహించుచున్నారము. అనుమానమున కెడమీయని యభ్యాస ప్రాప్తములయిన నిదర్శనములను ఘంటాపథముగ లోకమునకు వెల్లడిచేయుచున్నారు. వీనినే హిందూదేశమునందలి మహర్షులు తపోబలమువలన యోగవిద్య నభ్యసించి పొందిన యష్టసిద్ధులని చెప్పెదరు. యోగాభ్యాసమువలన నేరికైనను లభింపఁదగిన వేయనుట యోగశాస్త్రసమ్మతము.

వీనింగూర్చి సత్యవేద మేమి నుడువఁగలదో విమర్శించిన సత్యము నారయుట కాధారంబగుటయేగాక పరస్పరమైత్రి వలన నాత్మతత్త్వ విచారణసంఘమునకును సత్యవేదమునకును గూడ దృఢత్వంబొదవు. మత్త యిసువార్తయొక్క టీకలో స్వభావశాస్త్రమును సత్యవేదాంతర్గతాంశంబులతోఁ బోల్చి వాని సత్యమును వెల్లడించియుంటిమి. ప్రకృతమున నాత్మజ్ఞాన శాస్త్రముతో నీ సత్యవేదముం బోల్చిన సమంజసమగు.

సత్యవేదమునందు దూరదృష్టి, దూరశ్రవణము, దేవదూతలు మానవులకు దర్శనమొసంగుట, మృతినొందిన వారి యాత్మలు వారి కారణ శరీరములతో నరులకు గానుపించుటలోను గాఁగల విశేషము లచ్చటచ్చటఁ గలవు. అట్టివాని నిచ్చటఁ బొందుపరచుటకు ముందొక యంశము గుఱించఁ బ్రార్థించెదను.

పలువిధములగు సంగతుల బోధించునవియై గ్రంథబాహుళ్యము గల హిందూమత ధర్మ శాస్త్రంబుల వాక్యార్థమున నభిప్రాయ భేదంబులు గలుగు తరి నీ క్రింది పద్ధతి నవలంబించెదరు. శ్రుతి స్మృతిపురాణేతిహాసంబులని శాస్త్రంబులు చతుర్విధంబులు. అందు శ్రుతిప్రధానము. రెండవది స్మృతి. ఈ రెండిటిలో నభిప్రాయ భేదముగలిగిన శ్రుతియే యవలంబనీయము. మూఁడవగుణము పురాణములు. వీనికంటెఁ బైరెండును ఘనతరములు. ఇతి హాసములన్నిటికంటెఁ దక్కువవి. పూర్వోక్త నిమ్నోన్నత తరగతుల ననుసరించి సిద్ధాంతపరచెదరు.

అటులన ప్రాఁత నిబంధనములోని గ్రంథములు పురాతనములైనను జ్ఞానాధిక్యము లేక దేశము కడుదుస్థితియందుండు కాలమున వ్రాయఁబడినవగుటచే సంపూర్ణజ్ఞానమును వెల్లడింపవలను పడకతత్కాల ప్రజలకనుకూలమగునంత దనుక నే వెల్లడించఁబడినవై యున్నవి. క్రీస్తు ప్రజలకు సంపూర్ణ జ్ఞానము నిచ్చుట కనువగు కాలమునందవతరించి వచించినసంపూర్ణ సత్యవాక్యములతో నిండినది నూతన నిబంధనము. కావున నీ రెండిటి

యందభిప్రాయ భేదములు గాన్పించు నెడ నూతన నిబంధన స్థానములనే ప్రామాణికములుగా గ్రహింపనగును. ప్రాఁత నిబంధనములోని గ్రంథముల విషయమునసైనను వాని కర్తృతారత మ్యానుగుణ్యంబుగ యోజించుచుండ వలయును ఎట్లనిన.

"మృగముకంటె మనుష్యునికిఁ బ్రాధాన్యము లేదు." (ప్రసంగి. III. 19-22.)

"నేను మరణచ్ఛాయలో వెళ్లినను, కీడునకు భయపడను; నీవు నాకుఁ దోడైయుందువు." (కీర్తనలు. XXIII. 4.)

పై రెండు వాక్యములను బోల్చిచూడుఁడు. ప్రథమ వాక్యకర్త యగు సొలొమోనుఁడు మానవులం బశుప్రాయులుగా భావించెను. ద్వితీయ వాక్యకర్తయగు దావీదు ప్రథమునికంటె నెక్కుడు జ్ఞానసంపత్తి గలవాఁడు. కావున నట్లు వ్రాసెం గావున ప్రథమ వాక్యమనాదరణీయము. ద్వితీయ వాక్యమాదరణ పాత్రముగా గ్రహింపనగును. మానవుని మరణా నంతరావస్థనుగూర్చిన సత్యమును వెల్లడించుటకుఁ గ్రీస్తే ప్రథముఁడు. వానికిఁ బూర్వపు ప్రవక్తలకు భగవంతుఁడీ జ్ఞానమును గలుగఁజేసియుండ లేదు. అవతార పురుషుఁడగు "ఏసు క్రీస్తు మరణము నిరర్థకముఁజేసి జీవమును అక్షయతను సువార్తవలన వెలుగులోనికిఁ దెచ్చెను." (2. తిమిథేయు. I. 10.)

కావున మరణానంతరావస్థా జ్ఞానార్థమై ప్రాఁతనిబంధనమందు వెదకుట యను పొరపాటును మన మాచరింపఁజనదు. క్రీస్తుని వాక్యములుగల నూతన నిబంధనముతోఁ బోల్చుట కనర్హమగు ప్రాఁతనిబంధన లోని వాక్యములతో సమన్వయించు తలంపున నూతన నిబంధనవాక్యము లకుఁ బెడ యర్థములంజెప్పి యర్థభేదము గల్పింపఁ బ్రయత్నించుట యనర్థము.

1. "మఱియు నాకాశ వస్తురూపములు కలవు. భూవస్తు రూపములు కలవు. ప్రకృతి సంబంధ శరీరముగా విత్తఁబడి, ఆత్మసంబంధ

శరీరముగా లేపఁబడును. ప్రకృతి సంబంధ శరీరమున్నది గనుక ఆత్మసంబంధ శరీరముకూడ నున్నది.'' (2 కొరింధీయులు. XV. 40-45.)

**2.** ''అందులకు నతఁడే రూపములోనున్నాఁడని దాని నడిగినప్పుడది ముసలివాఁడు దుప్పటితోఁ గప్పఁబడి మీఁదికి వచ్చుచున్నాఁడని చెప్పినందున సౌలు అతఁడు సమూయేలని గ్రహించెను.'' (1 సమూయేలు. XXVIII. 14.)

పై వాక్యమును సౌలుని ప్రశ్నమునకు స్త్రీ చెప్పిన జవాబు సమూయేలిట్లు సౌలునకును, ఆ స్త్రీకిని కనుపించి పరామర్శించిన కాలమునకు నాలుగు వత్సరములకుముందే భూలోకమున మరణించెను. వాని స్థూల శరీర మిదివఱకే పాతిపెట్టఁబడినది గావున నిప్పుడు దర్శనమిచ్చినది సూక్ష్మశరీరమని గ్రహింపనగును. మొదటి వాక్యములోని పౌలుని పలుకులవలనను స్థూలశరీరమును సూక్ష్మశరీరమును గలవని గోచరించుచున్నది.

3. ''దేవుని వాక్యము నిమిత్తమును, తామిచ్చిన సాక్ష్యము నిమిత్తమును వధింపఁబడినవారి ఆత్మలను బలిపీఠముక్రిందఁజూచితిని. వారు నాధా, సత్యస్వరూపా పరిశుద్ధుఁడా, యెందాక తీర్పుచేయకయు, మారక్తము నిమిత్తముభూనివాసులకుఁ బ్రతిదండన చేయకనుందువని బిగ్గరగాఁ గేకలువేసిరి. తెల్లని వస్త్రము వారిలోఁ బ్రతివానికియ్యఁబడెను.'' (ప్రకటన. VI. 9-11.)

ఇయ్యది యోహానుఁడు చూచిన యంశమైయున్నది. ఈ యాత్మలు వాగింద్రియంబులు గలిగి కేకలువేయును త్వగింద్రియముగలిగి వస్త్రధారణార్హతగలవగుటను సూక్ష్మ శరీరములుగలవై యున్నవని చెప్పుటకు సంశయింపఁబనిలేదు. ఏలోకమునందైనను శరీరధారణములేకయే నివసించుట యసంభవముగనుకను పూర్వోదాహృత వాక్యత్రయము సూక్ష్మ శరీరధారులంగూర్చి ముచ్చటింపఁబడుటను, సూక్ష్మ శరీరముతో మాధ్య

మికలోకమునందు నివసించెదరని గోచరించుటయేగాక పేతురుఁడాలోక మునకు భూలోకమున నివసించుకాలమునందే వెళ్లి తిరిగివచ్చుటచేత జీవులు స్థూల శరీరధారులై యుండుకాలమునఁ నే (అనఁగా భూలోకమున జీవించి యుండు కాలమునందే) స్థూలశరీరాంతర్గతముగ సూక్ష్మశరీరమును ధరించి యుండిరని స్ఫురించుచున్నది.

బలామను నీతఁడు తనయంతశ్చక్షువు దెరువఁబడు దనుక దేవదూతం గాంచ నేరకపోయెను.

ప్రవక్తలు, దూరదర్శులు, మూలపురుషులు మొదలగు వారలు బహి రింద్రియ వ్యాపారా తీతములగు సంగతులం గ్రహించువారలుగా వ్రాయఁ బడియున్నది. ఏతన్మూలంబున వారలు సూక్ష్మశరీరములను సూక్ష్మేంద్రి యంబులనుగలవారని చెప్పకయె చెప్పుచున్నది.

యోహాను, సౌలు, బాలుఁడగు సమూయేలును, స్థూలకర్ణేంద్రియా తీతంబులగు శబ్దంబుల నాలించినటులను, జకరీయుఁడు, పౌలు, యాకోబు, దానియేలు, అబ్రహాము మొదలగువారలు స్థూలత్వగింద్రియా తీతంబులగు దేవదూతలం గాంచినటులను బైబిలు ఉద్ఘోషించుచున్నది. లోకాతీతంబు లగు శబ్దంబుల నాలించుకర్ణంబులును లోకాతీతంబులగు సంగతులందిలకిం చునయనంబులును ప్రతిమానవునికిని స్థూలశరీరాంతర్యామియగు సూక్ష్మ శరీరసంబంధమైన యింద్రియములై యున్నవి. మాతృగర్భస్థ శిశువుయొక్క స్థూలేంద్రియంబులే కరణిభూపతనంబు దనుకగ మరుగుపడియుండునో య ట్లె సూక్ష్మ శరీరావయవేంద్రియంబులును స్థూలశరీరాంతర్గతంబులై యుం డునందనుక ప్రచ్ఛన్నంబుగ వ్యాపారాంతర రహితంబుగనుండి స్థూలశరీర మును విసర్జించినతోడనే (మరణించినతోడనే) నియమిత వ్యాపారముల యందు ప్రమత్తతతో సంచరింపఁగలవు. భగవదనుగ్రహంబువలనఁ గొందఱ త్రీలోకంబున జీవించియుండఁగనే సూక్ష్మేంద్రియంబుల నుపయోగించుశక్తి వడయఁగలరు. అట్టి శక్తులనే దూరదృష్టి దూరశ్రవణము మొదలుగాఁగల యష్టసిద్ధులను నామంబలవడెదరు.

బైబిలు నందిట్టి శక్తుల నుపయోగించిన సందర్భంబు లనేకంబులు గలవు. అందుఁ గొన్నిటి నిందుఁ బొందుపరచెద. దానంజదువరులకు సుబోధకంబగు.

1. "అప్పుడు యెహోవాబలాము యొక్క నేత్రములను దెరచులాగున చేసినందున, కత్తిచేతఁ బట్టుకొని మార్గమందు నిలచియున్న యెహోవాయొక్క దూతయతని కగపడెను." (సంఖ్యలు, XXII. 31.)
2. "యెహోవా ఆపడుచు వానియొక్క కన్నులను దెరవచేసినందున వాఁడు ఎలీషాచుట్టును నగ్ని గుఱ్ఱములచేతను రథములచేతను బర్వతము నిండియుండుటను చూచెను." (2 రాజులు. VI. 17.)
3. "రాజైన ఉజ్జీయా మరణముఁ బొందిన సంవత్సరమందు నేను యెహోవా మహోన్నతమైన గద్దెమీద నాసీనుఁడై యుండుటం గన్నాను." (యెషయా. VI. 1.) అతఁ డీ భూలోకము నందు జీవించి యుండఁగనే యీయనుభవము గలిగెను.
4. యెహోయాఖీను చెఱలోనున్న యయిదవ సంవత్సరములో నయిదవ నెలలో, ననఁగా ముప్పదియవ సంవత్సరములో నాలుగవ నెలలో నైదవదినమున నేను కెబారునది దగ్గరఁ జెఱలోనున్న వారిలో నుండఁగా నాకాశము తెరచి యున్నందున దైవదర్శనములు నాకుఁ బ్రత్యక్షయాయెను." (యెహెజ్కేలు. I. 1.)
5. "ఆకాశము తెరవఁ బడుటయు, మనుష్యకుమారుఁడు దేవుని కుడి పార్శ్వమందు నిలచి యుండుటయుఁ జూచుచున్నానని" స్తెఫను చెప్పెను. (కార్యములు. VIII. 56.)
6. యెలీషా యను దీర్ఘదర్శి తన భృత్యుఁడగు ఘూజీయనువాఁడు తన విరోధియగు నామానను వానియొద్ద బహుమతి నంగీకరించెనని దూరదృష్టి వలన గ్రహించి వానితో "ఆమనుష్యుడు తన రథముడిగి,

నిన్నెదుర్కొనుటకుఁ దిరిగి వచ్చినప్పుడు నాహృదయము నీతోఁ గూడ రాలేదా" యని యడిగెను. (2. రాజులు. V. 26.)

7. పిలిప్పు సేవనియేలను వానినిఁ దనయొద్దకుఁ గొనిరాక పూర్వమే యేసు దూరదృష్టి వలన వానిని వానింగాని, తనయొద్ది కరుదెంచి నప్పుడు "పిలిప్పు నిన్నుఁ బిలువకమునుపే నీవాయంజూరపు చెట్టు క్రింద నున్నప్పుడు నిన్ను జూచితినని యతనితోఁ జెప్పెను." (యోహాను. I. 48.)

8. "నాతోఁగూడ నున్నవారా వెలుగుఁ జూచిరి కాని నాతోమాట లాడినవాని స్వరము వారు వినలేదు." అని పౌలుఁడనెను. (కార్యములు. XXII. 9.)

ఇచ్చట నపోస్తలుఁడు దూర శ్రవణము గలవాఁడు గాని తదితరులు గారు గావున వారు వినలేక పోయిరి.

9. పౌలుఁడు పితృలోకమును దర్శించెను. స్వర్గము నుండి వచ్చిన వాక్యములను వినెను. (2. కొరంథి. XII. 2-4.)

10. యోహానుఁడు పితృలోకము నందుఁ గ్రీస్తుని హైమృతినందిన వారి యాత్మలఁ జూచెను. (ప్రకటన. VI. 10.)

నవీనముగా నేర్పడిన యాత్మవిచారణ సంఘమునందు కాలజ్ఞానవంతులలో ఘనులనేకులు చేరియున్నారు. వారు కష్టపడి యత్నముఁజేసి సత్యములైన సంగతులను గ్రహించి దర్శనపూర్వకముగా లోకమునకు వెల్లడిఁ జేయుతలంపునఁ బనిచేయు వారు. శక్తియుక్తులను, ధనమును, కాలమును, నిందులకై వ్రయపరచి శరీరాయాసమునకోర్చి కష్టపడు మహాపురుషులు. ఈ సంఘమున ప్రొఫెసరు లాడ్జి, డాక్టరు హాడ్సను, రైటానరెబెలు, జే. బిలుఘోరు, డబ్లియు. హెచ్. మేయర్సు, రైటానెరెబిలు గ్లాడ్స్టన్ మొదలగు లోకబాంధవులును, స్వభావశాస్త్రవేత్తలును, విద్యావిశారదు

లును, రాజకీయోద్యోగా ధ్యక్షులును నీ సభయందుఁగలరు. ఈ సంఘ మునుగూర్చి గ్లాడ్‌స్టన్ దొరవారొక సారియిట్లు పన్యసించియున్నారు. "ప్రపంచములోఁ జేయుచున్న కార్యములన్నిటిలోనిది ప్రధానములలో నగ్రగణ్యమైన కార్యము." ఈ సంఘమువారు స్వానుభవమువలనఁగని పట్టిన యంశములకును బైబిలునుండియెత్తి పైనుదాహరించిన యంశములకును నీష ద్భేదంబైనను లేదు. ఈ సంఘమువారును స్థూలేంద్రియ జ్ఞానాతీతమైన లోకము మఱియొకటి కలదనియు, దానిం బిత్రులోకమని పిలువనగు ననియు, నిచ్చట మృతినందు మానవులందఱును మరణానంతరమున సూక్ష్మ శరీరములతో నాలోకమునఁ బ్రవేశింతురనియు, నాసూక్ష్మ శరీరములు మనుజుని జీవితకాలములో స్థూలశరీరాంతర్గతములై యుండఁ గలవనియు స్థూలశరీరమును విసర్జించుకాలముననే యాత్మయెట్టి యవస్థలయందుండునో తదనుగుణంబగు స్థానంబాలోకంబున నలవడుననియు, భూలోకాంశం బులయొక్కయు భూలోకంబునఁ దమజీవితకాలములో జరిగిన సమస్త సంగతులయొక్కయు సంపూర్ణ జ్ఞానములోకంబున జీవులు గలిగి యుండెద రనియు, బ్రతికియుండిన మనుజులు దూరదృష్టిమొదలగు సిద్ధులఁబడ యనివారైనను వారిపరలోక సంబంధులు వారికిఁ గాన్పించి ముచ్చటించ నెంచినచోఁ గొన్ని సందర్భములయందటులఁ జేయఁజాలుదురనియు, మను ష్యలోకమున జీవించుకాలముననందే కృషి చేసినయెడల స్వశక్తివలన దైవకటా క్షమును బొంది దివ్యదృష్ట్యాది మహాశక్తులఁ బడయఁగలరనియు, నీ సంఘ మువారు కనిపెట్టి స్వానుభవసహితముగా రుజువుఁజేసియున్నారు.

స్వభావ శాస్త్ర విదులును నాత్మజ్ఞానావలోడన తత్పరులునుగూడ స్వానుభవవినిశ్చితార్థంబులు సత్యవేదోదా హృతాంశంబులతో నేకీభవిం చుట బైబిలుయొక్క సత్య స్వరూప వివరణముం బెక్కుమడుంగులు హె చ్చించుటలేదా?

# 18. అధ్యాయము

## భూతదర్శనము

(*a*) దేవదూతలు:—

ఇంతియేగాక యాత్మతత్త్వ బోధకసమాజము వారు మృతినందిన మానవుల యాత్మలును, దేవదూతలును మానవులకు దృగ్గోచరములగుటయు, వారలతో ముచ్చటించుటయు జగుచున్నదని స్థిరపరచియున్నారు. బైబిలునందిట్టి వనేకసందర్భములయందు వ్రాయఁబడియున్నవి. కొన్నిటి నిందుదాహరించెద.

1. మామ్రెరునందబ్రాహాము ప్రభువుంగాంచె. (ఆది. XVIII. 1.)
2. యాకోబు లాబానునుండి వచ్చినవెనుక దేవదూతంగాంచె. (ఆది. XXXII. 1-2.)
3. హోరబునొద్ద దేవదూతలు మోషేకుఁగాన్పించిరి (నిర్గమ. III. 2.)
4. ఐగుప్తునుండి యిశ్రాయేలీయులు వచ్చునపుడొక స్తంభము పగలు మబ్బువలెను రాత్రులయందు నిప్పువలెను గనుపించుచు వారలకు మార్గదర్శియాయెను. (నిర్గమ. III. 2.)
5. సైనాయి పర్వతమునందుఁ బ్రభుని వెలుఁగు నిప్పువలె మోషేకును ఇశ్రాయేలీయులకును గనుపించెను. (నిర్గ. XXIV. 16-17)
6. దేవుని మహిమ యాలయమును నిండెను. (నిర్గ. XL. 34-35.)
7. "ఆ గడియలోనే ఆమనుష్యునిచేతివేళ్లు గాన్పించి దీపస్తంభము నెదుట రాజమందిరముయొక్క గోడ నున్న పు గచ్చుమీఁద వ్రాసెను. మఱియు నాచెయ్యి వ్రాయుట రాజుచూచెను." (దాని. V. 5.)
8. ఆఫ్రాయొద్ద గడియను కొకదేవదూత కాన్పించెను. (న్యాయాధిపతులు. VI. 12.)

9. దావీదును ఒర్నానును దేవదూతంగాంచిరి. (దినచర్యలు XXI. 20.)

10. కార్మేలు పర్వతముమీఁద నెలీషా ప్రార్థించఁగా బ్రభువునొద్ద నుండి యగ్ని దిగి బలినాహుతిగాఁగొనెను. (1 రాజులు XVIII. 38.)

11. ఎలీషా యగ్నిగుఱ్ఱములను నగ్నిరథమును జూచెను. (2 రాజులు. II. 12.)

12. దేవుని మహిమతో నాలయము నిండెంగావున యాజకులు నిలువఁ బడి సేవఁజేయఁజాలరైరి. (2 దినచర్యలు V. 14.)

13 సాలొమోనునకుఁ బ్రభువు దర్శనమిచ్చెను. (2దినచర్యలు VIII. 12)

14. క॥.......................ప్రా
గ్ది। కుఁ గనఁజూచిన రిక్క యుదయ। చ్చెను మింటన్ వారితోడ శిశు
వున్నటకున్॥ (మత్తయి. II. 9.)

15. "ఉ॥ పావురమట్లు వేగఁదనపైదిగి వ్రాలుచునున్న యట్టియా
దేవుని యాత్మఁగాంచె మఱి తెల్లముగా వినవచ్చెమింటనా
రావము".......................మత్తయి. III. 16).

16. సీ॥ "వారితో నేను సంభాషించుచుండఁగా।
మేలైన యొక మబ్బు మింటఁ గ్రమ్మె।
యతఁడు నాప్రియ పుత్త్రుఁడితని యందును నేను।
సంతసించెదనను శబ్దమొకటి।
వినవచ్చె నా మేఘముననుండి తచ్ఛాత్రులా పల్కు వినుచు"
(మత్తయి. XVII. 5.)

యేసు మారురూపుదాల్చి మోషే యేలీయాలతో ముచ్చటించుచుండఁ గాఁ బరలోక సంబంధమైన వెలుఁగు తచ్ఛిష్యులకుఁగాన నయ్యెననియుఁ దల్లోక వాక్యములను వినిరనియు దీనిభావము.

17. సీ॥ "నిద్రించియున్న యనేకుల పరిశుద్ధ
కాయముల్ లేచెనక్కజముఁగాఁగ
వారు సమాధుల వెలికినేతెంచి యతఁడు
లేచిన తదనంతరమునఁ ।
పరిశుద్ధ పురిఁజెంది పరగ ననేకుల కగపడిరి" (మత్తయి. XXVII. 52.)

18. ఉ. "..............................దేవగే
హమ్మున సత్తిరస్కరణి యప్పుడె చీలెను గ్రిందుఁమీదుగా"
(మత్తయి. XXVII. 51.)

సూక్ష్మదేహధారులగు పరలోక వస్తులు చీల్చిరని గ్రహింపనగును.

19. సీ॥ "..................ప్రభుదూత పరలోకముననుండి వచ్చి
రాతిని వైచియందుఁ గూర్చుండెనుదయించె ఘోరభూకంపంబు
దూతరూపెట్టిదై తోఁచుచుండె
గీ॥ హిమముకైవడిఁ దెల్లనైయెసగెవల్వ ।
వానికడలుచుఁ గావలి వాండ్రువణఁకి ।
మృతుల క్రియనుండిరి" (మత్తయి. XXVIII. 4.)

20. గీ॥ "................ఆదూత సతులఁగాంచి
భయపడకుఁ డీరటంచును బలికిమఱియు"
(మత్తయి. XXVIII. 5.)

21. జకరయుకు దేవదూత దర్శనమిచ్చెను. (లూకా. I. 23.)

22. ఏసుని తల్లియగు మరియకు గాబ్రియేలను దేవదూత దర్శనమిచ్చి మాటాడెను. (లూకా I. 28.)

23. బెత్లెహేమున గొల్లవారికి దేవదూత దర్శనమిచ్చె. (లూకా. II. 9.)

24. బెత్లెహేమునఁ గాంతిగల వెలుతురు గాన్పించెను. (లూకా. II. 9.)

25. గొల్లలు దేవదూతల గుంపునుజూచిరి. (లూకా. II. 13.)

26. ఒలివేటి పర్వతమున నపోస్తలు లిరువురి దేవదూతలంగాంచిరి. (కార్యములు. I. 10.)

27. పెంతికొస్తునం దగ్నిహోత్ర జిహ్వాలుగాన్పించె. (కార్యము. II. 2, 3.)

28. చూచినవారికందఱికి స్తెఫెనుయొక్క మోము దేవదూత మోమువలె బ్రకాశించెను. (కార్యములు. VI. 15.)

29. క్రీస్తు స్తెఫెనుకు దర్శనమిచ్చెను. (కార్యములు. VII. 55.)

30. సౌలును నతనితో నున్నవారును గొప్ప వెలుతురునుజూచిరి. దాని వలన సౌలున కంధత్వము కలిగె. (కార్యములు. IX. 33 XXII. 9.)

31. కార్నిలియను దేవదూతలను జూచెను. (కార్యములు X. 30.)

32. పేతురు కారాగృహమున దేవదూతలంగనె. (కార్యములుXII. 7.)

33. పౌలు క్రీస్తు మృతిఁబొందిన కొంతకాలమునకుఁ జూచె. (కొరంధి. XV. 8.)

34. ఓడపై పౌలు దేవదూతలం జూచె. (కార్యములు. XXVII. 23.)

(b) దుష్టగ్రహములు :—

దయ్యము లనేకములు మనుష్యుల నావహించి బాధించుచుండుట యుఁ గ్రీస్తు వానిని వెడలఁగొట్టుచుండుటయు నూతన నిబంధనమునఁ బెక్కు తావులఁ జూడఁగలము. దయ్యములు క్రీస్తుని గుర్తించుటయు, క్రీస్తు దయ్యములను గుర్తించుటయుఁగూడఁ దటస్థించెను. క్రీస్తును వానివలన నధికారమును బొందినవాని శిష్యులును దయ్యముల వెడలించినవాని నొక కొన్నిటి నిందుదాహరించెద.

1. నోటి మాటలవలననే క్రీస్తు దయ్యములను వెడలఁగొట్టెను. (మత్తయి. VIII. 16.)

2. ఇరువురు మనుష్యుల నావహించిన దయ్యముల గుంపు క్రీస్తునియాజ్ఞ పైని వారిని వదలి పందులగుంపునఁ బ్రవేశించెను. (మత్తయి. VIII. 28. 33.)

3. దయ్యముల వెడలఁగొట్టుటకు వానిశిష్యుల కధికారమిచ్చెను. (మత్తయి. X. 1.)

4. దయ్యములరాజుద్వారా దయ్యముల వెడలించుచున్నాఁ డని పారసీకులనిరి. (మత్తయి. IX. 34.)

5. యూదులు యారాధన సమాజమందిరమున నొక మనుష్యునావహించి బాధించుచున్న దుష్టగ్రహమునుఁ, గ్రీస్తు గద్దించి వాగ్బంధనముఁ జేసికొని వారినుండి వెడలిపొమ్మని ముదలయిడ నా గ్రహమట్లు గావించెను. (మార్కు. I. 23. 26.)

6. క్రీస్తనేక గ్రహములను వెడలించి, యవి తన్నెఱుఁగును గావున వానిని మాటలాడకుండఁ జేసెను. (మార్కు, I. 34.)

7. దుష్టగ్రహములు క్రీస్తుని జూచినప్పుడు హోకారించి నీవు దేవుని కుమారుఁడవని యరచెను. (మార్కు. III. 11.)

8. గ్రహావిష్టతా మూకతా బధిరతలనందిన యొక మానవునిఁ గుదిర్చె. (మార్కు, IX. 25.)

9. అనేకగ్రహములు నీవు దేవునికుమారుఁడవగు క్రీస్తువని చెప్పుచు నిర్గమించె (లూకా. IV. 41 )

10. తత్క్షణమే భూతావిష్టులను, వ్యాధిగ్రస్థుల నసంఖ్యాకంబుగ నీరుజులఁజేసె. (లూకా. VII. 21.)

11. ఏసు భూతావిష్టులగు స్త్రీల ననేకల స్వస్థపరచెనందు మగ్దలేనే మరియనుండి సప్తగ్రహకూటము నిర్గమించె. (లూకా. VIII. 2.)

12. పౌలుగ్రహము వైపు దిరిగి “ ఆస్త్రీనుండి నిన్ను బయలు వెడలుమని ప్రభువైన యేసుక్రీస్తు నామమున నాజ్ఞాపించుచున్నా న ” నఁగా

నాభూత మా యుత్తరక్షణమున వాని వదలిపోయెను. (కార్యములు. XVI. 16_18.)

13. దేశద్రిమ్మరు లగు కొందఱు యూదు లేసుక్రీస్తు పేరట దయ్యముల నపవారింపఁ బ్రయత్నింపఁగా నందొకదయ్యము 'ఏసును నే నెఱుఁగుదును, పౌలును నే నెఱుఁగుదును నీ వెవ్వఁడవని,' వారిని గద్దించి పైఁబడ వారు భయపడి వీడినవస్త్రములు గల శరీరములతో నిలువెడలిపోయిరి. (కార్యములు. XIX. 15. 16.)

ఆత్మజ్ఞాన సమాజమువారు చెప్పురీతిని బహుశః మరణకాలమున కీప్సితము లన్నియుఁ దీరక యుత్తరలోకమునఁ దదీప్సితసిద్ధి కవకాశము గానక భూతములు మానవులపై నావరించి దుష్కార్యములఁ దీర్చికొనఁ బ్రయత్నింప నోపు. లేనిచో నీ భూతము లిట్లు మానవులఁ బీడింప వేఱు కారణము గానరాదు.

ఇట్టి భూతముల బారినుండి తప్పించుకొనుటకే యపోస్తలుఁ డీగతి వ్రాసియుండనోపును. "ప్రతిగ్రహమును నమ్మవలదు; అవి దేవునిసంబంధ మగునవి యగునో కావో పరిశీలింపుఁడు."

(c) చేతబడులు లేక ప్రయోగములు :—

అదిగాక చేతబడులను జేసి విరోధుల నలయించుటకై కొందఱు మానవులు దుష్టగ్రహములం దమ స్వాధీనమం దుంచుకొందురనికూడ బైబిలువలన గ్రహింపనగును; హిందువులలోను, మహమ్మదీయులలోన నీ ప్రయోగపు తంతులు గలవని నమ్మిక పెక్కు గలదు.—దీనియందుఁ బాశ్చాత్యులకును మొన్న మొన్నటి వఱకు మిక్కిలి నమ్మికగలదు. అట్టి ప్రయోగములఁ జేయువారినిఁ బ్రజలు బహిరంగముగ రాజవీధులలో వధించుటయు, సిలువ వేయుటయు, కాల్చుటయు నాదిగాఁగల యాచారములు గలవు.

ఈవిషయమున సత్యవేదమునఁ గల సాక్ష్యము నిందు బొందు పరచెదను.—

1. "కర్ణపిశాచి గలవారితట్టునకుఁ దిరుగవలదు. (లేవీయ. XIX. 31.)

2. "మఱియుఁ గర్ణపిశాచి గలవారితోను, సోదెకాండ్లతోను, వ్యభిచరించుటకు వారితట్టునకుఁ దిరుగువాఁడెవఁడో వానికి విరోధముగా నాసన్నిధిమూతను నిలువఁబెట్టి, వాని ప్రజలలోనుండి వాని ఛేదించెను." (లేవీయ. XX. 6.)

3. "పురుషునియందును, స్త్రీయందును గర్ణపిశాచియైనను సోదెయైన నుండినయెడల వారినిఁ జంపవలెను." (లేవీయ. XX 27.)

4. "సౌలుకర్ణపిశాచములుగల వారినిని, జిల్లంగి(ప్రయోగములు చేయు) వారినిని దేశములోనుండి పరిహరించియుండెను." (1 సముయేలు. XXVIII. 3.)

5. "అతఁడు కాలపు గురుతులను శకునములను వాడుకచేసి, యక్షిణులతోను, సోదెకాండ్రతోను సాంగత్యము చేసెను." (2. రాజులు. XXI. 6.)

6. "యెక్షిణివాండ్రను, జిల్లంగి పెట్టెడువాండ్రను, విగ్రహములను, గృహదేవతలను." (2. రాజులు. XXIII. 24.)

7. "నీనోటిశబ్దము కర్ణపిశాచము గలవాని నోటిశబ్దములాగున భూమిలోనుండి వినఁబడును." (యెషయా. XXIX 4.)

8. "వారు తమ బొమ్మలతోడను, యక్షిణీ విద్యలతోడను, గర్ణపిశాచముగలవారితోడను చిల్లంగివారితోడను నాలోచనఁ జేయుదురు." (యెష.యా. XIX. 3.)

ఏసు భగవంతుని పుత్త్రుఁడ నని బోధించుటవలనఁ దాను భగవంతునితోఁ దుల్యుఁడనని చెప్పుకొనిన ట్లయ్యెం గావున యూదులు వానిఁ జంప యత్నించిరి. (యోహాను. V. 8.)

# 19. అధ్యాయము

## కర్మయోగము

ఇంతదనుక క్రీస్తు తనశిష్యులకు జ్ఞానమార్గమును దానికి సాధనమగు యోగమును బోధించెనని లక్షణలక్ష్యములచేఁ జూపియుంటిమి.

ఇకహిందువులు కర్మయోగమని వాడుమార్గమును గ్రీస్తుబోధించెనా లేదాయని విమర్శింతము.

### (a) హిందువుల కర్మయోగము

శ్రీకృష్ణ ఉవాచ :—

శ్లో॥ నకర్మణామనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
నచసన్న్యసనాదేవ సిద్ధింసమధిగచ్ఛతి॥

శ్లో॥ నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్య కర్మకృత్।
కార్యతేహ్య వశఃకర్మసర్వః ప్రకృతిజైర్గుణైః॥

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్యయ ఆస్తేమన సాస్మరన్॥
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే॥

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసానియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్య విశిష్యతే॥

శ్లో॥ నియతంకురు కర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః।
శరీరయాత్రాపి చ తేనప్రసిధ్యేదకర్మణః॥

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్రలోకోఽయంకర్మబంధనః।
తదర్థంకర్మకౌంతేయ ముక్తసంగస్సమాచర॥

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వాపురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేషవోఽస్త్విష్టకామధుక్॥

కర్మముల ననుష్ఠింపక పోవుటవలననే పురుషునకుఁ గర్మశూన్యత కలుగదు. కర్మములను విడచినంత మాత్రముననే జ్ఞాన యోగ నిష్ఠ సిద్ధింపను

ఏలయనఁగా నెవ్వఁడును క్షణకాలమైన నెప్పుడును గర్మముచేయకయుండఁ జాలఁడు. ఎందువల ననఁగా దానిప్రకృతి వలనఁబుట్టిన సత్త్వరజస్తమో గుణములతనిచేతఁ గర్మములను జేయింపక విడువవు. ఎవఁడు కర్మేంద్రియములను నిగ్రహించి విషయములను మనస్సుచేత స్మరించుచుండునో యట్టి వివేక శూన్యుఁడు మిథ్యాచారుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అర్జునా! ఎవఁడు మనస్సుచేత నింద్రియముల నిగ్రహించి ఫలాపేక్షలేనివాఁడై కర్మేంద్రియములచేతఁ గర్మయోగము ననుష్ఠించునో యతఁడధికుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. అందువలన నీవు నిత్యమైన కర్మమును జేయవలయును. ఏలయనఁగా కర్మము జేయకుండుటకన్నను కర్మముఁ జేయుట మేలు. నీవు కర్మముఁజేయవేని నీకుశరీరస్థితికూడా సిద్ధింపదు. ఈశ్వరార్థముగాఁజేయఁబడు కర్మముకంటె భిన్నమైన కర్మములోకమునకు బంధమును గలిగించును. అందువలననర్జునా నీ వీశ్వరార్థమైన కర్మమును ఫలాపేక్ష లేనివాఁడవై చేయుము. మున్ను ప్రజాపతి యజ్ఞములతోఁగూడఁ బ్రజలను సృజించి యిట్లు పలికెను. మీరీయజ్ఞముచేత వృద్ధిఁజెందుఁడు. ఇది మీకుఁగోరిన కోరికలనిచ్చునది యగుఁగాక. (భగవద్గీత)

శ్రీకృష్ణులవారు భగవద్గీతయందు విపులముగా నుపదేశించిన కర్మమార్గమిదియే. ముక్తినందుటకు వారుపదేశించిన మార్గములలోనిది యొకటి. సర్వసంగ పరిత్యాగమునుజేసి విధికృతములగు కార్యములను జేయకసోమరితనముగాఁ గాలముఁగడపినఁ బ్రయోజనములేదు. శ్రీకృష్ణుఁడుపదేశించినదేమనఁగా సత్కార్యాచరణము తప్పదనియు వాసనావాసిత్వమును దప్పించుకొన నెంచినచో నీచేయు సత్కార్యములను ఫలాపేక్షను గాంక్షింపక భగవదర్పితముగాఁ జేయవలయుననియె. ఇట్టి కర్మను జేయుటవలన దేవుని సమీపింపఁగలమనియు శ్రవణ మనననిధిధ్యాసలను చతురుపాయంబులచే సాక్షాత్కారము గలుగుననియు బోధించెను. పురుషుఁడీ మార్గత్రయము నందెద్దాని నవలంబించినను మిగిలిన రెండును దానియందిమిడి యుండఁగలవు. జ్ఞానము నవలంబించిన భక్తియు, నిష్కామ్యకర్మయు సహకారు

లైయుండును. భక్తినవలంబించిన జ్ఞానమును, సత్కార్యాచరణమును, దోడ్పడఁగలవు. కర్మమార్గము నవలంబించిన భక్తిఁ జ్ఞానములు వానితోఁ గూడనుండఁగలవు.

## (b) బైబిలులోని నిదర్శనములు

దీని యాదార్థ్యమును క్రీస్తును గూర్చి బైబిలునందుఁ జెప్పబడిన యొక కథననుసరించిన గ్రహింపనగును. క్రీస్తు మతబోధను జేయుచు గ్రామాదుల సంచరించు నెడ నొక గ్రామమునఁ దానుబసచేసిన యింటమార్థా, మేరీయలను నక్కసెల్లెండ్రిరువురు గలరు. కనిష్ఠయగు మేరీయను నామె క్రీస్తు పాదసన్నిధిఁజేరి వానితత్త్వజ్ఞాన బోధను వినుచుండెను. జ్యేష్ఠయగు మార్థగృహకృత్య నిర్వహణ రూపమగు కార్యముల నెఱవేర్చుట యందలసి (క్రీస్తు కొఱకు వంటజేయుట భగవదర్పితమగు నిష్కామ్యకర్మ) క్రీస్తునుజూచి మేరీనితనకు సహకారిగా నుండుటకుఁ బంపవలసినదని కోరఁగాఁ గ్రీస్తీవిధమునఁ జెప్పెను.

"మార్తా, మార్తా, నీవనేకములైన పనులనుగూర్చి విచారముగలిగి తొందరపడుచున్నావు. కాని అవసరమైనది యొక్కటే. మరియ యుత్తమమైనదాని నేర్పఱచుకొనెను, అది ఆమె యొద్దనుండి తీసివేయఁబడదు."
(లూకా X 41,42.)

ఇచ్చట మార్తామరియ లిరువురును స్వామియందుఁ బ్రేమగలవారగుటను భక్తిమార్గము నుభయులు నవలంబించినవారే. మార్తాగృహకృత్యములఁ జేయుటలో స్వఫలాపేక్షలేక ప్రభుసేవయే ప్రధానకారణముగా నిష్కామ్యకర్మను భగవదర్పితముగాఁ జేయుచున్నది. ఇట్టినిష్కామ్యకర్మ కూడని దని ప్రభువు చెప్పలేదుగాని జ్ఞానము దీనికంటె విశేషమైన దనియు మేరీ తజ్జ్ఞాన మార్గము నవలంబించినదిగావున దానినుండి విముఖురాలుగాఁజేయఁ జనదనియుఁ బ్రత్యుత్తరమిచ్చెను. ఇందునమరియకుజ్ఞానమార్గమును, మార్తాకుఁ గర్మమార్గమును బోధించెనని స్పష్టపడుచున్నది.

మోషే ధర్మశాస్త్ర విధులను వానిమతబోధనల జూచినఁ గర్మ మార్గ ప్రధానములై యుండును. కర్మమార్గము నవలంబించిరయెట్లు ముక్తినంద నగునో యందుఁ బూర్తిగ వివరింపఁబడియున్నది. భగవదర్పితముగా యాగాదిక్రతువులఁజేసి మోక్షమునందఁగలరని యేమోషే యొక్క యేర్పాటు. ప్రాఁత నిబంధనమందెల్లెడలను నియ్యదివ్యాప్తమైయుండు కతనఁ దత్సూచక వాక్యములనింకఁ జూపుటయనావశ్యకము. ప్రాఁతనిబంధనలోనేపుటఁ దెరచిన నిది దృగ్గోచరముగాక మానదు.

రామకృష్ణానంద స్వాములవారిట్లు చెప్పియుండిరి. "మోషేకర్మమార్గమును బోధించినంత విపులముగా జ్ఞానమును బోధింపలేదు. భగవంతుని విధులకులోఁబడి యుండవలసినదని బోధించెను."

బైబిలునందుగల సాక్ష్యమును విచారింతము

1. "ధర్మశాస్త్రమునైనను బ్రవక్తల వచనములనైనను గొట్టివేయవచ్చితినని తలంచవలదు. నెరవేర్చుటకేకాని కొట్టివేయుటకు నేను రాలేదు." (మత్తయి. V. 17.)

(మార్కు IV. 21; లూకా VIII. 16) జూడుఁడు.

పైవాక్యములలోని ధర్మశాస్త్రములు మోషేవిధించిన కర్మమార్గానుసరణమున కనుగుణమగు ధర్మములేకాని వేఱుకాదు. అవియేమియనిన యజ్ఞయాగాదికములవలన భగవంతునినారాధించుమనియు సత్కార్యాచరణము నవలంబించుమనియు విధించిన శాస్త్రమే క్రీస్తుచేసిన కార్యమేమిటి? కర్మమార్గము ననుసరించుట కాదా? నరులపాపముయొక్క ఘోరమునుండి తప్పించుటకై భగవంతునికిఁ దానుబలిగానర్పింపఁబడెనుగదా?

2. ఏసు రూపాంతరమునందినప్పుడు మోషేయును యేలీయాయును ప్రత్యక్షమై "ఆయన యెరూషలేములో నెఱవేర్చఁబోవు నిర్గమమును (బలిని) గూర్చి మాటలాడుచుండి"రని (లూకా. IX. 31.) సువార్త

యందు చెప్పియుండుటచేఁ గ్రీస్తు వాచరణ మూలమున స్పష్టముగాఁ గర్మమార్గమును బోధించెనని గ్రహింపనగును. క్రీస్తుని జీవితమంతయు నెచ్చట వెదకినను పరోపకారార్థమై నిష్కామ్య కర్మ నాచరించుట వినా మఱేమిగలదు. క్రీస్తు నొకమార్గదర్శకునిఁగా వేగుచక్కఁగా భావించుకొని ప్రతి మానవుఁడునను క్షణము వాని జీవితము ననువర్తించి నిష్కామ్య కర్మముఁజేసినచో ముక్తినంది తీరఁగలఁడు. తాను వాఙ్మూపముగా బోధించుటయే కాక తా బోధించినవాని నన్నిటిని నాచరణ రూపమునఁ గనబఱచెను. వాని జీవిత మాద్యంతమును "పరోపకారార్థమిదంశరీరమను" న్యాయాను సరణంబుగ స్వార్థ పరిత్యాగముగాక వేఱేమి గలదు.

ఏసు తన యింద్రియ వ్యాపారములవలన నందఁదగు సౌఖ్యముల న్నిటినిం బరిత్యజించెను. లోకోద్ధరణార్థమై తన జీవితమునందలి యను ప్రాణమును వినియోగపఱచెను.

ఈ క్రింది వాక్యములవలనఁ బైసంగతులు మఱింత స్పష్టపడఁగలవు.—

3. "క్రీస్తు మిమ్మును ప్రేమించి పరిమళ వాసనగా నుండుటకు మన కొఱకు దన్నుఁదాను దేవునికి నర్పణముగాను బలిగాను నర్పించుకొనెను; అలాగుననే మీరును ప్రేమగలిగి నడచుకొనుఁడి" (ఎఫెసీ. V. 2.) భగవద్గీతలో వివరింపఁబడిన కర్మయోగమునకును దీనికిని భేదమేమియు లేదు. పైని వ్రాసిన వాక్యరూపమునఁ బౌలుఁడు క్రైస్తవమతము కర్మయోగమును బోధించుచున్నదని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. క్రీస్తునివలెఁ బ్రేమగలవారలు కావలసినదని సంఘమునకుపదేశించెను. ప్రేమించుటయననేమి? వారల బాగు కొఱకు స్వలాభము నపేక్షింపక మంచి కార్యములను జేయుటయే కదా? నిష్కామ్యకర్మము జేయవలసినదని కృష్ణుని బోధకును దీనికిని భేదమేమికలదు!

4. "పస్కాను వధింపవలసిన పులియని రొట్టెల దినము రాఁగా నేసు పేతురును యోహానును జూచి మీరువెళ్లి మన పస్కాను భుజించుటకై మనకొఱకు సిద్ధపరుచుఁడని వారిని బంపెను" (లూకా. XXII. 7.) ఈ వాక్యమునలనఁ గర్మకాండముతో సంబంధించిన బలులు మొదలగు వానినిఁ గ్రీస్తు తా నాచరించుచు దనశిష్యుల నాచరింపవలసినదని బోధించుచున్నాఁడని తేలుటలేదా? హిందువులయందును దీనికిఁ దుల్యములగు మేకలను జంపి యగ్నియందు భగవదర్పితముగా వేల్చి తిను కర్మలుగలవు. కావున హిందువులు కర్మమార్గమని యవలంబించుదానినే క్రీస్తువుతా నాచరించెనని తేలుచున్నది. పై వానివలనఁ గర్మమార్గమును గ్రీస్తు బోధించెనని సిద్ధాంతీకరించి యుంటిమి.

ఇట్టి భక్తిమార్గమునుగూడఁ గ్రీస్తు బోధించెనా? బోధించినచో భగవద్గీత యందుఁగల భక్తిమార్గమునకును దీనికిని భేదముగలదా లేక నీ మార్గము నామార్గము నేకీభవించు నాయని విమర్శింపఁదగియున్నది.

---

## 20. అధ్యాయము

### భక్తియోగమును బైబిలునందు కలదు

1. శ్రీ భగవానువాచ.—

శ్లో॥ యేతు సర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరాః।
అనన్యే నైవయోగేన మాం ధ్యాయంత ఉపాసతే॥

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్।
భజామి నచిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్॥

శ్లో॥ మయ్యేవ మనఆధత్స్వ మయిబుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః॥

ఓ యర్జునా! ఎవరు నన్నే మిక్కిలి యుత్తమగతిగాఁదలచి యెల్ల కర్మలను నాకు సమర్పణముచేసి నన్నే తమ బుద్ధియందునిలిపి ధ్యానముఁ జేయుచున్నారో యట్టి చిత్తవృత్తి గలిగిన యట్టివారి నతి శీఘ్రముగా మృత్యురూపమైన సంసారసాగరమును దాటించువాఁడనుగా నున్నాను. నీ మనస్సును డెలివిని నాయందే యూర్జితముగా నిలుపుము. అటులఁ జేసితివేని యీ దేహము నశించినవెనుక నిస్సంశయముగా నన్నే చెందు చున్నావు. (భగవద్గీత.)

2. ఇదియే హిందువులలో భక్తియోగమని వాడఁబడు మోక్షమార్గము.

రాజమయ్యరను నొక భక్తుడిట్లు వ్రాసియున్నాడు.

"దేవునియందు ముముక్షువులుంచఁదగిన ప్రేమకే భక్తియని పేరు. ఇయ్యది దారపుత్రాదుల యందుండఁదగు ప్రేమకంటె విశేషముగ నుండ వలెను. దాని స్వభావ మపరిమితమగు నారాధనమే."

3. నారద మహర్షి యిట్లు చెప్పెను.—

"ప్రేమ నాశనరహితమైనది. అది దొరికినయెడల నరుఁడు చావు లేని వాఁడును, పరిపూర్ణుఁడును, తృప్తిగలవాఁడునగును. అది దొరికిన వానికిఁ గోరికయే నశించును, విచారమంతరించును, ఆ సహానము మాయ మగును; ఇంద్రియ వ్యాపారములయందు వాని యాత్మ ప్రవర్తింపదు; అహంభావము పోవును; ప్రేమను గుర్తించినతోడనే యాత్మయానంద మయంబై పరవశత్వంబునందు దాని స్వభావమే త్యాగము."

4. శ్రీరామకృష్ణ పరమహంస యిట్లు చెప్పెను.—

"ఈ కాలమున నిష్కామ్యకర్మ చేయుట బహుదుర్లభము. జ్ఞానము నార్జించుటయు సులభసాధ్యముకాదు. నారద ప్రోక్తంబగు భక్తిమార్గము నవలంబించుటయే సుకరము"

"భక్తిమార్గంబున భగవత్సాక్షాత్కారము నందుట తదితరమార్గ ములకంటె భయ విరహితము." ప్రభువగు యేసు భక్తిమార్గమునే ప్రధాన

ముగా బోధించినటుల సువార్తలం జదివినవారికిఁ దోపకమానదు. క్రీస్తు ననుసరింపఁ దలఁచినచో వానియందుఁ బూర్ణమైన నమ్మకము గలిగి వాని విధుల విధేయతతో నాచరింపవలయును. తాను తన తండ్రియగు భగవంతునియెడల నంతట భక్తివిశ్వాసములతోఁ బ్రవర్తించి లోకమునకు మార్గదర్శియాయెను. అందుల కుదాహరణములు:—

1. "నా తండ్రీ! సాధ్యమైనచో నీ గిన్నె నాయొద్దనుండి తొలఁగి పోనిమ్ము, అయినను నా యిష్టప్రకారము కాదు. నీ చిత్తప్రకారమే కానిమ్మని ప్రార్థించెను." (మత్తయి. XXVII. 39.)

2. సిలువపైనిఁ బ్రాణమును విడుచుకాలమునందు సైత మీ క్రిందిరీతిం బ్రార్థించెను :—

"తండ్రీ! నీ చేతికి నా యాత్మ నప్పగించుకొనుచున్నా ననెను. ఆయన యీలాగునఁ జెప్పి ప్రాణము విడిచెను." (లూకా. XXIII. 46.)

ఇంతకంటె నెక్కువ భక్తినిఁ జూపఁగలవా రెవరు? ప్రజలను దన యందు భక్తిగలవారై సన్మార్గమునఁ బ్రవర్తింపవలసిన దని బోధించెను. అనఁగా సంపూర్ణ హృదయమును దనయందు లయింపఁజేయు మని కోరెను

3. "ఎవఁడు నిద్దఱు యజమానులకు దాసుఁడుగా నుండలేఁడు; అతఁ డొకని ద్వేషించి యొకనిఁ బ్రేమించును; లేదా యొకనిపక్షముగా నుండి యొకనిఁ దృణీకరించును. మీరు దేవునికిని సిరికిని దాసులుగా నుండనేరరు. అందువలన నేను మీతోఁ జెప్పున దేమనఁగా— యేమి తిందుమో యేమి త్రాగుదుమో యని మీ ప్రాణమును గూర్చి యైనను, ఏమి ధరించుకొందుమో యని మీ దేహమును గూర్చి యైనను జింతింపకుఁడి. ఆహారముకంటె ప్రాణమును వస్త్రముకంటె దేహము నెక్కువ కాదా?" (మత్తయి. VI. 24. 25.)

(*a*) వైరాగ్యబోధ. సర్వసంగ పరిత్యాగము.

తాను బోధించిన భక్తి చలించనిదిగాను, దృఢమైనదిగాను నుండవలెనని తన శిష్యుల మనస్సులయందు నాటఁజేయుటకుఁగా నీ క్రిందివాక్యములఁ బలికెను.

1. "ఎవఁడైనను నావెంబడి రాఁ గోరినయెడలఁ దనుఁ దా నుపేక్షించుకొని తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపవలెను. తన ప్రాణము రక్షించుకొనఁ గోరువాఁడు దానిని పోఁగొట్టుకొనును. నా నిమిత్తము తన ప్రాణమునుఁ బోఁగొట్టుకొనువాఁడు దానిఁ దక్కించుకొనును. ఒక మనుష్యుఁడు లోకమంతయు సంపాదించుకొని తన ప్రాణమును బోఁగొట్టుకొనిన నతని కేమి ప్రయోజనము? ఒక మనుష్యుఁడు తన ప్రాణమునకుఁ బ్రతిగా నేమి యియ్యఁగలఁడు. (మత్తయి." (XVI. 24. 26.)

ఈ క్రిందివాక్యముల వలనఁగూడ నీ సంగతి నే గ్రహింప నగును.—

2. "ప్రభువా! నేను మొదట వెళ్లి నా తండ్రినిఁ బాతి పెట్టుటకు శల విమ్మని యడుగఁగా నేసతనిఁ జూచి—నన్ను వెంబడించుము; మృతులు తన మృతులను పాతి పెట్టుకొననిమ్మని చెప్పెను." (మత్తయి. VIII. 21. 22.)

3. "తండ్రినైనను తల్లినైనను నాకంటె నెక్కువగాఁ బ్రేమించువాఁడు నాకుఁ బాత్రుఁడు కాఁడు. కుమారునినైనను గొమార్తెనైనను నాకంటె నెక్కువగాఁ బ్రేమించువాఁడు నాకుఁ బాత్రుఁడు కాఁడు. తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపనివాఁడు నాకుఁ బాత్రుఁడు కాఁడు. తన ప్రాణము దక్కించుకొనువాఁడు దానినిఁ బోఁగొట్టుకొనును గాని, నా నిమిత్తము తన ప్రాణముఁ బోఁగొట్టికొనువాఁడు దానినిఁ దక్కించుకొనును. (మత్తయి. X. 37. 39.)

4. "పరిపూర్ణుఁడ వగుటకు నీవు కోరినయెడల నీ యాస్తి యమ్మి బీదల కిమ్ము. అప్పుడు పరలోకమందు నీకు ధనము కలుగును. నీవు వచ్చి నన్ను వెంబడించుమని యతనితో జెప్పెను" (మత్తయి. XIX. 21.)

పై వాక్యములలోఁ గ్రీస్తు వైరాగ్యబోధను జేసెను. ఈ ప్రాపంచిక సౌఖ్యము లస్థిరము లనియు, జలబుద్బుదప్రాయము లనియు గ్రహించి విరాగము నందిననేకాని యాముష్మికము లబ్బదు.

(b) భక్తి, విశ్వాసము.—

భక్తికిమించినది లేదనియు నాత్మతత్త్వజ్ఞానమున కిది కరదీపికవంటి దనియుఁ గ్రీస్తు బోధించియున్నాఁడు.—

1. "విశ్వాసము లేని మూర్ఖతరమువారలారా, నేనెంతకాలము మీతో నుందును ? ఎంతవఱకు మిమ్ము సహింతును ?" (మత్తయి. XVII. 17.)

2. "ఆవగింజంత విశ్వాసము మీకుఁ గలిగియుండినయెడల నీకొండను జూచి—ఇక్కడనుండి యక్కడికిఁ బొమ్మనఁగా నేయది పోవును ; మీకసాధ్యమైన దేదియు నుండదని నిశ్చయముగా మీతోఁ జెప్పుచున్నా నని వారితో ననెను" (మత్తయి. XVII. 21.)

3. "నీ విశ్వాసరీతిని నీ కగును."

4. "నీ విశ్వాసము నిన్నుఁ గుదిర్చినది."

5. "నమ్మువానికి సమస్తమును సాధ్యమే." (మార్కు. IX. 23.)

పై వాక్యములవలనఁ గ్రీస్తు తన శిష్యులకు భక్తిమార్గోపదేశమును జేసె నని తేలుచున్నది. పౌలుఁడు కొరింధియులకుఁ జేసిన బోధలయందుఁ గల యీ క్రింది వాక్యములఁ జదివిచూచినఁ గ్రీస్తు భక్తి జ్ఞాన కర్మయోగ త్రితయంబును బోధించె నని గోచరింపఁగలదు.—

6. "అయినను బ్రయోజనముకొఱకుఁ (అందరికి) బ్రతివానికి నాత్మ ప్రత్యక్షత యనుగ్రహింపఁబడుచున్నది. ఎటులననఁగా, ఒకనికి నాత్మమూలముగా జ్ఞానవాక్యమును, మఱియొకనికి నా యాత్మ ననుసరించిన బుద్ధివాక్యమును, మఱియొకనికి నా యాత్మవలననే

విశ్వాసమును, మరియొకనికి ఆ ఒక్క ఆత్మవలననే స్వస్థపఱచు వరములును, మఱియొకనికి నద్భుత కార్యములను జేయుశక్తియు, మఱియొకనికిఁ బ్రవచనవరము, మఱియొకనికి నాత్మల వివేచనమును, మఱియొకనికి నానావిధభాషలును, మఱియొకనికి భాషల యర్థముఁ జెప్పు శక్తియు ననుగ్రహింపఁబడియున్నవి. అయినను వీని నన్నిటి నాయాత్మ యొకఁడే తన చిత్తముచొప్పునఁ బ్రతివానికిఁ బ్రత్యేకముగాఁ బంచియిచ్చుచు కార్యసిద్ధి కలుగఁజేయుచున్నాఁడు. ఏలాగున శరీర మేకమైయున్నను అనేకము లైన యవయవములు కలిగి యున్నదో, యేలాగు శరీరముయొక్క యవయవము లన్నియు ననేకములైయున్న నొక్క శరీరమై యున్నవో, ఆలాగే క్రీస్తు నున్నాఁడు.” (1. కొరింథీ. XII. 7-13.)

---

## 21. అధ్యాయము

### క్రైస్తవ హిందూ మతముల సమానధర్మములు.

పూర్వోక్తాధ్యాయములఁ గల యంశముల విమర్శించి యుంటిమి గదా! ప్రతి మనుజునికిని నెప్పటికేని లోకసంబంధ మైనట్టియు, మతసంబంధ మైనట్టియు స్వల్పభేదము లంతరించి ప్రపంచమునఁగల మానవకోటి యందు సోదరభావము సృష్టి స్థితి లయ కారణభూతుఁ డగు భగవంతుని యెడల పితృభావమును జనింపక మానదు. ఆత్మతత్త్వ విమర్శనమునందింతదనుక నభివృద్ధిఁజెందు నతనికి యొక ముఖ్యాంశము స్ఫురించఁగలదు. సకల చరాచర దృశ్యపదార్థమును సర్వజ్ఞుఁడును సర్వశక్తివంతుఁడు నగు భగవంతునిచే సృష్టింపఁబడినవను నిశ్చయజ్ఞానము లభించును. ప్రపంచమునం దొక కొంతభాగ మొకదేవునివలనను, మిగిలిన భాగ మింకొక దేవునివలనను సృజింపఁబడిన వనియుఁ గావునఁ పలువురు దేవులు కలరనియు

దలంపఁదగిన మాధ్యదశ తొలఁగి 'యేకో దేవః కేశవో వా శివో వా' యను నేకభగవత్తత్త్వజ్ఞానము కలిగిన వారెవ్వరును ఒక్కఁడైన భగవంతుఁ డేర్పరచు రక్షణావిధానము పలువిధంబులనుండు నని తలంపఁడు. ప్రపంచము యొక్క నడకయంతయు నొకేరీతినుండి స్వభావ జనితములగు శక్తులనఁగా గాలి నిప్పు మొదలగునవనియు స్వస్వనియమిత విధానముల నీషద్భేదంబైన లేక ప్రవర్తించుటయుఁ జూచియైన సృష్టికర్త యొక్కఁడే యని గ్రహింపనగును. స్వభావమునఁ బ్రవర్తించుచున్న శక్తులన్నియు ద్వివిధములు గాక స్వస్వ నియమిత కార్యాచరణార్థ మొక్కొక్క శక్తియే స్థాపింపఁబడియుండ మోక్షదాయక మగు శక్తియు తదాచరణ క్రమమును నొక్కటి గాక రెండెట్లగును? అజ్ఞాన వశమునఁ బలుమతము లేర్పడుటచేఁ దన్మత కర్తల బోధనలు ప్రజాంతఃకరణంబుల కలవరపరచి పలువిధములఁ బ్రసరింపఁజేయుచుండుటయే దీనికి కారణము.

ఇటులఁ బెక్కు మతములచేఁ జెప్పఁబడు వివిధములైనమార్గములన్నియుఁ దన్మతావలంబనులను గమ్యస్థానమున జేర్చఁగలవా లేక కొన్ని పెడత్రోవలఁబట్టించి దుర్గతికిచేర్చునా? అన్నిటికిని సమమైన శక్తికలదా! ఇం దేదైన నొకటి మిగిలినవానికంటెఁ దక్కువ శ్రమతోఁ బరలోక సుఖానుభవము నొసఁగఁగలదా? యను నీ సందియములు ప్రతివానికినిఁ గలుగక మానవు. మనపూర్వులీ సంగతుల నన్నిటిని విమర్శించి వారియభిప్రాయముల నీ క్రిందిరీతిని నుడివియున్నారు.

1. కొందఱీ మతవిమర్శన మను రొంపిలో నేల దిగెదరు. ఇది యెవ్వరికిని ఫలితము నొసఁగఁజాలదనెదరు. ఇతర మతములవా రెట్లు చెప్పుచుండిన నేమి యేమిచేయుచుండిన నేమి, దానిని మీరు పెడచెవినిబెట్టి మీరిదివఱకే మతావలంబకులో దానినే విడువక నాచరింపుఁడు అని చెప్పెదరు. వీరిమాటలు సత్యములే యగునెడల మతవిషయిక బోధనా సంఘములవలని ప్రయోజనమేమియునుండదు. ఈ సమాధాన మంగీకారార్హమైనదగుచో పలు

మతములను బోధించు బోధకులందఱును వెంటనే మాటలను గట్టికొని వారి స్వదేశముల కేగవచ్చును. వృత్త్యంతరములఁ జెందవచ్చును. ఇది సరియైన ప్రత్యుత్తరముకాదని నా యభిప్రాయము. ఇతర దేశములను, ఇతరదేశ ప్రజలను జూచి పరిచయముచేయు కొలఁదిని మనుష్యుని యనుభవములును, జ్ఞానమును, అభివృద్ధి చెందునటుల మనుజుని యాత్మజ్ఞానమును పలుమతములసంగతి సందర్భములు గ్రాహ్యమునకు వచ్చుకొలఁది నభివృద్ధిఁజెందఁగలదు. కావున పరమత రహస్యార్థముల గ్రహింప మనంబు జొనుపక స్వమతము మంచిదైనను చెడ్డదైనను దానినే పట్టుకొనుట కేవలము మూర్ఖమనవలెను.

2. బ్రహ్మసామాజికులు మున్నగు మతికొంద ఱన్నిమతములును బ్రహ్మపురికేగు మార్గములే యనియు నేదారినిబోయిన నావీటినే చేరఁగలదనియుఁ చెప్పెదరు. భగవంతునియొక్క వలయాకారమునకు మధ్యనుండు నణుపదార్థముగా నెంచెదరు. ఈవలయమునందుఁగల యేస్థానమునుండి వెలువడినను సరిగానడచిన మధ్యకుఁ జేరఁగలరని చెప్పెదరు. ఇటుల తలంచుటకుఁ గొన్ని దుర్ఘటములైన వ్యాఘాతములుకలవు. ఇటుల తలంచినచోఁ బ్రాపంచికస్థ మతసర్వస్వము నేక ఫలభాక్కులుగా నెంచినటులనగు. ఇదియుక్తమగునా? నీతి యన నేమియో యెఱుఁగనివానివలె భాగవతమునఁ జూపింపఁబడిన శ్రీకృష్ణుఁడును, బరిశుద్ధత మూర్తీభవించినటులఁ గ్రొత్త నిబంధనయందు వర్ణింపఁబడిన యేసుక్రీస్తును తమతమ భక్తులకేకరీతినే ముక్తి నీయఁగల రనుట ధర్మమా? సంసారమును త్యజించి సకల జీవకోటియందు నపరిమితప్రేమను నెలకొల్పిన బుద్ధుఁడును, పలువురు భార్యల వివాహమాడి తనమతము నవలంబించని వారిని శిరచ్ఛేదము జేయ ముదల యిడిన మహమ్మదును నొక్క రీతివారలఁదగునా? శ్రీకృష్ణుని నీతిబాహ్యము లగు చర్యలకు మారుభావములఁ గల్పించి సమన్వయించి సమర్థించ ననేక ప్రయత్నము లిదివఱకే జరిగియున్నవి. వాని నీ స్థలమున నించుక విమర్శించుట యుక్తము.

## శ్రీకృష్ణుడును వాని బాల్య యౌవనావస్థలును

కృష్ణుని చారిత్రము కొన్ని పురాణములలో వ్రాయబడియున్నది. వీని నన్నిటినిగూర్చి ధీరేంద్రనాథ పాలుడను వంగదేశపు పండితుడిట్లు వ్రాసెను:—

కృష్ణుని చరిత్రములన్ని పురాణాములయందును వ్రాయబడలేదు. కొన్నిటియందే కలదు. విష్ణు పురాణము, బ్రహ్మపురాణము, భాగవత పురాణము, బ్రహ్మకైవర్త పురాణము, స్కాందపురాణము, వామన పురాణము, కూర్మ పురాణము నను వీనియందు గలదు. ఇందు విష్ణు, బ్రహ్మ, బ్రహ్మకైవర్త, భాగవత పురాణములలో విపులముగ నీచరిత్రము కానుపించును, మిగిలినవానియందు బహుసంకుచితముగ నున్నది. పూర్వోదాహృత పురాణ చతుష్కమునందలి కతకు భిన్నముగాలేదు. కావున నాలిగింటినే విచారింతము. మిగిలిన వానిని వదలివేయవచ్చును. అసలు బ్రహ్మకైవర్త పురాణము పోయినది. ప్రకృతమున వాడుకయందుండు బ్రహ్మకైవర్తమునందు గల కృష్ణుని చరిత్రమునకును మిగిలిన పురాణ త్రయమునందు గల కృష్ణ గాథకును విశేష భేదము కలదు. కావున నట్టి భేదములు నూత్న కల్పితము లని మనము విసర్జింపవలెను.

భాగవతము విష్ణుపురాణమునకంటె ననేక శతాబ్దములు వెనుక వ్రాయబడినది. విష్ణుపురాణము పురాతనము, ఈ భాగవతము క్రీస్తు శకము 1300 సంవత్సరమున ప్రసిద్ధిగాంచిన బోపదేవునిచే వ్రాయబడినదని కొందఱనెదరు. ఈ పురాణమునుగూర్చి వైష్ణవులకును శాక్తేయులకును మిక్కిలి వివాదము కలిగెను. వైష్ణవులకొకవిధమగు భాగవతమును శాక్తేయుల కింకొకవిధమగు భాగవతమును గలవు. వీరుభయులును తమ భాగవతమే యష్టాదశపురాణములయందొకటియని వాదించెదరు. భాగవతమునకు వ్యాఖ్యానమును వ్రాసిన శ్రీధరస్వామి దానివిషయమై ప్రజలు సందేహించుచుండిరని యెఱుగును. కావుననే తన వ్యాఖ్యానారంభమున

‘భాగవత’ మను పేర నింకొక పురాణము కలదని యెవ్వరును సందేహింపఁ గూడదు’ అని వ్రాసియున్నారు. ఈ భాగవతమును గూర్చిన వివాదము జరుగుకాలమున ననేక గ్రంథములు వ్రాయఁబడినవి. చపేటమనియు, మహాచపేటమనియు, చెప్పుదెబ్బయనియు, నర్థమిచ్చు వివాదగ్రంథములు, విమర్శనములు వెలువడినవి. వీనినిఁబట్టియైనను భాగవతము దరిమిలాను వ్రాయఁబడినదని గ్రహింపనగును. కావున దీనియం దుదహరించిన శ్రీకృష్ణుని చరిత్ర మంతకంటెఁ బురాతనము లగు పురాణముల నాధారపరచుకొని వ్రాయఁబడిన దని తలంపవలెను. విష్ణుబ్రహ్మ పురాణములయందుఁగల కృష్ణ చారిత్రమున కించుకయును భేదములేదు. పెద్దవగు నిరువదినాలు గధ్యాయము లొకదానినుండి యింకొకదానిలోనికిఁ దీసికొనఁబడినవనుట కవకాశము లేదు. సంస్కృతమునం దిట్టి గ్రంథచౌర్యములు కాన్పించవు. కావున నీ పురాణద్వయమును వ్రాసిన గ్రంథకర్త లిరువురును తమకుఁ బూర్వమునఁ గల మఱియొక పురాణమునుండి యీ 24 అధ్యాయముల నెత్తి తమతమ గ్రంథములలో చూపిరని గ్రహింపవలెను.

హరివంశ మను గ్రంథము పురాణములలో నొకటి కాకున్నను కృష్ణుని కథ దానియందుఁ గలదు. ఇది విష్ణుపురాణానంతరమున వ్రాయఁబడిన గ్రంథము కావున నందలి కృష్ణగాథను జేకొనెనని చెప్పవచ్చును. పై యంశములనుబట్టి విచారింపఁగాఁ గృష్ణునిచరిత్రము విష్ణుపురాణమునందును, విష్ణుపురాణాంతర్గత చరిత్రమునే యీషద్భేదములైనను బొందని బ్రహ్మపురాణమునందును, భారతమునందును, వివరింపఁబడియున్నదని తేలుచున్నది. కృష్ణునికి వ్యభిచారప్రవృత్తి నారోపించిన భాగవతము సంశయాస్పదమైన గ్రంథమని తేలినది. విష్ణుపురాణాంతర్గతమైనట్టియు, భారతోక్తమైనట్టియు కృష్ణునికథ భాగవతమునందువలె వ్యభిచారాది దుర్గుణమిళితమైనది కాక స్వచ్ఛమైనదై యున్నది. కావున కృష్ణుఁడు దొంగ యనియు, వ్యభిచారి యనియు, మాయావి యనియు వర్ణించిన భాగవత గాథలన్నియు నసత్యములు. మధ్యకాలమున కృష్ణుని మోహాంధకారమగ్నుఁడగు స్వామి

నిగా భావించి యారాధించిన భక్తుని మనఃకల్పితమగు భావమే కాని సత్యముకాదు. అట్టి యసత్యములును మలినములునగు గాథలనన్నింటిని ద్రోలఁగించినచో నిర్మలమైన కృష్ణుని చారిత్రము మిగులును. అట్టివాఁడు దైవ స్వభావము గల ప్రజల రక్షకుఁ డని చెప్పనగును.

విష్ణుపురాణమునందు వాని బాల్యదశను విపులముగా వివరింపఁబడినదిగాని పెద్దకాలపు చర్య బహు సంకుచితముగానున్నది. మహాభారతమునందు లేని సంగతులన్నియు దీనియందుఁగలవు.

విష్ణుపురాణమునందును భారతమునందును వివరించినరీతిని శ్రీకృష్ణుని చరిత్రము క్రీస్తుశకమునకుఁ బూర్వము వేయి సంవత్సరములనుండియు నీదేశమున వ్యాప్తమైయున్నది. భాగవతాది గ్రంథములయందు వర్ణించఁబడిన కృష్ణుని నీతిబాహ్యమైన చర్యలకుఁ జెప్పఁదగిన సదుత్తరముల వివరించితిని. ఇంకను మఱికొన్ని విధములగు యుక్తులతో సమాధానములు చెప్పెదరుగాని యవి సహేతుకములుగను యుక్తియుక్తములుగను లేనందున మా చదువరులను వానితో విసిగింపఁదలంచము. నమ్మఁదగినవగు పైనఁ జెప్పిన రెండు గ్రంథములయందునుగల కృష్ణుని చరిత్రమున నీతిబాహ్యము లగు చర్య లేమియులేవు. వాని నిజస్వభావమును వర్ణించిరి.

ఈ కృష్ణునిగాథ నింతటితో విరమించి మనకథనందుకొందము. ప్రపంచమునఁగల మతములన్నియు మనకు సుమమను స్వానుభవమును కలుగఁజేసి గమ్యస్థానమును జేర్పఁగలవా? దీని సత్యాసత్యముల నెఱుఁగుటకు వివిధ మతములును తన్మతగ్రంథములును దేవుని యాజ్ఞలను వివరించి యాపర తత్త్వమును బోధించుటయే గాక ప్రాపంచికమగు నైతిక సాంఘికాచారములను వివరించుచు వానిని సాంగముగ నెరవేర్చుచుండిన పాపమని నుడువుచున్నది. నీతిసంబంధమగు ధర్మశాస్త్రవిధులను మతముతోఁ జేర్చిరి. దేవుఁడు కొన్నివిధుల నేర్పరచెను. సాంఘిక కార్యనిర్వాహణార్థమై ప్రజ లొకకొన్ని నీతివిధుల నేర్పరచుకొనిరి. మత గ్రంథములయందు దైవదత్తములగు విధు లివియనియు, మనుష్యు లేర్పరచుకొనిన విధు లివి

యానియు గ్రహింప వీలుకాకుండునటుల నీ ద్వివిధము లగు విధులను గలిపి వేసిరి. ఈ సమ్మేళనమువలననే పలుమతములయందు వైరుధ్యము సంభవించినది. మనుష్యు లేర్పరచుకొనిన నైతిక విధులను విడదీసినచో దైవదత్తములగు విధు లన్నిమతములయందును సమముగఁ బ్రబలియుండును. అప్పుడు లోకాంతములకు వ్యాపించుటవలనను చిరకాల జనితములగుటవలనను కలిగెడి స్వల్పమార్పులు కలిగిన యేక మతజన్యములే పలుమతములని గోచరింపకపోదు. సాంఘిక వ్యాపారముల గమనిక లవిచ్ఛిన్నముగ నెరవేరుటకై ప్రజలు కొన్నికట్టుబాట్ల నేర్పరచుకొనెదరు. వీనినిఁగూడ జనసమూహము గౌరవించుటకై ఆయాకాలపు ప్రవక్తలు దైవదత్తములగు విధులలోఁజేర్చి ప్రవచించుటయేగాక వీనికి భంగముగా సంచరించిన యెడల దేవుని యాగ్రహమునకు పాత్రుల య్యెదరని కూడ చెప్పెదరు. సంఘ సంరక్షణార్థమును రాజ్యాంగము వారు మతమును వినియోగపరచెదరు. కావుననే కొన్ని రాజ్యాంగముల వారు మతాధిపత్యమును గూడ రాజ్యాధిపత్యముతోపాటు తమ స్వాధీనము నందుంచుకొనియెదరు. కొన్ని రాజ్యములలో రాజెంత క్రూరుఁడైనను స్వఫలాపేక్షితుఁడైనను వానిని భయభక్తులతో ననుసరించుట యొక మతసంబంధమైనదిగా నేర్పరచిరి. విచ్చలవిడిగా సంచరించు పామరులను స్వాధీనపరచుకొనవలసి వచ్చినప్పుడు పరిపాలకులు మతము నొక మిషగా నేర్పరచుకొని మతబోధకులను స్వాధీనపరచుకొని తాము తగ్గించఁదలఁచిన యాయాకార్యముల నాచరించిన ప్రజలు పాపులయ్యెదరని వారివారి పౌరోహితులచేఁ జెప్పించెదరు. పై కారణములవలన మతమునకు సంబంధించని పెక్కుసంగతులు కాలానుగతికముగ మతమునందిమిడినవి. ఈ విధమున వచ్చిచేరిన విషయము లన్నిమతములకును సమానధర్మములుగ నుండనేరవు. ప్రకృతమునఁ బలుమతములయం దిమిడియున్న నైతిక సాంఘికాచారము లాయాకాలములయందు వీనిని మతములయందుఁ జొనిప్పిన మహానుభావుల మనఃకల్పితములుగాని మతమునకు సంబంధము కలవికావు.

ఇట్టి వాయాకాలిక దేశకాలపాత్రతంత్రానుసరణముగఁగూడ నుండును. ఇట్లు మతమున సహజవిరుద్ధముగా వచ్చిచేరిన కర్మలుమున్నగు పలు విధాచారములు ప్రతిమతమునకును వివిధములుగా నుండునుగాని సమానములుగా నుండఁజాలవు. కాని నిజమైన మతవిషయములు మట్టుకు సమానములుగనేయుండును. ప్రతిమతమునందుఁగల యిట్టిపొల్లునంతను తొలఁగించిన పిదప మిగులుసార మన్నిమతములయందు నొక్కటియే యైయుండఁగలదు.—పూర్వోదాహృతమైన సంగతులు స్పష్టముగా బోధపడుటకుగాను ‘ఆస్టిను’ అనువాని యుపన్యాసములకు ‘గోర్డనుకాంపుబెలు’ అనువారు వ్రాసిన సంగ్రహమునుండి కొన్ని వచనములనిందుఁ బొందుపరచెదము.

‘అధికారమును జ్ఞానమును కలిగిన యొకఁడు, జ్ఞానము కలిగిన తన ప్రజలు వర్తించుటకుగాను విధించిన చట్టములనే ధర్మశాస్త్రములనెదరు. అవి ద్వివిధములు:—

1. భగవంతుఁడు మనుష్యులకొఱకు విధించిన ధర్మములు.
2. మనుష్యులు మనుష్యులకొఱకు విధించిన ధర్మములు.

వీనిని కొంచెము విపులముగా వివరింతము.

1. దైవదత్తములగు విధులు.—స్వభావసిద్ధములగు పాంచభౌతిక గమనికలు నిండియిడియున్నవి. దైవదత్తములగు విధులు ప్రజలనుసరింపఁదగినవి. అవి యే మతసంబంధమైన విధులు. తదాచరణము క్షేమదాయకమగు, తదాచరణాభావము పాపము. దైవదత్తములగు విధులలో కొన్ని మనుష్యులకు వెల్లడి చేయఁబడినవి. కొన్ని వెల్లడిచేయఁబడలేదు. ఈ వెల్లడి చేయఁబడినవానినే స్వభావమునందుఁగల శక్తులనెదరు. వెల్లడి చేయఁబడినవి దైవ గ్రంథములయందు స్పష్టముగాఁ దెలియపరచఁబడియున్నవి. తెలియపరచఁబడని విధులను గ్రహించు మార్గమెద్దియని విచారింపవలసియున్నది. వానిని సూచించినదెద్ది? దీనిని తెలిసికొనుటకు రెండు మార్గములు కలవు.

(*a*) నైతికజ్ఞానము.—కొన్ని కార్యములను మానవజాతియంతయు నంగీకరించును, కొన్నిటి నందఱును దిరస్కరింతురు. ఈ యంగీకారానంగీకారములు స్వాభావసిద్ధముగను, తాత్కాలికముగను, సర్వసామాన్యముగను కలుగును. ఈ తలంపులు దిగంత వ్యాప్తములగుటచే నీశ్వర చిత్తానుసరణములని గ్రహించునది. ఇవి ప్రతిమనుజునియందునుగల యంతరాత్మచేఁ బ్రబోధితములు. ఈ యంతరాత్మమునే సహజజ్ఞానమనియును వచించెదరు.

(*b*) ఉపయోగములు.—భూతకోటి కంతకును సౌఖ్యదాయకమగునటుల భగవంతుఁ డేర్పరచును. మనుష్యులు చేయు కార్యములలో కొన్ని ప్రయోజనకరములై భూతకోటికంతను సౌఖ్యదాయకములుగ నుండును. మఱికొన్ని కార్యములసహ్యకరములై కొంటెతనమును సూచింపుచు భూతతతికి ఘాతుకములై యుండును. కావున ముందు చెప్పిన సత్కార్యములు భగవంతునికనుకూలముగను నిశ్చయింపవలెను. మనము చేయు కార్యములయొక్క రీతులను గ్రహించినయెడల నందేవి భగవత్సమ్మతములో యేవి తద్వ్యతిరిక్తములో గ్రహింపఁగలము.

పైనఁజెప్పిన (*a*) (*b*) విధులు సరియైనవికావని కొందఱు ప్రబలముగ నాక్షేపించి పూర్వపక్షముచేయఁ బ్రయత్నించియుండిరి.

2. మనుష్యుఁడు నరులకొఱకుఁ జేసిన విధులు.—

(*a*) రాజశాసనములు.

(*b*) సాంఘిక విధులు.

రాజశాసనములనుగూర్చి విశేషించి వివరింపఁబనిలేదు. సాంఘిక విధులు రాజదత్తములా? కావు. బలవంతులుబలహీనులపైఁ బ్రయోగించినవా? కావు. ఒకరు నియామకముగా విధించినవికాకున్నను బీదలకును ఘనులకును సమముగా నుపయోగించుటకు బుద్ధిమంతు లేర్పరచినవేయైనను ననుష్ఠింపవలసిన విధులైయున్నవి.”

పైనచెప్పిన ధర్మశాస్త్రవేత్తయొక్క వాక్యములను బరిశీలించి చూచినయెడల నీ క్రింది సంగతులు ద్యోతించును. దేవునియొక్క విధులాజ్ఞారూపములై ప్రవక్తలు మున్నగు మహాత్ముల మూలమున లోకమునకు వెల్లడి చేయఁబడినవి. అట్టి విధుల నాచరింపక నిర్లక్ష్యము చేసినయెడల దేవునిక్రోధ మట్టివారిపై ప్రసరించును. ఇట్టి విధుల నలక్ష్యము చేయుటయే పాపము. మన ప్రభువైన దేవుని యాజ్ఞోల్లంఘనము చేసినవారినే పాపులనెదరు. 'భోజనాత్పూర్వమున స్నానముచేయుఁడు' మున్నగు మనుష్యకృతములగు విధుల నతిక్రమించినవారిని పాపాత్ములనఁదగను. ఏయే సంఘములలో నిట్టి విధుల నేర్పరచుకొనిరో యాయా సంఘస్థులు తదాచరణాభావుల నధిక్షేపించిన నధిక్షేపింతురుగాక. దానికంతయే ఫలితము. కావున ప్రస్తుతకాలమున వ్యాప్తమగుచుండు మతములవలనఁగాని మతగ్రంథములవలనఁగాని విధింపఁబడిన విధులనన్నిటి నాచరింపని వారిపై నీశ్వరక్రోధము వ్యాప్తమగునని తలంపఁజనదు. ప్రతి మతమునందును మనుష్యులచేఁ జేర్పఁబడిన తుక్కునంతను, తీసివేసినయెడల, అనఁగా భక్తిపారవశ్యతచే భక్తులు మనస్సు పోయినంతవఱ కూహించిన యూహలనే నిజమనినమ్మి మతములయందుఁ జేర్చినగాథలను, ప్రజలు తమ యాచరణార్థమై చేసికొనిన నైతికవిధులను, సాంఘికవిధులను, యజ్ఞయాగాది కర్మలను, తీసివేసినయెడల, మనుష్యులను మోక్షమునకుఁ జేర్పఁదగిన మూలకారణములగు మతవిధులు మతసామాన్యమున కంతకును సమాన ధర్మములుగా నుండఁగలవు.

ఈ గ్రంథమునం దింతదనుక హైందవ క్రైస్తవ మతములయందుఁ గల సమానధర్మముల నన్నింటి నేకముఖమున వివరింపఁ బ్రయత్నించితిమి. క్రైస్తవ మతమునందు సామాన్యముగా కనుపించిన సిద్ధాంతముల యంతరార్థమును వెల్లడించఁ బ్రయత్నించి యుంటిమి. వానినిబట్టి చదువరులు కఠినముగాఁ గాన్పించువాని నైజమును గ్రహించుటకు వీలగునటుల యీ యధ్యాయమును వ్రాయఁబూనితిమి. క్లుప్తవ్యాఖ్యానముతో నీ మతద్వ

యమునందుఁగల మఱికొన్ని సమాన ధర్మముల నీ యధ్యాయమున వివరింతుము.

వేదమునందు యజ్ఞయాగాదికములతోఁగూడిన కర్మకాండము నుదహరించినభాగములను దీక్షతోఁ బరిశీలించిచదివి పూర్వనిబంధనమునఁ గల లేవీయ కాండముతోఁ బోల్చి చూచినయెడల యూద మతము యొక్కయు హిందూమతముయొక్కయుఁ బూర్వాచారముల నేకతావుల నేకీభావము కలిగియున్నవని తెలియఁగలదు. ఈ గ్రంథమునందేరి వ్రాయ వీలులేనన్ని యెక్కువుగనున్నవి. కావున నా కార్యము నిందుఁ బూనుకొనలేను. ఆసక్తికలవా రా యా గ్రంథములఁ జదివి సత్యమును గ్రహించెదరు గాక.

**క్రైస్తవమతము.** **హిందూమతము.**

భక్తులైనవారు భేదముగాఁ దలంచినను ఈ యిరుమతములయందు ననేక సామరస్యములు కలవు. కావున మతముల జంటయందుఁగల సమాన ధర్మముల నిచ్చట నొక్కటొకటిగ వ్రాయఁబూనితిని. వీనినిఁ జదివి గ్రహించుటవలన నీ యధ్యాయారంభమున నే నుదాహరించిన యూదమతమును గూర్చి చింతించి సత్యమును గ్రహింపఁగల వీలుకలుగును.

1

యోహాను. 1: 1—4.

ఆదియందు వాక్యముండెను, వాక్యము దేవునియొద్ద నుండెను, వాక్యము దేవుడై యుండెను. ఆయన ఆదియందు దేవునియొద్ద నుండెను. సమస్తమును ఆయన మూలముగా కలిగెను. కలిగియున్న దేదియు నాయన లేకుండ కలుగలేదు, ఆయనలో జీవముండెను; ఆ జీవము మనుష్యులకు వెలుగై యుండెను.

హిందువులు నిట్లే తలంతురు. ఆది నిశబ్ద బ్రహ్మముండెననియు, వాని వలననే సృష్టి కార్యమంతయు జరిగెననియు, నీ శబ్దబ్రహ్మము పరబ్రహ్మము నుండి వెలువడెననియు హైందవ మత గ్రంథములు బోధించుచున్నవి.

2

ప్రకటన. 13: 8.

'జగదుత్పత్తి మొదలుకొని వధింపఁబడియున్న గొఱ్ఱెపిల్ల.' ఆదిని గల శబ్దమే వధింపఁబడి బలియై జగదుత్పత్తికి కారణమాయెను.

1. జగదుత్పత్తి పురుషునియొక్క బలినుండి వెలువడెను.
బృహదారణ్యకోపనిషత్తు. 1: 1-1.
2. మనుష్యజాతి బల్యర్పణమునుండి వెలువడెను.
భగవద్గీతలు. 11: 10,
3. భగవంతుఁడు తనకుఁదానే బలిగా నర్పించుకొనెను.
బృహదారణ్యకోపనిషత్తు. 1: 2-7.

3

మనుష్యుఁడు పాపమునుండి తన స్వశక్తివలన విముక్తుఁడు కానేరఁడని క్రీస్తు మతము చెప్పుచున్నది. పాపవిమోచనమును పొందఁగోరిన నో దేవుని సహాయమును కోరవలెను. దేవుఁడే మనలను పాపపాశములనుండి విముక్తులను చేయఁగలఁడు. అదియు వాని నిర్వ్యాజ ప్రేమచే లభించును.

హిందువులనఁగ బ్రాహ్మణులు వారి త్రికాల సంధ్యావందనమున నీ క్రింది శ్లోకమును పఠింతురు.

శ్లో॥ పాపోహం పాపకర్మాహం।
పాపాత్మా పాపసంభవ।
పాహిమాంకృపయా దేవ।
శరణాగత వత్సల॥

4

(1) మత్తయి 26: 31.

అప్పుడు యేసు వారిని చూచి, ఈ రాత్రి మీరందఱు నా విషయమై అభ్యంతరపడెదరు. గొఱ్ఱెల కాపరిని కొట్టుదును, మందలోని గొఱ్ఱెలు చెదరిపోవును అని వ్రాయఁబడి యున్నది గదా?

1. శ్రీకృష్ణుఁడిట్లు చెప్పెను:—
నేనే బలిని నేనే పశువును.
(భగవద్గీతలు.)

2. విష్ణు విట్లు సూచించెను:—
ఈ విష్ణువే బలియగుపశువు. ఈ బలిపశువే విష్ణువు.

(2) మన తండ్రియైన దేవుని చిత్త ప్రకారము ఆయన మనలను ప్రస్తుతపు దుష్టకాలములో నుండి విమోచింపవలెనని మన పాపములకుగాను తన్ను తానప్పగించుకొనెను.

(శతపద బ్రాహ్మణము.)

3. దేవతలు (ఎన్నుకొనఁబడిన జనులు) సృష్టికర్తయగు పురుషునిబట్టి వధించినటుల ఋగ్వేదమునందుఁ గలదు.
4. యజ్ఞములు చేయు కాలముల యందు పఠించు మంత్రముల పరిశీలించినచో నచ్చట వధింపఁబడు యాగపశువు ప్రజాపతియే యని యర్థము గోచరించును.
5. బ్రాహ్మణము లనఁబడు వేదము నందిట్లు కలదు:—సృష్టికర్తయే స్పష్టముకొఱకు బలిగా సమర్పించుకొనెను.

పైన వివరించిన వాక్యములన్నిఁటి యందును సర్వజగత్కారణ పరబ్రహ్మము తనచే సృజింపఁబడిన సృష్టి నుద్ధరించుటకై తనను బలిగా నర్పించుకొనెనను భావము స్పష్టమగుచున్నది. కావున నీశ్వరుఁడే యజ్ఞపశువాయె నను నది యీ మతద్వయమునకును సమానధర్మము. మఱియు సృష్ట్యాదియందే సృష్టికార్య నిర్వహణార్థము ధాత బలియాయెననియును భయ మతములును ద్బోధించుచున్నవి. ఇందువలన మనము గ్రహింపఁదగిన దేమనఁగా నసలు లోకమును సృజించుటకుఁ బ్రప్రథమమున నొకసారియుఁ దదుపరి తన్నిర్మిత లోకస్థజీవు లపమార్గానువర్తులై వినాశనము నందఁబోవు తరితముద్ధరణార్థ మింకొకసారియు దేవుఁడు రెండుసార్లు తనకు తాను బలియిడుకొనెనని హైందవ క్రైస్తవమత ద్వయాభిప్రాయము.

5

'యెహోవా' యను పదమునకు నేనే జీవుఁడనని యర్థము.

'అహంబ్రహ్మాస్మి' యని వేదాంతమున హిందువులు వాడుకొను పదమునకును నదేయర్థము.

'పులినేఆండి' యను వారి విషయమున నిట్లు వ్రాసియున్నారు:—

''తత్త్వమసి' 'అహంబ్రహ్మాస్మి' యను పదములు హెబ్రీయ భాషయందుఁగల పూర్వ నిబంధన గ్రంథమునందు వాడఁబడిన యెహోవా యను పదమునుండి గ్రహింపఁబడినవి.'' అహంబ్రహ్మాస్మి యనఁగా నేనే దేవుఁడనని పరమాత్మ చెప్పఁగా, తత్త్వమసి యనఁగా నది నీవేయని జీవాత్మ యంగీకరించినటుల గ్రహింపఁజనును.

6

ఈ దిగువ నుదహరింపఁబోవు సాదృశ్యచతుష్కమును 'పులినే ఆండి' గారి గ్రంథమునుండి యెత్తి వ్రాయుచున్నాము. వాని భావముల నవియే తెలియఁజేయఁగలవు.

| | |
|---|---|
| పూర్వనిబంధన యం దెల్లెడలను యేసుక్రీస్తు దేవుని కుమారుఁడనియే బోధించుచున్నది. | మార్కండేయ పురాణముయొక్క పూర్వపు ప్రతులలోని వాక్యము కలదు:— 'సత్యంపుత్రాత్మకావిష్టః', అనఁగా దేవుఁడే తన పుత్త్రి నిమూల మున సత్యస్వరూపియై ప్రకాశించు చున్నాఁడు. |

7

| | |
|---|---|
| తానే పుత్త్రుఁడుగా జన్మించెను. | 'ఆత్మావై పుత్రనామాసి' |

8

| | |
|---|---|
| తండ్రియే కుమారుఁడు | 'పితావై పుత్రః' |

9

| | |
|---|---|
| ప్రభువైన క్రీస్తు నామమున ప్రార్థించి వాని యవతారమును స్తోత్రము చేయఁబడుఁగాక. | 'క్రైస్తవేంద్రాయ బ్రాహ్మణం ప్రతిష్టా ఆవిర్భనమీడతే' (యజుర్వేదము) |

10

ఆదికాండము నందలి మొదటి వాక్యముల జదివిన దేవుఁడు ముందు జలమును నిర్మించి యా నీటిపైనిచ రించుచుండెనని గ్రహించఁగలము.

ఆదికాండము. 1: 1_2.

హిందువులు దేవుని నారాయణుఁ డని పిలుతురు. ఈ నారాయణ శబ్దార్థమును విచారించిన నీటిపైని సంచరించు వాఁడని తేలఁగలదు. ప్రథమమున సృష్టికి పూర్వము నీటి పైని చరించుచుండెను.

ఆదిని దేవుడు నీటిని సృజించి దానిపైని విహరించుచుండెనని యీ రెండు మతములును బోధించుటవలన నీ రెంటికిని సమానధర్మమేదో యాధారముగానుండి యుండవలయునని తోఁచక మానదు. అట్టి సమధర్మములే దేవునిచే వెల్లడిచేయఁబడినవిగా గ్రహింపనగును.

11

అప్పుడు దేవుఁడైన యెహోవా ఆదామునకు గాఢనిద్ర కలుగఁజేసి అతఁడు నిద్రించినప్పుడు అతని ప్రక్క టెముకలలో నొకదాని తీసి ఆ చోటనున్న మాంసమును పూడ్చి వేసెను. తరువాత దేవుఁడైన యెహోవా తాను ఆదామునుండి తీసిన ప్రక్కటెముకను స్త్రీనిగా నిర్మించి ఆమె నాదాముయొద్దకు తీసికొని వచ్చెను. (ఆదికాం. 2: 21_22)

ఆదాము తన భార్యయైన హవ్వను కూడినప్పుడు ఆమె గర్భవతియైక యీనునుకని-తరువాత ఆమె అతని తమ్ముఁడగు హేబెలును కనెను.

(ఆదికాం. 4: 1-2)

హిందూమత గ్రంథములయందు పార్వతీ పరమేశ్వరు లేక శరీరులని వివరింపఁ బడియున్నది. కావుననే వాని నర్ధనారీశ్వరుఁడని పిలిచెదరు. దక్షుని యాగకాలమున వీరభద్రుఁడు గణేశుని వధించి చంపెను.

ఈ గాథకును ఆదాము హవ్వల పుత్రు లిరువురిలో నొకడు రెండవ వాని చంపుటకును కడుసామీప్యము కలదు. ఆదాము యెముకనుండి హవ్వను చేయుటకును, పార్వతీ పరమేశ్వరుల యర్ధనారీశ్వరత్త్వమునకును సామీప్య సాదృశ్యము స్ఫురించుచున్నది.

కయీను తన తమ్ముఁడైన హేబెలుతో మాటలాడెను. వారు పొలములో నున్నప్పుడు కయీను తన తమ్ముఁడైన హేబెయి మీఁదఁబడి యతనిఁ జంపెను.

(ఆదికాం. 4: 8.)

12

ఆదాము మొదలు నోవహువఱకును గల పిత్రియార్కులను పెద్దల సంఖ్యను లెక్కించిన నేడుగురు.

హిందూమతగ్రంథములలో సప్త మనువులుకలరనియు ప్రకృతకాలము ఏడవ మనువు కాలమనియు చెప్పఁబడియున్నది.

ఈ కలయికను చూడఁగా నీరెండు మతములలో చెప్పఁబడు మహాపురుషులు నొక్కరేయను సందేహము కలుగుచున్నది.

13

పస్కాపండుగ యీక్రింది రీతిని వివరింపఁబడినది.

నిర్దోషమైన యేడాదిమగపిల్లను తీసికొనవలెను. గొఱ్ఱెలలో నుండియైనను మేకలలో నుండియైనను దానిని తీసికొనవలెను. ఈ నెల పదునాలుగవ దినము వఱకు మీరు దాని నుంచుకొనవలెను. తరువాత యిశ్రాయేలీయుల సమాజపు వారందఱు తమతమకూటములలో సాయంకాలమందు దానిచంపి దానిరక్తము కొంచెముతీసితాముదానినితినియిండ్ల ద్వారబంధపు రెండునిలువు కమ్ములమీఁదను పైకమ్మిమీఁదను చల్లి ఆరా

హిందువులు వారి ద్వారబంధములను పసుపు కుంకములచే నలంకరించు వాడుక చిరకాలము నుండి కలదు. గ్రామమున మశూచి విశూచి మున్నగు జాడ్యము లుండిన వాకిట గుమ్మముయొద్ద పసుపును సున్నమును కలిపిన యెఱ్ఱని పారాణితో పంజా యనఁగా చేతిముద్రను వేసెదరు. దానిని చూచి యీజాడ్యముల కధిదేవత తమగృహములను దాటి పోవునని వారినమ్మకము. వారా దేవతకు బలిగా గొఱ్ఱెపిల్లలనుకూడ బలియిచ్చెదరు.

త్రియే వారు అగ్నిచేత కాల్చఁబడిన ఆమాంసమును పొంగనిరొట్టెను తినవలెను. మీరున్న యిండ్లమీఁద ఆరక్తము మీకుగురుతుగా నుండును. నేను ఆరక్తమును చూచి మిమ్ము నశింపఁజేయక దాటిపోయెదను.

(నిర్గమ. 12. 7. 8. 13.)

ఈ యుభయ మతస్థుల యాచారమునకును బహుసమీప సంబంధము కలిగి యుండుటను చూడఁగలము. ఇటుల సమాన ధర్మములు కలిగియుండుట కెప్పుడో యీరెండు మతములవారును యొకేస్థలముననుండి బయలుదేరి రెండు దేశములను చేరినవారైన కావలయునులేదా వీరియిద్దఱి మతములును నేదోయొక మతమునుండి యైన ద్వివిధములై యుండవలయును. ఈ సందర్భమున 'పులినేఆండీ' గారి యీక్రింది వాక్యములు మఱింత సుబోధకములుగ నుండును. "హిందూదేవాలయముల యొక్కయు గృహముల యొక్కయు, వీధిగోఁడల మీఁద తెలుపు యెరుపుతో వేసెడి సుద్దజేగురు నిలువుపట్టీలును, మహమ్మదీయుల వీధిగోడలపైని సుద్దవేసి పైనిజేగురు చిలుకుటయు, పంజాలననగా చేతిముద్రలను వేయుటయు నీపస్కాపండుగనే సూచింపఁగలవు."

14

దేవుని క్రోధము నుండి తప్పించుకొనుటకుగాను యిస్రాయేలీయుల నుదుట బొట్టులుంచవలసినదని బైబిలు చెప్పను.. వారిలో జరిగిన దుష్కార్యములకై పశ్చాత్తప్తులైరని సూచించుట కిదిగుర్తు. "యేహోవా - యెరూషలేము అను పట్టణములో ప్రవేశించి చుట్టుతిరిగి,

హిందువులు వారి లలాటములను బొట్టులచే నలంకరించుకొనెదరు. ఇప్పు డెవరే మతముల నవలంబించిరో తెలియుటకే గుర్తు వినియోగించుచున్నది. నామముబెట్టినవైష్ణవుఁడని తెలియును. ఈ బొట్టులు ముఖమున కందము దెచ్చుననియును ముందెంమలకివి యేర్పడిన నివి కలుగఁజేసిన

దానిలో జరిగిన హేయకృత్యము లనుగూర్చి మూల్గులిడుచు ప్రలాపించుచున్న వారి లలాటముల మీఁద తక్కెడ రూపముగా గురుతు వేయుమని వారి కాజ్ఞాపించెను.

(యెహెజ్కేలు. 9. 4.)

యందమునుబట్టి యిప్పటికిని వాని నుంచుకొనుచుండిరనియును కొందఱందురు. కొందఱు ప్రకృతి శాస్త్ర రీత్యా నివి శరీరారోగ్యమున కనువగు నందురు. ఆదియందివి యెందుకు పుట్టినను ఇప్పుడు ప్రతిహిందువుని ముఖము మీఁదను ఏదోయొక విధమైన తిలక మలంకరించి యుండును.

## 15

నోవహునకు వారి కుమారుఁడగు హిందూ మతమున కాధారజపతు ద్వారా యేడుగురు మనువులు భూతు లనఁదగు సప్త మహర్షులును కలిగిరి. పైని 12-వ సాదృశ్యమున కడపటి మనువుయొక్క సంతతివా చెప్పినటుల నోవహు ఆఖరు మనువు. రని హిందువుల పురాణములు చెప్పుచున్నవి.

నోవహునకును వాని మనువులకును, ఆఖరు మనువునకు సప్తమహర్షులకును గల సాదృశ్యము కడు సామీప్యముగ నున్నది.

## 16

హిందువుల దేవాలయములకును, యూదుల దేవాలయములకును, చాలపోలిక కలదు. హిందువుల గుడిలో విగ్రహమును ప్రతిష్ఠించు గర్భాలయ ముండును. యూదుల గుడిలో పరిశుద్ధ స్థలమనియుండును. అచ్చట దేవుని పరిశుద్ధాత్మ యల్లాడుచుండు నని వారు చెప్పెదరు. అర్చకులుత్సవములను సలుపు ముఖమంటపములును రెంటికి నొకవిధముననే కలవు. ఉభయత్ర బలిపీఠములుకలవు. బలు లర్పించు యజ్ఞవేదికలు రెంటను ప్రబలియుండును. ఆకృతియందు నుభయ దేవాగారము లొక్కరీతినే యుండును. ఈదేవతా యతనములఁ దిలకించిన భేద మేమియుఁ గాన్పించదు గాని హిం

వుల గుడిలో విగ్రహముండును. యూదుల యాలయములో నది యుండదు. పూర్వము హిందువులగుడులలో విగ్రహములు లేవనియు వానిని మధ్య నెప్పుడో చేర్చిరనియు నూహించుట కనుగుణముగా నిప్పటికిని చిదంబర మను దక్షిణాది మహాక్షేత్రమునఁ గల దేవాలయమునందలి గర్భాగారమున విగ్రహము స్థాపింపఁబడలేదు. పరిశుద్ధాత్మ మెరుపువలె ప్రకాశించుచుండు నని భక్తుల కర్చకులు చూపుచుందురు.

17

శ్రీ కృష్ణుఁడు కాలీయహ్రదమున ప్రవేశించి యందుఁ గల మహాసర్పమును నిర్జించి జయించి దాని శీర్షమున నెక్కి నాట్యము చేసి ప్రజల బాధ యుడిపెనని శ్రీమద్భాగవతమునఁ గలదు. దీని నొక్క యుపమానముగా భావింతురు. పాప భూయిష్ఠ మైన ప్రపంచమే యొక మడుగుగా వర్ణింపఁబడినది. అట్లు సహజముగ వర్ణించుచుందురు. సైతాను లేక మాయ యనుదాని నొక దుష్ట సర్పముగా వర్ణించిరి. అటులనే బైబిలును పోల్చినది; శ్రీ కృష్టుఁ డను పర్యాయ పదము గల క్రీస్తునాబరగు నరావతార మెత్తిన దేవుఁడు ప్రపంచకమను మడుగున బ్రవేశించి సైతానను-పామును జయించి దాని తలను త్రొక్కెను. క్రొత్త (ఉత్తర) నిబంధన యంతయును ప్రభువైన యేసుక్రీస్తు చారిత్రయంతయును పూర్వము దేవుఁ డనుగ్రహించిన వరము. అనఁగా స్త్రీని సైతాను మోసము జేసినది గనుక స్త్రీ సంతానము పాముయొక్క తలను చితుకద్రొక్కునను వరముయొక్క ఫలితమైయున్నది.

18

హిందువు లారాధించు 'కుమారస్వామి' యనుట కర్థము 'దేవుని కుమారుఁడు అని కాదా? 'ప్రజాపతి' యన జనమునకు 'ప్రభువు' అనికాదా? ప్రభువైన యేసుక్రీస్తున కర్థమిచ్చు యీ పదములు తటస్థించినప్పుడు కొంచెము సందేహము కలుగక మానదు.

**19**

ప్రభువైన యేసుక్రీస్తు పశువుల పాకలో పశువులతొట్టియం దావిర్భవించెను.

కృష్ణుని 'గోవిందుఁడు' అని పిలతురు. ఈ శబ్దమును పదవిభాగము చేసినచో గాః=గోవులను, విందతి= పాలించువాఁ డగుటను గోవిందుఁ డని వ్యుత్పత్తి. ఈతఁడు గొల్లవారిలో పెంపఁబడెను.

**20**

క్రీస్తు వడ్రంగి కొడుకు. దేవుఁడు ప్రపంచకమునంతను నిర్మించిన విశ్వ కర్మ యని పిలతురు.

హిందువులు ప్రజాపతిని 'విశ్వ కర్మ' యని పిలతురు.

**21**

ఉత్తర నిబంధన గ్రంథమునందు కడపటిది యగు అపోస్తలుఁడైన యోహానుచే వ్రాయఁబడిన దని యెంచఁబడిన 'ప్రకటన' గ్రంథమున వివరింపఁబడిన భవిష్యదర్థములు హిందూ ఋషులు చెప్పిన రాఁబోవు నంశములతో పోలియున్నవి.

"మఱియు పరలోకము తెరువఁబడియుండుట చూచితిని. అప్పుడిదిగో తెల్లనిగుఱ్ఱ మొకటి కనబడెను. దానిమీఁద కూర్చుండియున్నవాఁడు నమ్మకమైనవాఁడును సత్యవంతుఁడు నను నామము గలవాఁడు. ఆయన నీతినిబట్టి విమర్శచేయుచు యుద్ధము జరిగించుచున్నాఁడు. ఆయన నేత్రములు అగ్ని

దేవుఁడు భూమియందు పది యవతారముల నెత్తు ననియు, నందు పదియవ యవతార మికముందు ఎత్త వలసియున్న దనియు ఆ యవతారమును కలియుగాంతమున నెత్తు ననియు నా యవతారము పేరు కల్కి అవతార మనియును, ఆయన తెల్ల గుఱ్ఱము నెక్కి వచ్చును గావున నా పేరు కలిగె ననియు హిందూపురాణములు చెప్పుచున్నవి. ప్రత్యేకము కల్కిపురాణమని యొక పురాణము కలదు. అందా కల్క్యవతార వర్ణనమును చదివిచూచిన ప్రకటన గ్రంథమునఁ గల వర్ణనకు సరిగా సరి పోవును. ఇది చిత్రము కాదా. ఈ రెండు మతములకును నే విధమైన

జ్వాలవంటివి. ఆయన శిరస్సుమీఁద ననేక కిరీటము లుండెను. వ్రాయఁబడిన నామ మాయనకు కలదు. అది ఆయనకేగాని మఱి యెవరికిని తెలియదు. రక్తము చిలుకరించిన వస్త్రము నాయన ధరించుకొని యుండెను. మఱియు దేవునివాక్యము అను నామ మాయనకు పెట్టఁబడియున్నది. (ప్రకటన. 19 : 11—13.)

సంబంధము లేకుండిన నివియన్నియు కాకతాళీయముగ తటస్థించిన సమానాధికరణములే యని యెంచఁదగునా ? చదువరు లీ యంశమును తీవ్ర బుద్ధితో విచారించెదరు గాక.

22

క్రీస్తు ప్రజల నందఱ తనతట్టున కాకర్షించుకొనువాఁడని వ్రాయఁబడి యున్నది. తానే యిటుల చెప్పెను:—

"నేను భూమిమీఁదనుండి పైకెత్తఁబడినప్పుడు అందఱిని నాయొద్దకు నాకర్షించుకొందును.(యోహాను. 12;32.)

శ్రీ కృష్ణ శబ్దార్థమే ఆకర్షించుకొనువాఁడని చెప్పవచ్చును.

23

క్రీస్తు దేవునికుమారుఁడు.

'వాసుదేవుఁడని' కృష్ణునికి మారుపేరు గలదు. ఆశబ్దార్థము 'వసుదేవుని కుమారుఁడు' అని గనుక కృష్ణుఁడు దేవుని కుమారుఁడని తేలుచున్నది.

24

ఏసు నేనే మార్గము నని చెప్పెను.

శ్రీ కృష్ణుని స్థానమునకు 'ద్వారక' యని పేరు, అనఁగా పరలోకమునకుఁ బోవు మార్గమే శ్రీ కృష్ణుని స్థానము

గనుక వానితో సంబంధము కలుగ నిది పరమును చేరనేరదు.

**25**

క్రీస్తు శిష్యులకాళ్లుకడిగెను.

"భోజనపఙ్క్తిలోనుండి లేచితన పైవస్త్రము అవతల బెట్టివేసి యొక తువాలు తీసికొని నడుముకట్టుకొనెను. అంతట పళ్లెములో నీళ్లుపోసి శిష్యులపాదములను కడుగుటకును తాను కట్టుకొనియున్న తువాలుతో తుడుచుటకును మొదలుపెట్టెను." (యోహాను. 13: 4-5.)

శ్రీ కృష్ణుఁడు తన భక్తుఁ డగు కుచేలుని కాళ్లు కడిగెను.

**26**

బైబిలునందు (Mount meru) మేరుపర్వతమును గురించి వ్రాయఁబడియున్నది.

హిందువుల శాస్త్రములో మేరు పర్వతము కడుప్రసిద్ధమైనది. దాని వర్ణనలు విశేషముగ కలవు. ఇది పరమాత్మని నివాసస్థానము.

బైబిలునందు చెప్పఁబడిన మర్వ్యపర్వతమును హిందూశాస్త్రములో జెప్పఁబడిన మేరుపర్వతమును బహుశః ఒక్కటియే కావచ్చును. శ్రీమల్లాది వేంకటరత్నం, బి. యె. గారు బ్రాహ్మణులు హెబ్రీయులే యనఁగా యూదులేయని వ్రాసిన గ్రంథములో నిట్లుదాహరించిరి.

తుర్కిస్థానమందు అనగా బొఖారాకును పారసీక దేశముయొక్క వాయువ్యభాగమునకును మధ్యనుండు నెడారియందుఁగల ప్రదేశమే హిందువులు మేరు పర్వతమను ప్రదేశము. దీనినే బైబిలునందు మర్వ్యపర్వతమని వ్రాసియుండిరి. ఇది కాస్పియన్ నుండి రైలుమీఁద 512 మైళ్లదూర ముండును. మధ్య ఆసియాలోనున్న 'ఓరియసు' నుంచి 118 మైళ్లదూర ముండును.—

**27**

పూర్వనిబంధనయం దిజ్రా వ్రాసిన గ్రంథమున 'కస్ఫా' యను ప్రదేశ ముదాహరింపఁబడినది. వ్యాఖ్యాతలు దీనిని కశ్యపసముద్రముగా గుర్తించిరి. కశ్యపమహర్షి సంతతివారు కస్సిపియను తెగవారనియు, వారారియావ ప్రదేశమున నివసించిరనియును, కాస్పియను సముద్ర మీ కశ్యప ఋషినిబట్టియే యట్లు పిలువ బడినదనియును పండితు లభిప్రాయ పడిరి. బైబిలునందీ కశ్యపుని గాంచఁ గలము.

కశ్యపుఁడను వాఁడొక హిందూ మహర్షి దీనిగోత్రము వారిప్పటికిని దేశము నందెల్లెడల వ్యాపించియున్నారు. ప్రొఫెసరు విలస్సన్ గారు హిందూధియేటరను గ్రంథమున రెండవ వాల్యూములో నిట్లువ్రాసిరి.

"కొందఱు నవీన గ్రంథకర్తలు కశ్యపుఁడను పేరు జలప్రళయమును దాటి మిగిలిన పూర్వీకులకు పెట్టఁబడిన పేరనియు వారాసియా పరత్వ పఙ్క్తియందు నివసించిరనియు నా ప్రాంతముల యందా పేరు, కోకియసు, కాక్సను, కస్పియను, కాస్మీరము మున్నగువిధముల ప్రబలియున్నదనియు తలంచిరి."

**28**

సిరియనులు, అస్సీరియనులు, అను వారికి జరిగిన యుద్ధములు బైబిలు నందు వివరింపఁబడినవి.

గ్రీసు, హిందూమున్నగు పురాణ మత గ్రంథములయందు దేవాసుర యుద్ధము లనేకములు వర్ణింపఁబడి యున్నవి. దేవతలనగా సురలు. వీరేసిరియనులనియు, దానవులనఁగా 'అసురలు' వీరే అసిరియనులనియును కొందఱు తలంతురు.

పైని చెప్పఁబడిన రీతిని 'మర్వ' అనునదే మేరుపర్వతమైన యెడల కాస్పియను సముద్ర ప్రాంతముల నివసించినఁ కస్సిపీ, యను తెగ వారి మూల పురుషుఁడు కస్యపమహర్షియె యైనయెడలను సిరియనులు సురలనియు, అసిరియనులను అసురులనియు భావించుటలో పొరబాటేమియు కాన్పించదు.

29

బైబిలునందుఁగల యోజచరిత్రను, హరిశ్చంద్రుని చరిత్రమును పోల్చి చూచిన యెడల విచిత్రములైన సాదృశ్యములు కలవు.

30

యుద్ధసమయమున యెహోషువ సూర్యుని కదలకుండుమని యాజ్ఞాపించెను. (యెహో. 10: 13.).

ఇంద్రుఁడు రాత్రులనుగూడ పగళ్లుగా మార్చెను.— (ఋగ్వేద. 4: 30, 10: 38, 3.)

31

ప్రొఫెసరు మాక్సు మల్లరు (Max muller) దొరవారిట్లువ్రాసిరి:- "అధర్వణవేదము 4: 16 నకును బైబిలునందలి 139 కీర్తనకును నేమియుభేదము లేదు"

32

ఋగ్వేదము. II. 12, 13, and IV. 19 న్ను, LXXVII. కీర్తనయును నొకవిధమున నుండఁగలవు.

33

యూదులు తమను శత్రువుల నుండి విడిపించనందులకు యెహోవాను స్తుతించిరి.

హిందువులును అదేకారణమునకు దేవేంద్రుని స్తోత్రముచేసెదరు.

ఈ యుభయ సంఘస్థులకును విరోధులుండుటయు వారి నావిరోధుల వారినుండి స్వభావాతీతమైన భగవత్సామర్థ్యము విడుదల చేయుటయు సమానధర్మములుగానున్నవి.

34

మన యింగ్లీషు బైబిలునందు (Lord) ప్రభువని తర్జుమాచేయఁబడిన యూదుల 'యెహోవా' యను పరిశుద్ధనామము ఋగ్వేదమునందు 'యహ్వ' యని యనేకమారు లుదాహరింపఁబడినది. 'గొప్ప వాఁడు' 'బలవంతుఁడు' 'శక్తిగలవాఁడు,' యనునర్థమున వాడఁబడినది.

35

హిందూ వేదాంతమున సచ్చిదానందములను పర్యాయపదములలో నాదిదగు సత్ యను పదవిూహ ద్భేదముతో 'సద్ద' యని నిగ్గమకాండము IV. 3. లో వాడఁబడినది.

36

హీబ్రూభాషయందుఁగల 'మే' (Meh) యను పదమునకును సంస్కృతమునందుఁగల 'మేష' పదమునకును సాదృశ్యముకలదు. రెంటికిని శబ్దార్థ మొక్కటియే. మ. వెం.

37

'మే' యను హీబ్రూపదమునకును 'మేధ' యను సంస్కృతపదమునకును సమీపమగుటయేగాక యర్థము నొక్కటియే. మ. వెం.

38

హీబ్రూ. చితర్=సంస్కృత. ఛత్ర=గొడుగు. మ. వెం.

39

హీబ్రూ. అరి (Aria) =సంస్కృత. హరి=సింహము. మ. వెం.

40

హీబ్రూ. అజ్ (Ez)=సంస్కృత. అజ=మేక. మ. వెం.

41

హీబ్రూ. ఎజ్ (Az)=సంస్కృత. ఓజ=బలము. మ. వెం.

42

క్రైస్తవుల పితామహునకు (అబ్రాము) అని మొదటను పిదప (అబ్రహాము) అనియు పేరుగలదు. ఈ నామమునకును హిందువుల 'బ్రహ్మ' యను పేరునకును విశేష భేదము కనుపించదు. వీరును బ్రహ్మను

పితామహుఁడనెదరు. ఈ విషయమున మల్లాది వేంకటరత్నంగారిట్లు వ్రాయుచున్నారు:—

“బ్రాహ్మణులు పూర్వమబ్రాహాము సంతతివారిలోని పలుతెగలలో నొకతెగవారై యుండవచ్చును. అబ్రాహాముయొక్క విశేషగౌరవము ననుసరించి వారిపేరునే తమ తెగకు పెట్టుకొని యుండవచ్చును.”

ఈనామసాదృశ్యమే కాక బ్రహ్మను హిందువులు పితామహుఁడు అనఁగా గొప్పతండ్రియని పిలతురు. యూదులబ్రహామును నిట్లేపిలుతురు. బ్రహ్మసహధర్మిణిని ‘శారద’ యనిపిలతురు. అబ్రాహాము యిల్లాలును ‘శార’ యని పిలతురు. వీరినామద్వయములో నాదినామమునకు ‘ద’ యను యంత్యాక్షరాధిక్యము విశేషముకలదు. మిగిలినది సమమే. మాచదువరులీ యంశమున నిష్పక్షపాత బుద్ధితో సత్యాన్వేషణమునే ప్రధానముగా భావించి దీర్ఘాలోచనమును చేయుదురుగాక.

43

మేమిదివఱకే చెప్పినటుల ట్రాయియుద్ధము (War of troy) సంస్కృతమునందుఁగల రామాయణమునే గ్రీకుభాషయందు వ్రాసిరని భావింతుము. అసురాధిపుఁడొకఁడార్యులకన్య నొకదానిని హరించుటను గురించియే యీ రెండు గ్రంథములును వ్రాయఁబడినవి. (మల్లాది వేంకటరత్నముగారు.)

హిందువుల యజ్ఞములు మున్నగు మతాచారముల యందును తదితర సమయముల యందును ‘సిలువ’ ను వాడుకొనుచుండిరనియును, ఆచారములు మిగిలియుండి వాడుకయందవలంబింపఁ బడుచున్నను ప్రప్రథమమున వానినుపయోగించుటకుఁగల కారణమును కాలక్రమమున ప్రజలు మరచిరనియును పెద్దలనేకులు భావించుచున్నారు. ఈయాచార విధులను మొదట స్థాపించినవారు సిలువయొక్క విలువను గుర్తెఱింగి తదాచరణార్థమే యీ విధుల నేర్పరచిరో లేక మఱియేవిధమున నేర్పర

చిరో సత్యమునిప్పుడు గ్రహింప శక్యముకాదు. హిందువులు తమదిన చర్యయందాచరించు స్నానపానాదికములగు నాచారము లనేకములు దేహారోగ్యమునకై యేర్పరచఁబడినవైనను వానికన్నిటికిని మతసంబంధమైన యాధిక్యము నాపాదించుట వీరికి సహజమైయున్నది. ప్రజల కాయాశారీరక విధులయందు గౌరవము కలుగుటకై యిట్లు చేసియుందురు. అటులనే కారణమును విభజించి చెప్పినను చెప్పకున్నను సిలువను ప్రజలందఱు గౌరవించుటకు గాను ముగ్గులు, పట్లు, నామములు మున్నగువాటియందెల్లెడలను సిలువరూపమును జొనిపినజొనిపి యుండవచ్చును. లేని యీతలంపు ఊహామాత్రమైనదే. దూరదృష్టిగల మహాపురుషులందఱు నింద బొందుపరచిన సంగతులను మనస్సున నాటించుకొని నెమ్మదిగ విచారించి వారివారి యంతరాత్మ ప్రబోధించు రీతిని నిశ్చయించుకొన వలయును. అణుమాత్రపు పోలికలు కలిగినను, కలుగకున్నను, సందేహింపఁ దగినయట్టి సంజ్ఞల నన్నిటి నింద బొందుపరచెదను.

44

హిందువులు చతురాశ్రమ ధర్మములలో సన్యాసాశ్రమము బహుఘనమైనదని తలంతురు. సర్వసంగ పరిత్యాగమునుచేసి వారి జీవితమును పరమాత్ముని సేవయందే వినియోగింతురు గావున వారినిహిందువులు మిక్కిలి గౌరవింతురు. అట్టి సన్యాసులను యతులనియు పిలతురు. వారిచేతులలో దండమను నొకకఱ్ఱ చిహ్నముగా నుండును. అదియొక పొడవైనకఱ్ఱ. ఆకఱ్ఱయొక్క చివరను అడ్డముగా నొకచిన్న కఱ్ఱముక్కనుపెట్టి గుడ్డపీలికతో కట్టుదురు. ఎప్పుడును అటులనేకట్టి యుంచెదరు. అట్లు కట్టియుంచిన దండమునకు సిలువయొక్క యాకృతి కలుగును.

ఈ సిలువరూపముగ నుండు దండమును చేతఁబట్టినవాఁడే యతి యనఁబడును. బహుశః పూర్వమిది శిష్యులగుటకు గుర్తుగా నేర్పరచఁ

బడి యుండును. ఆసిలువయగు దండమును వారెంతయో పూజింతురు. ప్రభువైనక్రీస్తు ఇట్లుచెప్పెను. "నా శిష్యుఁడు కాఁదలఁచినవాఁడు తన సిలువను మోసికొని తనను వెంబడించవలెను. ఈ దండమును ధరించిన యీకాలపు సన్యాసులు దానిముఖ్యార్థమును గ్రహింపకపోయి యుందు రని కొందఱెంచెదరు.

45

త్రిపుండ్రము— ఊర్ధ్వ పుండ్రము—నామము—అను చిహ్నము లను వారివారి మతాచారానుసరణముగ హిందువులు తమలలాటముల యందు తిలకరూపమున ధరింతురు. ఏదియోయొకవిధమగు బొట్టును బెట్టని హిందువుఁడే యుండఁడు. ఈ నామములు అడ్డగీతలు నిలువు గీతలు కలవై మధ్యనో లేక యెచ్చటనైన నొకస్థలమున సిలువయొక్క యాకారము కలిగినవై యుండును. దీని భావమును పెద్దలు విమర్శించె దరుగాక.

46

ప్రతి హిందువునియొక్క తలవాకిటను ప్రాతఃకాలమున శుభ్రి పరచి ముగ్గుల నలంకరింతురు. ఆముగ్గుల నెన్నివిధముల మార్చివేసినను మధ్యనో లేక యేప్రక్కనో సిలువయొక్క యాకారమును కలిగించెదరు.

47

మతవిషయములగు కర్మల నాచరించు ప్రతిగృహస్థును అట్టికర్మల నాచరించుటకు ముందు అగ్ని ప్రతిష్ఠాపనమును చేసికొనును. అట్టి అగ్ని నుంచు స్థలము నావుపేడచే శుభ్రిపరచి అలికి బియ్యపుపిండితో పట్టు చేసెదరు. ఆపట్టులో నగ్నినుంచు స్థలమున నడఁగా మధ్యను సిలువను వేసెదరు.

48

వివాహములయందు నాకబలియను ముగ్గనందేమి పాణిగ్రహణ మహోత్సవకాలమున దంపతులను కూర్చుండబెట్టు తావుననేమి మటి

యితర మతవిషయక విధుల నిర్వర్తించు ప్రదేశములయందేమి శుభాశుభ ములయం దెల్లెడలను ముగ్గువేసి అందులో సిలువలు వేసెదరు.

**భగవద్గీతలు.** **బైబిలు.**

హిందూదేశమున బుద్ధిపై శాల్యముచే నూహించిన మతవిషయక ముఖ్యాంశము లన్నియుభగవద్గీతలయందు సూత్రప్రాయముగా నిమిడ్చిరి. ఈ గ్రంథమును హిందూమత సారమని చెప్పవచ్చును. గీతలను చక్కగాఁ జదివినందువలన దేలుసారాంశము దేవుఁడు మానవావతార మెత్తవలయు ననునిరీక్షణయే. ఈగీతల కాలనిర్ణయమును గూర్చియు, తద్గ్రంథకర్తను గూర్చియు పలువురు పండితులు పలు గ్రంథములయందు బహువిధముల చర్చించి యుండిరి. ఆయాసంగతుల చర్చించుటకిది సమయముకాదు గనుక విడిచితిమి.

జె. యెన్. ఫార్క్వహారు. ఎం. ఏ. యనుపండితుఁడిట్లు వ్రాసెను:—

“ గీతలను చదువవలసిన రీతిని చదివినయెడల నాగ్రంథము క్రీస్తు యొక్క రాకనుగూర్చిన స్పష్టమగు ప్రవచనమని గ్రహించవచ్చును. కృష్ణుని పాదారవిందములపై తమప్రేమను వెదజల్లు హృదయము లన్నియు మానవావతారము నెత్తనైయున్న దేవుని కుమారునికై నిరీక్షించునదియే గీతలయందు చెప్పఁబడిన కృష్ణుని వాక్యములకును ప్రభువైన యేసుక్రీస్తుని వాక్యములకును ననేక తావుల నభేదాభ్యవసానము కలిగి యుండుటచే మా చదువరులు తమకు తామే చదువుకొని పోల్చి చూచుకొనుట కనువగునటుల నట్టివానిలో గొన్నిటిని మాత్రమిం దుదాహరించుచున్నాము.

యేసు. 49 కృష్ణుఁడు.

సీ॥ “ పరలోకమందును ధరణిపై నాకు సర్వాధికారం బదియబ్బియుం డె.” (మత్తయి. XXVIII. 18.)

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే స చరాచరమ్। హేతు నేనకౌంతేయ జగద్విపరివర్తతే॥ (గీత. IX. 10.)

50

"సమస్తమును నాతండ్రిచేత నాకప్పగింపఁబడియున్నది; కుమారుఁడెవఁడో తండ్రి తప్ప మఱియెవఁడు నెఱుఁగఁడు; తండ్రి యెవఁడో కుమారుఁడును, కుమారుఁడెవని కాయనను బయలుపరచఁగోరునో వాఁడునుదప్ప మఱి యెవఁడు నెఱుఁగఁడని చెప్పెను." (లూకా. X. 22.)

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానానిచార్జున। భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన॥ (గీత. VII. 26.)

51

"పాపములు క్షమించుటకు భూమిమీఁద మనుష్య కుమారునికి నధికారము గలదనిమీరు తెలిసికొనవలెనని వారితోఁ జెప్పెను." (మార్కు. II. 10).

శ్లో॥యోమామజమనాదించవేత్తి లోక మహేశ్వరమ్। అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ (గీత. X. 3.)

52

"నన్ను వెంబడింపఁ గోరువాఁడు తన్నుతానే యుపేక్షించుకొని తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపవలెను." (మార్కు. VIII. 34.)

శ్లో॥ చేతసాసర్వకర్మాణి మయి సన్న్యస్యమత్పరః। బుద్ధియోగము పాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ॥ (గీత. XVIII. 57.)

53

"తనకుఁ గలిగినదంతయు విడిచి పెట్టనివాఁడు నా శిష్యుఁడు కానేరఁడు. (లూకా. XIV. 33.)

శ్లో॥ శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః। సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥ (గీత. IX. 28.)

54

"చ|| ఉరుతర భారమూని శ్రమ మొందెడియో జనులార! మీరు నా దరికరు దేరుఁడీ శ్రమముఁ దప్పఁగఁ జేసెద." (మత్తయి. XI. 28).

శ్లో|| సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః|| (గీత. XVIII. 66).

55

"క|| నాకై యభ్యంతరముం గై కొనకున్నట్టివాఁడు కడుధన్యుఁడు." (మత్తయి. XI. 6)

శ్లో|| అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్। పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్|| (గీత. IX.)

56

"క||......నాదు యుగంబుం జొప్పడియుండెన్ లఘువై జెప్పితి భారంబు నన్నుఁ జెందక యుండెన్||" (మత్తయి XI. 30.)

"శ్లో|| ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః। మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః||" (గీత. VI. 14.)

57

"చ||...నేఁగఅపు తోరపుమార్గము లభ్యసింపుఁడీ||" (మత్తయి. XI. 29.)

శ్లో|| సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే। సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా|| (గీత. XVIII. 50).

58

"నాశనమే వారి అంతము. వారి కడుపే వారికి దేవుఁడు; వారు తాము సిగ్గుపడవలసిన సంగతులయందు అతిశయపడుచున్నారు. భూసంబంధమైనవానినే నమస్కరించుచున్నాడు." (Phili. III. (10-19.)

శ్లో|| మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః। రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః|| (గీత. IX. 12).

59

1. హిందువుల శ్రీమహావిష్ణువునకును బైబిలునందుఁగల యెహోవా కును విశేష భేదములేదు.

2. ఆదిని శ్రీమహావిష్ణువునుండి యావిర్భవించిన బ్రహ్మ శ్రీమహావిష్ణుని మానస పుత్త్రుఁడు. అటులనే క్రీస్తును దేవుని కుమారుఁడు.

3. బ్రహ్మను ప్రజాపతియందురు. ఆశబ్దార్థము ప్రజలకు ప్రభువనియే గదా. అటులనే క్రీస్తును మానవులకు ప్రభు వనఁబడుచున్నాఁడు.

4. సృష్టికిపూర్వమే బ్రహ్మ కలఁడని శాస్త్రములు జెప్పుచున్నవి. క్రీస్తును సృష్టికి పూర్వమునుండియు కలఁడు. (కొలస్సీ. 1: 15.)

5. బ్రహ్మను విశ్వకర్మ యని పిలుతురు. దీనికి ప్రంచమును నిర్మించిన వాఁడని యర్థము. క్రీస్తును ఈప్రపంచమును సృష్టించినవాఁడని బైబిలు చెప్పుచున్నది. (యోహాను. 1: 3. కొలస్సీ. 1: 16.)

6. బ్రహ్మ తనను లోకముకొఱకు బలిగా నర్పించుకొనెను. క్రీస్తువ ట్లొనర్చెను. (1 కొరింథి 4.)

7. మానవుల కందఱికి ముక్తి నిచ్చుటకే యిట్లుభయులును చేసిరి. (హెబ్రీ. LXX. 22.)

8. ఈ యుగమున వీ రుభయులును తమరే యజ్ఞపశువులుగా సమర్పించుకొనిరి. (హెబ్రీ. LXX. 41.)

9. ఈ బల్యర్పణమూలమున బ్రహ్మ దేవతలకు (యెన్నికొనినప్రజలకు) ముక్తిసంపాదకుఁడాయెను. క్రీస్తును అట్లే యొనర్చె. (యోహాను. 16: 47, తిమొ. 1: 10.)

10. ప్రజాపతి దేవతల నుద్ధరించుటకు మానవశరీరమును దాల్చెను. అదే క్రీస్తును జేసెను. (హిబ్రూ. 10: 15.)

11. ఈ యాగమువలన ప్రజాపతి దేవమానవుఁడాయెను. క్రీస్తువిషయమునను నట్లే జరిగెను. (రోమా. 1: 3. 4.)

12. ప్రజాపతి పరిశుద్ధ స్వభావము గలవాఁ డగుటనే పురుషుఁ డని పిలువఁబడెను. క్రీస్తును పరిపూర్ణమైన మానవ స్వభావము కలవాఁ డగుటచే మనుష్యకుమారుఁ డని పిలువఁబడెను.

13. దేవతలందఱును మృతినందవలసివచ్చుటచే వారికి ప్రత్యామ్నాయముగా పురుషుఁడొక్కఁడే మరణించెను. 2. కొరింథి 5: 15. లో క్రీస్తుని గురించియు క్రీస్తుని మరణమును గురించియు నిదేవిధముగా వ్రాయఁబడెను.

14. సృష్టియంతయు నేనే యనియు నాలో సృష్టి యావత్తును బలి యాయె ననియు ప్రజాపతి చెప్పెను. అటులనే క్రైస్తవు లంద ఱును క్రీస్తునందు మృతిబొందుదుమని తలంచెదరు. (రోమా. VI. 8.)

పై పదునాలుగు వాక్యములును, 'పులినే ఆండే' యనువారు వ్రాసియుండిరి.

60

హిందువులు దేవత లని వాడుకొనువారే బైబిలునం దుదహ రింపఁబడిన (యెన్నిక పురుషులు Chosen people) అయియుందురు. ఆదేవతల సంరక్షణార్థమై దేవుఁడనేకావతారముల నెత్తెను. విష్ణువు యొక్క దశావతారములను విభజించి యోజించి చూచినయెడల నీయవ తారములన్నియు దేవతలను వారివిరోధులనుండి సంరక్షించుటకే యొత్తి నటుల శాస్త్రములనుండి గ్రహింపఁగలము. అటులనే యూదులను రక్షించుటకే మోషేకు పొదలో మంటనలె నింకనుఅనేకరీతుల దేవుఁడు సంచరించెను. హిందూమత గ్రంథము లన్నియును దేవతలను గూర్చియే బోధించుచున్నవి. దేవతలు తదితరులగు జనులతో యుద్ధములు చేసిరి. కొన్నిసార్లు పరజనులచే పరాజితులైరి. తత్ఫలితముగా నింద్రుఁ డనఁదగు వారిరాజు రాజ్యభ్రష్టతను పొందెను. వారు పాపములను చేసిరి. దేవుని

క్రోధానలము వారి నాక్రమించెను. తుదకు దేవుఁ డేర్పరచుకొనిన దేవతలు (Chosen people) గనుక వారు తిరిగి స్థాపించఁబడిరి. ప్రస్తుత కాలమున యూదులు లేకుండ చేయఁబడినటుల దేవతలు తరిమివేయఁ బడుటను గూర్చి యేగ్రంథములయందును చూడముగాని యీకాలములో దేవతల స్వరూపస్వభావముల నెచ్చటను మనము చూడకుండుటచే వారికిని యూదులగుటయే కలిగినదని తలంపవచ్చును. పూర్వకాలమున నట్లు సంచరించి వ్యవహరించిన దేవత లీకాలమున నేమియు చేయకుండుటయే దీనికి నిదర్శనము.

61

వసుదేవుఁడు పసిపాపయగు శ్రీకృష్ణుని రేపల్లెకుఁ గొనిపోవు నప్పుడు యమునానది పాయయిచ్చెనని వ్రాయఁబడియున్నది. ఐగుప్తు నుండి లేచివచ్చునప్పు డిశ్రయీలకు నట్లె నది పాయయిచ్చినదని బైబిలు నందు వ్రాయఁబడియున్నది.

వీనినన్నిటిని మేము యిదమిద్ధమని సిద్ధాంతీకరించితిమని యెవరును తలంపఁ బనిలేదు. ఇవియన్నియు చదువరు లాలోచించుటకై యుదహరింపఁబడినవి. వీని సత్యాసత్యముల విమర్శనమీఁద నిర్ధారణ చేయఁ దగినది.

---

## 22. అధ్యాయము.

### ముగింపు.

ఈ పుస్తకమున నింతదనుక బైబిలునందతర్లాపులుగా నిమిడి యున్న విశేషాంశములను బేర్కొనియుంటిమి. ఈప్రయత్నమునందు మే మెంతవఱకు జయమునందితిమో చదువరులు నిర్ధారణ చేయవలసియున్నది. క్రైస్తవ హిందూమతములకుఁ గల సామరస్యమునుగూడ వెలువరుచఁ బ్రయత్నించితిమి. ఈ కార్యమున మా భావమును చదువరులు గ్రహించి

వెంబడించినచో నుభయమతస్థులకును గల పరస్పర వైరము లంతరించి సోదరభావము కలుగఁగలదని మానమ్మకము. తత్తన్మతాంతర్యభావముల నెఱుంగకయే చేసికొను నన్యోన్య దూషణభూషణ తిరస్కారంబు లుడుగును. ఈ మతద్వయములవారును సోదరభావమున మెలఁగి లోపాలోపములఁ గూడదీసికొని సవరించుకొన ప్రయత్నించిన కొలఁదికాలమునకే దేశానుగతికములగు నాచారములును దైనిక సాక్షిక మాసిక సాంవత్సరికాగతములగు కృత్రిమకర్మలును నశించి స్వచ్ఛమగు మతసారములు ప్రజానురాగంబునకు పాత్రంబులై నిలుచును. అట్టి మతద్వయసారాంశముల కద్వైతసిద్ధి కలుగును. ఉభయ మతస్థుల ప్రస్తుతావస్థ ననుసరించి యట్టికాలము సమీపించుచున్న దనుకొన వీలులేదు కాని యెన్నటికైన నట్టికాలము రాఁగలదని యాశించుట యసంబద్ధము కానేరదు.

ఈ గ్రంథమున వివరించిన సంగతుల వెల్లడిచేయుటలో నిరుమతములవారి హేళనకును పాత్రుఁడ నయ్యెద నని నే నెఱుఁగుదును. ఇందొక తెగవారైన నామోదింపరు. కాలము గడచినకొలఁది నెప్పటికైన నావాక్యములకు విలువ కలుగకపోదు. ఏలయన హేళనకు పాత్రుఁడ నగుదు నని యెఱిఁగియుండినను నాలో నున్న భగవత్తత్వ మీవాక్యముల వెల్లడింప ప్రేరేపించుచుండెను. ఎటులనైన నీక్రింద వివరింపఁబోవు సంగతులను మా చదువరులందఱు దయతో శ్రమకోర్చి శ్రద్ధగా చదువవలయుననియు, చదివినపిదప వారియంతరాత్మ లామోదార్హము లని ప్రబోధించినవానిని నిర్భీకులై యవలంబించవలయుననియు పాఠకుల నందఱఁ బ్రార్థించుచున్నాము.

ఎవ్వరైనను దేవునిచిత్తమును నెరవేర్చినయెడల భగవత్తత్వము వారికి గోచరమగునని క్రీస్తు చెప్పియున్నాఁడు. దేవునిచిత్తమేదో యది క్రీస్తు చెప్పిన రెండాజ్ఞలలో నిమిడియున్నది. "నీ దేవుఁడైన ప్రభు

వును నీపూర్ణ హృదయముతోను, నీ పూర్ణ శక్తితోను, నీ పూర్ణ వివేకముతోను ప్రేమింపవలె నవియు, నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెను.” (లూకా. 10: 27.)

పైవాక్యమున భగవంతుఁడు మానవుఁడాచరించుటకు నియమించిన విధులన్నియు సంగ్రహముగా నిమిడియున్నవి. “ఏలయనఁగా వ్యభిచరింపవద్దు, నరహత్య చేయవద్దు, దొంగిలవద్దు, ఆశింపవద్దు అనునవియు, మఱియేయాజ్ఞయైన నున్నయెడల నదియు, నీవలెనే పొరుగువాని ప్రేమింపవలె ననువాక్యములో సంక్షేపముగా నిమిడియున్నవి.” (రోమా.13:9).

కావున మనము క్రైస్తవులమైనను హిందువులమైనను మన దినచర్యలో మన నడవడిని దైవేచ్ఛ కనుగుణముగా మార్చుకొనఁ బ్రయత్నించుట కర్తవ్యము. పూర్వోక్త సత్యవేదవాక్యమును సదా మదినిడుకొని తద్వ్యతిరిక్తముగ మన హృదయమును పురికొల్పు ప్రతి తలంపును దూరముగా తరిమివేయవలయును. ప్రతికార్యమును ముందుతలంపుగా హృదయమునందంకురించి తుద కాచరణలోనికి దింపును. పైన చెప్పినరీతిని భగవదుక్తములగు పైరెండువిధులను మఱువక వాని నాచరించుటకు మనోవాక్కర్మలచే ననువర్తింప యత్నించి తత్కృషియందు జయమునందిననే గాని క్రైస్తవమతమునందైనను హిందూమతమునందైనను నిజతత్త్వమును గ్రహించు సామర్థ్య మేమానవునికిని కలుగనేరదు. అప్పుడేగాని నేను క్రైస్తవుఁడననిగాని నేను హిందువుఁడననిగాని యెవ్వఁడును అంతశ్శుద్ధితో దృఢముగా పలుక సమర్థుఁడు కాఁడు.

ఈ కాలమున జరుపఁబడు మతసంబంధమైన వివాదములన్నియు మున్నీసములు సత్యమును గ్రహించి తమ నడతను దిద్దుకొన నిసుమంతయు ప్రయత్నించని మూఢభక్తుల వశములై యున్నవి. ఇట్టివారిచేఁ జరుపఁబడు వాదములు మనస్తాప పర్యవసానమాత్రములేయగుచు తుదకు వివాదాంశములు ప్రారంభించిన చోటనే నిలిచియుండును.

పైనిచెప్పిన క్రీస్తుని యాజ్ఞాన్వయంబునకును, వేదాంత సూత్రముల లోని మొదటి సూత్రమునకును కడు సాన్నిధ్యము కలదు. బ్రహ్మజ్ఞానార్థమై కృషిచేయుటకు ప్రారంభింపక మునుపే యట్టివారు సాధనచతుష్టయ సంపత్తి నార్జించియుండవలె ననునదియే యా ప్రథమ సూత్రము. ఈ సాధన చతుష్టయ సంపత్తిని చక్కగావిడఁదీసి విచారించినచో లూకా. 10: 27, రోమా. 13: 9 వాక్యములలో చెప్పఁబడిన దానికి తార్కాణముగ నుండును.

యోహానిట్లు చెప్పుచున్నాఁడు:—"ఈసంగతులు మీరెఱుఁగుదురు. గనుక వీనిని చేసినయెడల మీరు ధన్యులగుదురు." (యోహాను 13: 17.)

పై వాక్యముగూడ సూత్రప్రాయముగ తత్త్వవిచారణ చేసినంత మాత్రమున నెంతమాత్రమును ప్రయోజనములేదని చెప్పుచున్నది. భగవద్ధత్తములగు నీతివాక్యముల నాచరణయం దికుకొనినవారే ధన్యులు. మతసంబంధము లగు గ్రంథములు గట్టలుకట్టలుగా నున్నవి. నీతివాక్యములు పెక్కులు పెక్కుశైలుల వ్రాయఁబడియున్నవి. వాని నాజన్మము ను పఠించుచుండినను ననుసరింపకుండిన నేమియు మేలును చేయఁజాలవు.

'గోవని, లుజ్జి' యను నిటలీదేశపు తత్త్వవేత్త యిట్లు వ్రాసెను:—

"క్రీస్తువిషయమైన నిజమైన సాక్షి యెవరు? వానిని బోధించువాఁడుకాడు; ఇతరమతములలోని లోపములను పరి లోకమునకు వెల్లడించుచుండెడివాఁడు కాడు; మఱియొక క్రైస్తవసంఘములోని లోపములఁ జూపువాఁడు కాడు; క్రీస్తువాక్యముల నెప్పుడు నుదాహరణముగ నెత్తిచెప్పుచుండువాఁడు కాడు; కాని తనయుచ్ఛ్వాస నిశ్వాసములయందు క్రీస్తునర్తించువాఁడు, క్రీస్తుయొక్క జీవితమును తనజీవితముగ మార్చుకొనినవాఁడు, క్రీస్తుద్వారా తండ్రియైన దేవునిదయను సంపాదించుకొనినవాఁడు, ఇట్టివాఁడే క్రీస్తుని విషయమున నిజముగ సాక్ష్యమిచ్చువాఁడు."

'హేమ్రీదానుఁడైక' ననునతఁ డిట్లు వ్రాసెను:—

"తెలిసికొనుటకును, తెలిసికొనినదాని నవలంబించుటకును మధ్య నొక పెద్దనది యడ్డము కలదు. అనేక అసౌఖ్యము లీనదిలో పడి

మునింగిపోవుచున్నవి. ఈ నది కడ్డుకట్ట జ్ఞాన మనుభూమిని ఆచరణమను భూమితో కలిపినప్పుడుగాని నరునకు సౌఖ్యము కలుగనేరదు. క్రీస్తు చెప్పిన సంగతులను తెలిసికొనినను విశ్వాసహీనునివలె వాని నాచరణ యందవలబింపకపోయినచో తెలిసికొనిన ప్రయోజనము లేదు. దేవుఁడు మనకు తండ్రియని గ్రహించియు వానిని ప్రేమింపక వానియాజ్ఞల నను వర్తింపకపోవుటకంటె నరకము వేఱకలదా? ఉత్తరలోకమున శాశ్వత స్వర్గానుభవమునం దీ వీలుకలదని తెలిసియు క్షణభంగురమగు నీమృణ్మయ దేహమునందే సౌఖ్యలేశములనో పొందగోరి మన యాత్మయు వ్యర్థపరుచు కొనుటకంటె యజ్ఞానము కలదా? నిశ్చయముగా దీనికిమించిన కష్టములు లేవు. సత్యమునుగ్రహించి యాచరణయందుంచుకొనుటయే నిజమైన జ్ఞానము. సత్కార్యాచరణమే నిజమైన జ్ఞానము. దేవుని చిత్తమును నెరవేర్చినవాఁడే వాని తత్త్వగ్రాహి యగునని క్రీస్తు చెప్పెను.

ఎవ్వఁడైనను క్రైస్తవము తనకు తండ్రియను సత్యమును తీసికొననిమ్ము. దాని యర్థమును గ్రహించి తదనుగుణముగ వర్తింపనిమ్ము. పసివాడు తనతండ్రి సమస్తమును తన కమర్చునను నమ్మికతో నుండురీతిని తనకుఁ గల మనస్తాపములను, ఆతురతలను విడచి తండ్రియైన భగవంతుఁడే సర్వమును సమకూర్చఁగలఁడను నమ్మిక కలిగి నిశ్చింతగ నుండనిమ్ము. ప్రతి దినమును శక్తివంచన చేయక తనకు తటస్థించు కార్యముల నాచరించు చుండనిమ్ము. వాని ఫలితములను తండ్రికే వదలివేయనిమ్ము. ప్రతిదినమును తనతండ్రియైన దేవుని సమీపించి తమకష్టసుఖముల నాంతర్య పూర్వకముగ చెప్పుకొని, తమ తప్పితములను తండ్రియెదుట నొప్పుకొని క్షమించి సన్మార్గమున నడిపింపుమని వేడుకొననిమ్ము. ప్రతిఫలాపేక్షతో గాక తండ్రియెడలఁ గల యనురాగము ననుసరించి దేవుని ప్రేమించినవానికి సంతోషము కలుగునట్టుల నడుచుకొననిమ్ము. లోకుల యొక్క నిందలనుండియు, నపవాదలనుండియు, కృత్రిమ ప్రవర్తన లనుండియు, కష్టములనుండియు బెగ్గిలి తండ్రిచాటున దాగికొననిమ్ము. నిశ్చయముగా భగవంతుఁడు తండ్రియను నొక్క సత్యమును గ్రహించి వాని నాచరణమున దయగల తండ్రినివలె ననుసరించిన నెంతయో సౌఖ్య దాయకము.

25956
25.5.73.

జీవము శాశ్వత మగునను నొక్క సంగతిని గ్రహించిన చాలదా? తాను యుగయుగములకును శాశ్వతముగా జీవించవలసినవానిని నెఱింగి ప్రస్తుతకాలము గడపిన నెంతటిమార్పులు కలుగును. ఏక్షణమున నైన మారఁదగిన యీ భూలోక జీవనమున నడుగడుగునకు తటస్థించు స్వల్పకష్టముల నట్టివాఁడు సరకుచేయునా? స్వల్పలాభములకై దుష్కృత్యములఁ జేయునా? క్షణభంగురములగు శరీరేచ్ఛలకై పరితపించునా? పాపకార్యముల నాచరించునా? ఆత్మాభివృద్ధికై పాటుపడఁడా? యీ లోకమున కలుగు సుఖదుఃఖము లణుమాత్రము లనియు స్వల్పకాల వ్యాప్తములనియు గుర్తెఱింగి వానిని సరకుచేయక శాశ్వతమగు నాత్మానుభవమునకే పాటుపడగలఁడు. తనసాటివా రందఱును తనవలె శాశ్వతపదవి కర్హులని యెఱింగి వారిని తనతోడివారలుగా నెంచి వారి యభివృద్ధికై పాటుపడును. నిశ్చయముగా నిట్లు సంచరించినవాఁడు సౌఖ్యవంతుఁ డగును.

ప్రియమైన పాఠకుఁడా? నీ ప్రస్తుతావస్థ ననుసరించి నీహృదయము నాకర్షించిన సత్యములను నీ వాచరణయం దిడుటకు ప్రయత్నించుము. వాటిని సహేతుకముగ నీ వాచరించుటయందు ఘటికుఁడ వగునప్పటికి నీ యంతఃకరణమున కిదివఱకుకంటె నిర్మలమైనట్టియు సూక్ష్మమైనట్టియు పరతత్త్వవిషయిక సత్యములు గోచరింపఁగలవు. వానిని తిరిగి యాచరణము నందిడుకొనవలయును. ఇటుల నీవు మనస్ఫూర్తిగ దినదినాభివృద్ధి నందినచో సమస్తమును నీకు కరతలామలకము కాఁగలదు. ఇటుల నీవు వ్యాపారములయందు ప్రారంభించిన క్రమశః సాంఘిక నైతిక వ్యాపారములయందును తుద కాత్మతత్త్వ పరతత్త్వజ్ఞానములయందు నభివృద్ధిని చెందఁగలవు. అప్పుడు నిజమైన మతమేదో నీకు గోచరము కాఁగలదు. ఏతన్మార్గానుసరణమున దేవాలయమగు నీతనువు నైర్మల్యమును విసర్జించి భగవన్నివాసమున కర్హమైనదగును. అప్పుడు దేవునిపరిశుద్ధాత్మ నీలో ప్రవేశించి తనవెలుగును స్వేచ్ఛగ ప్రకాశింపఁజేయును. అప్పుడు నిజమైన దేవుని శక్తిమహిమలచే పరివృతుఁడవు కాఁగలవు. నీరక్షకుఁ డేక్షణమున నీలో ప్రవేశింతునా యని నీ హృదయద్వారమున వేచియున్నాఁడు. నీవు మార్గమునిచ్చిన చాలును. వానిని నేఁడైనను రేపైనను నీవంగీకరింపక తీరదు. ఎప్పటికైన నంగీకరింపక తీరనప్పుడు నేఁడె యంగీకరించి నీ మనోవేదనను

వెంటనే నివారించుకొనుట యుక్తము. నీ యసమర్థతను నీవు గుర్తించి ప్రభుసహాయమును కోరి దానికై విలపించువఱకు నీమీదికి కష్టములను పంపుచునేయుండును.

వానికి నీవు తావిచ్చుటయన వానిదృష్టిలో కష్టమైనపని కాదు. నిజమునకు సహజమైన కార్యము. నీ వొకప్పుడట్టి సహజమైనస్థితిలో నుంటివి. కాని పాపము భూలోకమున ప్రవేశించి మనుజుని తలంపులను కోరికలను సహజవిరుద్ధములైన మార్గములలోనికి మళ్లించెను. కావున దృశ్యములైన పదార్థములమీద నీ కలవడిన స్వభావవిరుద్ధేచ్ఛలను నీవు తొలఁగించుకొనిన వైశారీరక నైతిక ధర్మశాస్త్రము లన్నియు నీకార్యము నందిమిడియున్నవి. ఇటుల చేయుటవలన నీ శరీరమను దేవాలయ పరతత్త్వ నివాసయోగ్యమగును. అటుల శుద్ధిచేసి సిద్ధపరచిన నుత్తరక్షణమున ప్రభు వందు నివసించుట నిశ్చయము. పౌలుయొక్క మనోనిశ్చయము క్రైస్తవుల హతముచేయుటయైయుండినను వానిదేహామనోవస్థలు సరియైన వగుటనే కదా ప్రభువు వానికి దర్శనమిచ్చెను. మనమిదివఱకు చేసిన పాపము లన్నిటికిని వలయు ప్రతీకారమును తన మరణమువలన నొనర్చి హరించి క్షమించియుండెను. నీవు పరిశుద్ధుఁడ వగుకొలఁది వాని సత్యాసత్యములు నీకు వెల్లడియగును. ప్రభువునకు నీయంతఃకరణమున తావొసంగినకొలఁది వానిజ్ఞానము నీయందు ప్రకాశించును.

కావున నో చదువరీ! నీకాలమును వ్యర్థప్రసంగములోను వివాద ములలోను వ్యయపరచక నీకు కలిగిన సహజ జ్ఞానముచే ప్రబోధింపఁబడు శారీరకనైతిక న్యాయముల నాచరించుటయందు వినియోగించిన తత్ఫలిత ముగ కాలక్రమమున వివాదాంశములన్నియు నీకు వెల్లడికాఁగలవు. ముక్తినందుటకు ప్రభువైన యేసుక్రీస్తుయందు విశ్వాసముంచి వాని నంగీక రించుటయు, నీతివిధుల నన్నిటి నాచరించుటయును గర్తవ్యములని పౌలు రోమీయులకు వ్రాసిన పత్రికలో నష్టమోధ్యాయమున ముప్పదినాల్గవ వచనమున చెప్పియుండెను.

'యద్దృశ్యం తన్నశ్యం' అను నార్యోక్తిని వినలేదా? కనుపడున దంతయు నశింపఁగలదు. నశించుటకు పాత్రమైన ప్రతివస్తువును శాశ్వత మైనది కానేరదు. కొలఁదికాలముండునదియే యగును. తనయొద్దనుండి

యేక్షణమునందైనను తీసివేయఁబడుటకు సిద్ధముగానుండిన యేవస్తువునందైనను తన ప్రేమను లగ్నముచేసినట్టివాఁడు వెఱ్ఱివాఁడు కాఁడా? మన కిచ్చగలిగిన యేవస్తువునైనను కొంతకాలమువఱ కనుభవించుటకు మన శరీరమే క్షణభంగురమాయెను. ఆవస్తువులా తత్తుల్యములాయెను. కావున నట్టివానిని ప్రేమించిన నది మనలోపమే. ప్రేమకు పాత్రములు కానివానిని ప్రేమించినవారమగుదుము. అట్టి యపాత్రమైన ప్రేమ దుఃఖములలోనికి దింపకతీరదు. ఇందువలననే పౌలు రోమీయులకు వ్రాసిన పత్రికలో నిట్లు వ్రాసెను. "మీరు శరీరానుసారముగా ప్రవర్తించినయెడల చావవలసినవారై యుందురు. కాని ఆత్మచేత శరీరక్రియలను చంపినయెడల జీవించెదరు." (రోమా. 8: 13.)

ఈ కాలమున ప్రదర్శింపఁబడుచుండు 'బయోగ్రాఫు' యంత్రకారకునితో దేవునిపోల్పనగును. ఆయంత్రమును సృష్టితోను ఆయంత్రమున గలబొమ్మల లంకెను మనయాత్మలతోను, అందమర్పబడిన విద్యుద్దీపమును పరిశుద్ధాత్మతోను సాదృశ్యము చేయవచ్చును. భూలోకచర్య తెరయనవచ్చును. తెరపై నాడు బొమ్మలతో మానవశరీరముల నుపమింపనగును. తమంతట తామే స్వతంత్రశక్తిని కథనడుపుచున్నట్లు చూపరులకు విభ్రాంతి కలిగించు నీ తెరపై నాడుబొమ్మలుయంత్రమునఁ గల విగ్రముల ఛాయారూపము లైయున్నవి. ఆ విగ్రహములైనను విద్యుద్దీపికచే ప్రకాశింపఁ బడుచున్నవి. వీని నన్నిఁటిని సూత్రధారుఁడు తన చిత్తవృత్తిని నడిపించుచున్నాఁడు. ఇట్టి స్థితియందు తెరపైనాడు ఛాయా విగ్రహములకే విమర్శనాజ్ఞానము కలదనుకొనుము. అటుల స్వాతంత్ర్యమును వడసినను అవి తమతోటి ఛాయా విగ్రహములవలననే తమకు సకల సుఖములు లభించఁ గలవని దురభిప్రాయపడినచో వానిగతి యెట్లుండును? అటులనే యీ ప్రపంచమున సకల దృశ్యపదార్థములును లోనఁ గల భగవత్తత్త్వమువలన నుజ్జీవింపఁబడిన ఛాయాపటములవంటివి. శాశ్వతము లైనవికావు. క్షణభంగురములు. అట్టి క్షణికములగువానిపైని మనము మనప్రేమనునాశను నిలుపుకొనినయెడల దుఃఖమే ఫలితముగ సంప్రాప్తమగును. బుద్బుదప్రాయము లగుట త్వరలో నశింపకమానవు. వానిని ప్రేమించినచో నచిరకాలమున కలుగఁబోవు నెడబాటువలన దుఃఖముగాక సౌఖ్య మెటుల

దొరుకును? కావుననే యన్నిమతములును బాహ్య ప్రపంచముపైని విరాగివి కమ్మని యేకకంఠమున నుద్ఘోషించుచున్నవి. ఏకో నారాయణ మూర్తియందే మన యాశలను నిలుపుకొనవలెను. తన భారమంతయు వానియందువైచి వాని చిత్తమును నెరవేర్చువాఁ డెవ్వఁడును కష్టముల కాకరము కాడు; ఇహమందు సౌఖ్యమును, పరమందు శాశ్వత స్వర్గ వాసమును పొందఁగలఁడు. మతముయొక్క రహస్యమిదియే. ఈ సంగతులను మనస్ఫూర్తిగ నమ్మి తదనుగుణ్యముగ తన ప్రవర్తనను మార్చుకొను వాడు క్రమశః భగవత్తత్త్వ రహస్యార్థములను గ్రహింపఁగలఁడు.

భగవంతుఁడు ప్రపంచోద్ధరణార్థమై యేకముగా నొక్కసారియే తనను తాను బలిగా నర్పించుకొనియెను. ఈ హంశము నేసువార్తలును వేదములునుద్ఘోషించుచున్నవి. తాను నీకును నాకునుకూడ తన తత్త్వమును వెల్లడించి దీవనల నందఱిపైని వర్షింప సంసిద్ధుఁడైయుండెను. వానిని మనలోఁ చొరనిచ్చుభారము మనయందే యున్నది. అది యెట్లనిన వాని చిత్తమును నెరవేర్చుటయే. వానిచిత్తమేదనిన, "నీవు నీ దేవుని నీపూర్ణహృదయముతోను, నీపూర్ణశక్తితోడను, నీపూర్ణాత్మతోడను, ప్రేమించుము. నీపొరుగువానిని నీతో సమముగా నెంచుకొనుము" అని క్రైస్తవ మతగ్రంథమునందును, "ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యసి సపశ్యసి" యని హిందూ మతగ్రంథములును ప్రబోధించుచున్నవి.

ఆమెన్ (తథాస్తు).

సంపూర్ణము.

# శ్రీ హైమవతీ పరిణయము

అను

# ఆధునిక కవిజీవితములు.

శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్ జమీందారుగారి జ్యేష్ఠపుత్రికయగు శ్రీ హైమవతీ సీతావిజయలక్ష్మమ్మగారి వివాహమునకు సంస్కృతాంధ్ర కవిశ్రేష్ఠులును, పండితులును, శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిలవారు, మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్న శర్మ గారు, వడ్డాది సుబ్బారాయడుగారు, శొంఠి భద్రాద్రి రామశాస్త్రిలవారు, పేరి కాశినాధ శాస్త్రిలవారు, నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు, శతావధాని వేమూరి శ్రీరామశాస్త్రిలుగారు, కొప్పరపు సోదరకవులు మున్నగు ప్రముఖులు, 200 వచ్చి వధూవరుల నాశీర్వదించిరి. 300 కవిశ్రేష్ఠులు కారణాంతరములచే రాజాలక వారియాశీస్సును పద్యరూపమున బంపియున్నారు. ఈ 500 మంది కవీంద్రుల చారిత్రములు క్లుప్తముగా వ్రాయఁబడి వారి కవితాశైలిని జూపుటకు, వారి యాశీర్వచన పద్యములను వారి చారిత్రముల క్రింద నుదాహరింపఁ బడినవి. ప్రస్తుతము జీవించియుండిన 500 కవుల చరిత్రము లిందుగలవు. సుమారు 1500 పద్యములు కలవు. ఈ గ్రంథమును జూచినవారలు 500 మంది కవీశ్వరుల కవిత్వ శైలులను చదివి యానందించగలరు. వారి చరిత్రములను గ్రహింపగలరు. ఇందు క్రైస్తవులు, మహమ్మదీయులు మున్నగు సన్నికులముల కవీశ్వరులును గలరు.

దీనివెల పోస్టుకర్చులు గాక ఒక రూపాయి.

వలయువారు:—

"భారతీ వేరుహాసు"

ఏలూరు-కృష్ణాజిల్లా, అని వ్రాయవలయును

# సాహసాంకుని విజయగాధలు.

## నెం. 1. అగ్గిరాముని మరణవేదన.

(నవల) దీనివెల 0—2—0.

యూరపు ఖండమున చౌర్యములు చిత్రములైన విధముల జరుగుచుండును. పోలీసువారట్టి దొంగతనములను పట్టుకొనుటయం దతి నిపుణులు. అగ్గిరాముఁడట్టి దొంగల గుంపునకు నాయకుఁడు. ఇతఁడుచేసిన కృత్యములు మహాఘోరములు. సాహసాంకుఁడను పోలీసు గూఢచారి పలుకష్టములకు లోనై దొంగల గుంపును, దానినాయకుఁడగు అగ్గిరాముని పట్టుకొనుటలో చూపిననేర్పంతయు నీనవలయందు వర్ణింపఁబడినది. కొన్నిపట్లు చదువునప్పుడు, శరీరకంపము, మఱికొన్ని పట్లభయము పొడమును. కొన్నిస్థలములయందు కరుణరసము వెల్లివిరియును. దొంగల నాయకుఁడు దొరకినపుడానందరస ముప్పొంగును. చదువరులకు లోకజ్ఞానము విస్తరిల్లుననుటకు సందియము లేదు. సులభసాధ్యముగా నెల్లరు జదువగలందులకై డెమ్మీసైజు 64 పేజీల గ్రంధము వెల 0—2—0. మాత్రమే యేర్పరచడమైనది.

ఇది లోకమునకు రుచించినయెడల నీవిజయగాధలన్నియు నొకదానివెంబడి నొకటిగాఁ బ్రచురింపఁబడును. సాదరమతు లిందలి సార్థకమును గ్రహింపఁ బ్రార్థితులు.

భారతీ వేరుహౌసు,

ఏలూరు, కృష్ణాజిల్లా.



PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS